జాతీయ జీవిత గ్రంథమాల

# మోతీలాల్ ఘోష్

రచన

ఎస్.ఎల్.ఘోష్

అనువాదం

పురాణం సుబ్రమణ్యశర్మ



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# విషయ సూచిక

# రెండవ ప్రచురణకు ముందుమాట

19వ శతాబ్దారంభంలో భారతజాతీయోద్యమం, భారతీయ జర్నలిజం ఏకకాలంలో ప్రాణంపోసుకున్నాయి. ఒకదానినొకటి కాపాడుకుంటూ ముందుకుసాగాయి. స్వాతంత్ర్యం సముపార్జన అనే రాజకీయలక్ష్యం నెరవేరేవరకూ జాతీయోద్యమం, జర్నలిజం జోడుగుర్రాలవలె సాగాయి. 1757 నుంచి 1910 దాకా కలకత్తానగరం బ్రిటిష్ ఏలికలో పాలనాయంత్రాంగపు రాజధానికి స్వాతంత్ర్యం వచ్చేవరకూ ప్రాచ్య భాగాన ప్రధాన వ్యాపారకేంద్రం. ఈ కారణాలవల్ల భారతజాతీయోద్యమం అక్కడే పుట్టింది. కలకత్తానగరమూ బెంగాలీలూ జాతీయోద్యమంలో అసామాన్య భూమిక వహించగలిగారు. కలకత్తా పత్రికల సంపాదకులు భారతరాజకీయ లక్ష్యాలను, అభిప్రాయాలనూ ప్రచారం చేశారు. అంతేకాదు, స్వాతంత్ర్యం వచ్చేవరకూ సుమారు అర శతాబ్దంపాటు ఆ లక్ష్యాలనూ, కార్యక్రమాలనూ రూపొందించిందీ, నిర్దేశించిందీ ఈ సంపాదకులే. దేశానికి రాజకీయ జాగృతి కలిగిన తొలిదశలో ముగ్గురు మహనీయులు చైతన్య రథ సారథులుగా గణుతికెక్కారు. ఈ ముగ్గురూ మూడు మార్గాలలో చైతన్యరథాన్ని ముందుకు నడిపించారు. అన్నగారైన శిశిరకుమార్ శిష్యరికం తర్ఫీదులో మోతీలాల్ ఘోష్ స్వాతంత్ర్యోద్యమ కారుడుగా రూపొందాడు. స్వాతంత్ర్యం సాధించడానికి దేశప్రజల శాంతియుత ప్రతిఘటనోద్యమం ఆవశ్యకతను మోతీలాల్‌ఘోష్ ప్రచారం చేశారు. దేశంలో దశలవారీగా బ్రిటిష్‌పాలన తొలగించడానికి, స్వాతంత్ర్యం సాధించడానికి బ్రిటిష్ వలసరాజ్యం స్వీయపాలనకోసరం పోరాటానికి సురేంద్రనాథ్ బెనర్జీ పిలుపునిచ్చారు. అరవిందఘోష్ సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రతిపాదించారు. అందుకు జరగవలసిన విప్లవోద్యమానికి సైద్ధాంతిక ప్రవక్త అయ్యారు. అరవిందఘోష్ దేశరాజకీయ పోరాటపు మౌలిక ప్రముఖులలో ఒకరు. కుగ్రామంనుంచి వచ్చిన మోతీలాల్‌ఘోష్ ఈ ప్రముఖుల వర్గానికి చెందినవాడు కాదు. కేవలం నాటి గ్రామీణ ప్రజల

సాధకబాధకాలను వంటబట్టించుకుని స్వాతంత్ర్యోద్యమం వైపు మళ్ళారాయన. గ్రామీణ ప్రజలను సర్వనాశనం నుంచి కాపాడాలంటే విదేశీ పాలకులను తరిమివేయాలని గుర్తించి గ్రామీణ పేదల సంక్షేమం కోసం స్వాతంత్ర్యోద్యమంలో మోతీలాల్ అడుగుపెట్టారు.

భారతదేశంలో పరంపరగా వేగంగా చోటుచేసుకున్న తర్వాత పరిణామాల పుణ్యమా అని వర్తమాన దేశం ఈ స్వాతంత్ర్యోద్యమ ఆరంభకులను మరచిపోయింది. అయితే ఒక తరుణంలో మహాత్మాగాంధీ నోటిమీదుగాను, అనంతరం జవహర్‌లాల్ నెహ్రూ ఉపన్యాసాల ద్వారానూ మోతీలాల్ ఘోష్, సురేంద్రనాథ్ బెనర్జీ వంటి ఉద్దండుల గురించి ఆలకించిన ప్రజలు దేశ ప్రయోజనాలకు సంబంధించి వారి అభిప్రాయాలూ, కర్తవ్య బోధనలూ గురించి ఆలోచించవకపోలేదు.

మోతీలాల్‌ఘోష్ వ్యక్తిగత జీవితం అచంచల విశ్వాసాలుగల మానవుడి జీవితం వలెనే వంకలు లేనిది, చాలా స్వచ్ఛమైనది. ఆయన జీవితం పత్రికా రచనలోనూ, రాజకీయ కర్తవ్య దీక్షలోనూ పరిణతి గడించి ప్రాముఖ్యత సంతరించుకుంది. జాతీయోద్యమంలోనూ , స్వాతంత్ర్య పోరాటంలోనూ క్రియాశీలకంగా పాల్గొని రెండు ఉద్యమాలకూ గ్రామీణ పేదప్రజల తరఫున ప్రాతినిధ్యం వహించి ఒక అతి ముఖ్యమైన వ్యక్తిగా భాసిల్లారు ఘోష్.

అందువల్లనే ఈచిన్న పుస్తకంలో మోతీలాల్ ఘోష్ వ్యక్తిగత జీవితాన్ని నేను అంతగా స్పృశించలేదు. ఆయన ప్రజాజీవిత విశేషాలనూ, ఆయన కార్యక్రమాలు, కార్యకలాపాల వివరాలనే ప్రధానంగా పొందుపరచాము.

మొదటి ప్రచురణకు కొన్ని సవరణలతో తిరిగి ఈ గ్రంథం వెలువరిస్తున్న సందర్భంలో నేషనల్ బుక్‌ట్రస్ట్, ఇండియా వారికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. మోతీలాల్ జీవితానికి సంబంధించి కొన్ని విశేషాలు, శ్రీ పరమానంద దత్ వ్రాసిన "మెమోరీస్ ఆఫ్ మోతీలాల్ ఘోష్" గ్రంథంనుంచి గ్రహించాను. అందుకుగాను వారికి కృతజ్ఞుణ్ణి.

న్యూఢిల్లీ,
సెప్టెంబరు 1978.

సచీంద్రలాల్‌ఘోష్

# ప్రవేశిక

**భా**రతదేశ చరిత్రలో 19వ శతాబ్దం చాలా ముఖ్యమైనది. 19వ శతాబ్దంలోనే భారతదేశంలో బ్రిటిష్ పరిపాలన విస్తరిల్లి స్థిరపడడం, ప్రజలు జాగృతమై ఒకే జాతీయతా ఆవశ్యకతను గుర్తించడం, గర్వించదగ్గ భారతదేశపు సనాతన వారసత్వ సంపదను దేశప్రజ పునశ్చరణ చేసుకుని పాశ్చాత్య నాగరికతా సంస్కృతి విసిరిన సవాలుకు ప్రతిస్పందించడం, భారతీయ భాషలు, సాహిత్య రంగం గణనీయమైన అభివృద్ధి సాధించడం పరంపరగా ఏక కాలంలో జరిగాయి. 18వ శతాబ్దం మధ్యలో బ్రిటిష్ వ్యాపారులు బెంగాల్‌ను చేజిక్కించుకొని పరిపాలన ప్రారంభించారు. ఈ కారణంగా బ్రిటిష్ పాలకులు వేసిన పునాదులపై విస్తరిల్లిన కలకత్తా మహానగరం రాజకీయ వుద్యమాలకీ, వ్యాపార కార్యకలాపాలకీ కేంద్రస్థానమై గొప్ప ప్రాముఖ్యత సంతరించుకుంది. విదేశీ పాలకులకీ, స్వదేశీ పాలకులకీ మధ్య సాంస్కృతిక ఘర్షణలకు కూడ కలకత్తా అయ్యింది మొగల్ సామ్రాజ్యం ఎంతో విజయవంతంగా రాజకియ ఐక్యతని సాధించింది బ్రిటిష్ వ్యాపారుల ఏలిక వచ్చిన తరువాత దేశంలోని చిన్నచిన్న రాజులు ఒకరి మీద ఒకరు కత్తిగట్టే పరిస్థితి ఏర్పడింది. అణచివేయబడివున్న ప్రజలు రాజకీయాధికారం మార్పిడిని అంతగా పట్టించుకునే స్థితిలో లేరు ప్లాసీ యుద్ధంలో (1757) బెంగాల్‌పై ఆధిపత్యం చేతులు మారిన తరుణంలో బెంగాల్ ప్రజలు నిస్సహాయంగా చూస్తువుండిపోయారే తప్ప ఎటువంటి ప్రతిఘటన ప్రయత్నం చేయకపోవడంతో భారతదేశపు భవిష్యత్తు నాడు స్తంభించిపోయింది. రాబర్ట్ క్లైవ్ మాటలలోనే చెప్పాలంటే "వేలు, లక్షల సంఖ్యలో ఉన్న నాటి బెంగాల్ జనాభా యురోపియన్లను తరిమివేయాలని ఏ కొంచెమైనా అనుకొని వుంటే రాళ్లు రప్పలే ఆయుధాలుగా ఆ లక్ష్యం సాధించగలిగేవారు. కాని స్తబ్దత వారిని ఆవరించింది." బ్రిటిష్ పార్లమెంటు సెలెక్ట్ కమిటీ సమావేశంలో క్లైవ్ ఈ మాటలన్నాడు.

ఈస్టిండియా కంపెనీ 1757 ప్లాసీ యుద్ధానంతరం తమ పరిపాలన ప్రారంభించిన తరుణంలో భారతదేశపు తూర్పు మండలంలో దాదాపుగా అరాచకం తాండవిస్తోంది. శాంతి భద్రతలు కొరవడ్డాయి. 19వ శతాబ్దం తొలిదశలోకూడ శాంతిభద్రతలు అభివృద్ధి చెందే సూచనలు కానరాలేదు. ఎంతగా ఖరీదు ముట్టచెబితే అంతగా న్యాయం అమ్ముడు పోయేది పాలనాయంత్రాగ సిబ్బందిలో దేశీయులైన అధికారులకి చాలా తక్కువ వేతనాలు దక్కేవి. బ్రిటిష్ అధికారులకి ఎక్కువ జీత భత్యాలు వుండేవి. అయితే దేశీయులైన అధికారులు, బ్రిటిష్ అధికారులుకూడా అవినీతిలో ఒకరికొకరు సరిసమానులు. "ఎకనమిక్ హిస్టరీ ఆఫ్ ఇండియా" అనే గ్రంథంలో 'ఆర్.సి దత్' ఇలా అన్నారు. – "బెంగాల్ నాడు బందిపోట్ల, దోపిడీదొంగల ముఠాల నిలయంగా ఉండేది. వారిని అరికట్టడం మేజిస్ట్రేటులకి దుర్లభంగా ఉండేది. కారణం నాటి పోలీసులు చాలా తక్కువ వేతనాలతో అవినీతికి అలవాటు పడిపోయి ఉన్నారు. వారి సహకారం మేజిస్ట్రేటులకి సక్రమంగా అందలేదు. పెద్ద పెద్ద పట్టణాలు, వ్యాపార కేంద్రాలలో తరుచుగా భారీ ఎత్తున బందిపోటు దాడులు జరిగేవి. గ్రామాలు నిరంతర భయానక వాతావరణంలో సతమత మయ్యాయి బందిపోటు నాయకులు మారినప్పుడల్లా వారి బెదిరింపులకు గ్రామాలు మూల్యం చెల్లిస్తూవుండేవి. 1800 నుంచి 1810 వరకూ దేశం ఎడతెగని విపత్కర పరిస్థితిలో కొట్టుమిట్టాడింది బజార్లు, మార్కెట్ స్థలాలలో బెంగాల్ రాజ్‌రాయ్‌ల గురించి కథలు కథలుగా చెప్పుకునేవారు మేజిస్ట్రేటులు, పోలీసులు తగిన అధికారాలు కొరవడి స్తబ్ధులుగా మిగిలారు ప్రజలు తమదుస్థితికి తలవొగ్గారు |రః దశలో పాలకులు ప్రారంభించిన చర్యలు ప్రజల దుస్థితిని మరింత తీవ్రం చేస్తూ వ్యాధి బాధకంటె మందు బాధ ఎక్కువైన చందాన పరిణమించాయి. తప్పుడు సమాచారం ఆధారంగా భారీఎత్తున అరెస్టుల కాండ ఆరంభమైంది. బందిపోట్లు పీడకు పోలీసుల భయంకూడా తోడై ప్రజలు కృంగిపోయారు. ఈ పరిస్థితి భారతదేశాన్ని బ్రిటిష్ దొరలు పరిపాలించిన పర్యంతమూ వుంది. దేశంలోని భాషలూ, ఆచారాలూ, సామాజిక వ్యవస్థ గురించి ఎంతమాత్రమూ తెలియని బ్రిటిష్ అధికారులు ప్రాపకం సంపాదించిన కొందరు ఆ అధికారులచేత మరింత అన్యాయాలు చేయించేవారు. దీనితో నాటి బ్రిటిష్ ప్రభుత్వం ఒక విషయాన్ని చివరికి గుర్తించింది. పాలనా వ్యవస్థలోనూ, న్యాయ వ్యవస్థలోనూ

బాధ్యతాయుతమైన పదవులలో విషయజ్ఞానులైన భారతీయులను నియమించాలని పాలకులు గుర్తించారు. అయితే యురోపియన్ అధికారులకన్న తక్కువ జీతనాతాలతోనే భారతీయ అధికారులకు బాధ్యతలు అప్పగించ తలపెట్టారు. మొత్తానికి ఈ పరిణామం భారతదేశంలో ఆంగ్లేయ విద్యకు నాంది పలికింది. ఈ ఆంగ్లేయ విద్య ముఖ్యోద్దేశం భారతీయ ప్రభుత్వ సిబ్బందికి సంబంధిత విషయజ్ఞానం కలిగించడమే. |ఈస్టిండియా కంపెనీ పరిపాలన, దాని వాణిజ్య విధానం దేశీయ పరిశ్రమలను త్వరగా దెబ్బతీసింది. ముఖ్యంగా నేత. స్పిన్నింగ్, డయింగ్ తదితర నూలు పట్టువస్త్రాల పరిశ్రమలు దెబ్బతిన్నాయి ఆ విధంగా భారతీయులపై బలవంతంగా బ్రిటిష్ వస్తువులు రుద్దడానికి రంగం సిద్ధమైంది అనతికాలంలో మన (బ్రిటన్) మార్కెట్లలో దేశవాళీ వస్త్రాల ఉత్పత్తిదారులకూ, వారి పట్టునూలు, ఉత్పత్తులకూ స్థానం లేకుండా పోయింది. భారతదేశంలో ప్రధానంగా వాడకంలో వున్న నూలువస్త్రాలు 67 శాతం సుంకం విధానం అమలులోకి రావడం వల్ల ముఖ్యంగా యంత్రంలో తయారైన వస్త్రాల పోటీకి తట్టుకోలేక దేశంనుంచి అదృశ్యమయ్యాయి. (ఆసియా దేశాలలో వాడకం అవసరాలకు మన నూలు వస్త్రాలు నిజానికి ఎగుమతి అయ్యేవి). దీనితో భారతదేశం ఉత్పాదక దేశ స్థాయినుంచి పడిపోయి కేవలం వ్యవసాయ దేశంగా మిగిలిపోయింది. (హెన్రీ సెయింట్ జార్జిటకర్, మెమోరియల్స్ ఆఫ్‌ది ఇండియన్ గవర్నమెంట్) ప్రాచ్యదేశాల మార్కెట్లకు ముఖ్యంగా భారతదేశానికి నూలు వస్త్రాల ఎగుమతిలో 1794లో 156 డాలర్లుండగా 1813లో లక్షా 88వేల 24 డాలర్లకూ, 1858లో 47 లక్షల 82వేల 698 డాలర్లకూ పెరగడం జరిగింది.

గుత్తాధిపత్య విధానాలతో వాణిజ్య వ్యాపార రంగాలలో ఈస్టిండియా కంపెనీక అక్రమలాభార్జన సాగిస్తూ, దేశాన్ని ఛార్జీల వసూలు పేర్లతో కొల్లగొట్టేది. "భారతదేశపు ఋణం" పై బ్రిటన్‌కు చెల్లించవలసిన వడ్డీమీద డివిడెండ్లు, రైల్వేలు మిలటరీ ఛార్జీలపై వడ్డీ వసూలు చేసేది. భారతీయ రాజులపైన, ఆఫ్ఘనిస్తాన్, బర్మా, చైనా, నేపాల్ తదితర దేశాలపైనా బ్రిటన్ సాగించే యుద్ధాలకు అయిన ఖర్చులు భారతదేశపు ఖర్చులుగా జమకట్టేవారు. ఈస్టిండియా కంపెనీ 1858లో పరిపాలనాధికారాన్ని బ్రిటిష్ సింహాసనానికి దత్తం చేసిన తరువాత భారతదేశం పేరిట ఈ రకమైన ఋణభారం ఏడుకోట్ల డాలర్లుంది. వడ్డీకితోడు దాదాపు

15కోట్ల వరకూ భారతదేశపు డబ్బును ఈస్టిండియాకంపెనీ రాబట్టుకున్న తరువాత కూడా ఇంత ఋణం తేలింది. 1857లో సిపాయిల తిరుగుబాటు వ్యయం 4 కోట్ల డాలర్లు కూడా భారతదేశపు పద్దులో చేర్చారు. 1867లో అబిస్సినియాతో యుద్ధానికి బ్రిటన్ చేసిన ఖర్చు కూడా కలిపారు. 1900 నాటికి భారతదేశపు ఋణభారం 2కోట్ల 40 లక్షల టన్నులకు పాపం పెరిగినట్లు పెరిగిపోయింది.

భారతదేశంలో పండిన ఆహారధాన్యాలు భారీఎత్తున విదేశాలకు ఎగుమతి కావడంతో దేశంలో పేదరికం తీవ్రస్థాయికి చేరుకుంది. తరచూ కరువులు సంభవించేవి. 1770, 1900 మధ్య భారతదేశంలో 22సార్లు మహమ్మారి వంటి కరవులు సంభవించాయి. కోట్లాది ప్రజలు క్షుద్బాధతో మలమలమాడి ప్రాణాలు విడిచారు. కరువు తాండవిస్తున్న తరుణంలో కూడా పన్నులు నిరాటంకంగా వసూలు చేసేవారు, పరాయి పాలకులు 1866-67లో సంభవించిన భయంకరమైన కరవును ఉదాహరణగా చెప్పుకుందాం. దేశంలో కరువు విలయతాండవం చేస్తున్న ఆ తరుణంలో కూడా బ్రిటన్‌కు వార్షిక ముడుపు క్రింద అంతకుముందు ఎన్నడూ ఎగుమతి కానంత భారీ ఎత్తున ఆహారధాన్యాలు దేశం నుంచి ఎగుమతి అయ్యాయి

ప్రభుత్వానికి ప్రధాన ఆదాయమార్గం వ్యవసాయం. బలవంతపు పన్నుల భారంతో ఆ వ్యవసాయం కుంటుబడి పోయింది. "ఈస్టిండియా కంపెనీ పరిపాలన ప్రారంభించిన తరువాత భారతదేశం మొత్తాన్ని విస్తారమైన ఆకు ఎస్టేటుగా లేదా భూకమతంగా భావించింది; భారతదేశపు మొత్తం భూభాగంలో పండినది ఏదైనా తమదేనని నిర్ణయించుకొంది; భూమి దానిని పంట పండించినవారికి బ్రతకడానికి బొటాబొటీగా చాలినంత తిండిగింజలు మిగిల్చి మిగిలిన యావదాస్తిపై హక్కు భుక్తం చేసుకుంది. (దత్ ఇ బిగ్) రైతులు, రైతుకూలీలు ఉదారపోషణార్థం బందిపోట్లుగా కూడా మారారంటే ఆశ్చర్యం లేదు. 1793లో కుదిరిన 'పర్మనెంట్ సెటిల్‌మెంట్' క్రింద పన్నులూ, సుంకాలు, లెవీలు వసూలు అధికారం భూస్వాములకు అప్పగించారు. వసూలు చేసే మొత్తం ఆదాయంలో 90 శాతం ప్రభుత్వానికి అప్పగించాలని భూస్వాములకు షరతు పెట్టారు. ఆ రకంగా భూస్వాములే

సాధికారిక రెవిన్యూ ఏజెంట్లుగా మారారు. వారు రైతుల పైన అదనపు పన్నులు కూడ విధించి సొమ్ము చేసుకుంటూ, అటు బ్రిటిష్ సింహాసనానికి సొమ్ము చేసి పెట్టేవారు వారు వసూలు చేసిన అక్రమ పన్నులతో 'పోన్ టాక్స్' అనే తల పన్ను ఒకటి. ప్రతి మనిషి పై, పాడి పశువు పై ఈ 'పోన్ టాక్స్' భూస్వాములు వసూలు చేసి తమ బొక్కసాలు నింపుకొనేవారు తిండిగింజను. జనుము కొనుగోలు చేసే బ్రిటిష్ దొరలతోనూ, ఇండిగో (నీల్) తోటల పెంపకందార్లతోనూ కుమ్మక్కై ఈ భూస్వాములు తమ క్రింది కౌలుదార్లయిన రైతులను పీడించుకు తినడానికి లేని అధికారాలన్నీ చెలాయించేవారు. పీడితులైన బక్క రైతులకు ఏ రీత్యా న్యాయం కోసం పోరాడే అవకాశం లేనేలేదు. నీల్ కంపెనీదార్లు ముఖ్యంగా బ్రిటిష్‌వారు తమ పాలకులైన తెల్లదొరలు కల్పించిన రక్షణ సౌకర్యాలతో విర్రవీగుతూ అనాగరికంగా తమ క్రింది రైతులను అణగద్రొక్కి వారి చేత బలవంతంగా నీల్ పండించేవారు ఆ రైతులనించి చాలా అల్పధరలకు పంట కొనుగోలు చేసి రైతుల కడుపులు మాడ్చేవారు దేశంలో జాతీయోద్యమానికి ఇండిగో రివోల్ట్ అనే "నీల్ విప్లవం" నాంది పలికింది ఈ నీల్ విప్లవం గురించి సవివరంగా చర్చించడం సబబు. 1880 ప్రాంతంలో జర్మన్ శాస్త్రజ్ఞులు సింథటిక్ రంగులు కనుగొనేదాకా ప్రకృతిసిద్ధమైన భారతదేశపు ఇండిగో (జౌళివస్త్రాలు, భవనాలు, ఇతర పరిశ్రమలకు వాడే నీలిరంగు) ప్రపంచంలో విరివిగా వాడకంలో ఉండేది నీల్ చెరడు, ఆకులు శుద్ధిచేయడం ద్వారా ఈ నీల్ చూర్ణం తయారుచేసేవారు ఈ మొక్క సారవంతమైన పల్లపు ప్రాంతాలలోనే పండుతుంది దిగువ బెంగాల్, ఉత్తరబీహార్ ఈ పంటకు అనుకూలమైనవి భారతదేశంలో చాలాకాలం నుంచి ఇండిగో విరివిగా వాడకంలో ఉండడమేగాక బ్రిటిష్‌వారికి మునుపు ఈ రంగు భారీ ఎత్తున ఎగుమతి అయ్యేది కూడ బ్రిటిష్‌వారు బెంగాల్‌ను చేజిక్కించుకున్న తరువాత ఈ నీలిరంగు ఉత్పత్తికై విస్తారంగా ఇండిగో ప్లాంటేషన్లు నెలకొల్పారు భారతదేశం నుంచి ఇండిగో ఎగుమతుల గుత్తాధికారం బ్రిటిష్‌వారు భుక్తం చేసుకున్నారు 1830 నాటికి అంతర్జాతీయమార్కెట్లో భారతదేశం నుంచి ఎగుమతైన నీల్ ఇతర దేశాల ఇండిగో ఉత్పత్తులను అధిగమించింది. బెంగాల్‌లో ప్రధానంగా జెస్సోర్, నాదియా, పాబ్నా, తిర్హుట్ (ఇప్పటి ఉత్తరబెంగాల్‌లో కొంత భాగం) 300 నుంచి 400 ఇండిగో కర్మాగారాలు ఉండేవి అత్యధిక లాభాలు పిండడానికి నీల్ రైతులమీద

ఇండిగో పెంపకందార్లైన దొరలు రకరకాల ఒత్తిడులు తెచ్చేవారు. రైతులు తమ భూములలో తమకు లాభకరమైన వేరే పంటలు పండించడానికి లేదు. బ్రిటిష్ ఇండిగో పెంపకందార్ల లాభాలకోసం అతి తక్కువధరలకు తమ భూములలో వారు నీల్ మాత్రమే పండించాలి. ఈ విషయంలో యూరోపియన్లకు వ్యతిరేకంగా వెళ్లి న్యాయం కోరే ఆస్కారం వారికి లేదు. నీల్ రైతులపై బ్రిటిష్ నీల్ పంపకందార్లు చెలాయించిన అనేక నిర్బంధాలలో హింసించి లొంగదీసుకునే పద్ధతి కూడ ఉంది. హత్య అనే పదానికి న్యాయశాస్త్రరీత్యా గల నిర్వచనం వేరైనా ఈ హింసకు తట్టుకోలేక మరణాలు సంభవించిన ఉదంతాలు కూడ ఉన్నాయి. వారిని బంధించడానికి ఇరుకైన చెక్కబోషాణాలుండేవి. మణికట్టు దాకా చేతులు. చీలమండదాకా కాళ్ళు దూర్చడానికి ఈ చెక్క పెట్టెలకు బొరియలుండేవి అందులో ఈ నీల్ రైతులను అక్రమంగా బంధించేవారు. నీల్ పండించని రైతులపై ఏదో ఒక సాకు చూపి చట్టవిరుద్ధమైన శిక్షలు విధించేవారు. ఈ అక్రమ నిర్బంధ పద్ధతులు మరణాలకు దారితీసేవి," (1810 ప్రభుత్వ సర్క్యులర్). "బెంగాల్ ప్రజలు ఎదురుతిరిగి ప్రతిఘటించే వరకూ సుమారు అర్ధశతాబ్దం పాటు నీల్ రైతులపై ఈ అణచివేత చర్యలు నిరాటంకంగా కొనసాగాయి. 1860లో "ఇండిగో డిస్ట్రబెన్స్"గా ప్రసిద్ధి కెక్కిన తిరుగుబాటు అనంతరం బెంగాల్‌లో బ్రిటిష్ నీల్ పెంపకందార్లను చాలా ప్రాంతాల నుంచి తరిమివేశారు (దత్-దిఎకనమిక్ హిస్టరీ ఆఫ్ ఇండియా) నీల్ పండించడానికి రైతులు నిరాకరించి తెల్లదొరల ఇళ్ళపైన, నీల్‌ఫ్యాక్టరీలు, ప్రభుత్వ కార్యాలయాలపైన దాడులు సాగించారు! బడుగురైతుల తిరుగుబాటును భారతీయ పత్రికలు బలపరిచాయి హిందూదేశ భక్తులు ఇచ్చిన మద్దతు ప్రత్యేకించి పేర్కొనదగ్గది. జెస్సోర్ జిల్లాలో శిశిర్‌కుమార్ ఘోష్‌తో సహా ఘోష్ సోదరులంతా నీల్ రైతుల ఆందోళనకు క్రియాశీలకంగా సహకరించారు. దీనబంధు మిత్రా(1828-73) వ్రాసిన 'నీల్‌దర్పణ్' అనే నాటకం(మిర్రర్ ఆఫ్ ఇండిగో, 1860) వాడవాడలా ప్రదర్శింపబడి నీల్ రైతు ఉద్యమానికి అనన్య సామాన్యమైన బలాన్నిచ్చింది. దేశమంతా ఈ నాటకం సంచలనం రేపింది. దేశప్రజలలో బ్రిటిష్‌పాలకులపట్ల భయోత్పాతాన్ని, పరాయి పాలన పట్ల అసంతృప్తిని రేకెత్తించింది. మైఖేల్ మధుసూదనదత్తా ఈ నాటకాన్ని ఆంగ్లంలోకి అనువదించి, రివరెండ్ జె.లాంగ్ పేరుతో ప్రచురించారు. ఆంగ్ల

అనువాదంపై ప్రాసిక్యూషన్ జరిగి, లాంగ్‌కు నెలరోజుల జైలు శిక్ష, వెయ్యిరూపాయిల జుల్మానా పడింది. 1874లో మోతీలాల్ ఘోష్ అన్నగారైన శిశిర్‌కుమార్ ఘోష్ (అమృతబజార్ పత్రిక సహ వ్యవస్థాపకుడు) ఈ నీల్ విప్లవంపై క్రింద వ్యాఖ్యానం చేశాడు:

"కలిసికట్టుగా వ్యవహరిస్తూ రాజకీయ పరమైన ఉద్యమాన్ని లేవదీయవలసిన ఆవశ్యకతను బెంగాల్ జాతీయులకు మొదటిసారిగా నేర్పిన ఉద్యమం ఈ నీల్‌విప్లవమే. ఆంగ్లేయులు అడుగుపెట్టిన తరువాత మొదటిసారిగా బెంగాల్‌లో జరిగిన తిరుగుబాటు ఇది. ఇక మరో తిరుగుబాటు జరిగితే - అది పోలీసులు, జిల్లా మేజిస్ట్రేటులు మారణహస్తాలనుంచి దేశాన్ని విముక్తం చేయడానికి జరగాలి. ఇక అణచివేత ప్రశ్నలేదు. ఇంగ్లాండులో గొప్ప విప్లవాన్ని ప్రేరేపించినది, అణచివేత చర్యలే. అలాగే జీవచ్ఛవంలా ఉన్న బెంగాలీలను వృద్ధ విప్లవోగ్ర సింహాలుగా మార్చినది అర్థ శతాబ్దం పాటు నీల్‌రైతులపై సాగిన ఈ "దమన విధానాలే"

1860లో ఇండిగో కమిషన్‌ను ప్రజల ఆగ్రహపూరిత ఆందోళన చవిచూసిన బ్రిటిష్ ప్రభుత్వం కంటితుడుపు చర్యగా ఏర్పాటు చేసింది. మొదటిసారిగా ఒక భారతీయుడు (బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్ ప్రతినిధి) అధికార కమిషన్ సభ్యునిగా బ్రిటిష్ ఇండిగో ప్లాంటర్స్‌పై విచారణకు నియామకమయ్యాడు. నీల్ రైతుల పరిస్థితుల మెరుగుకు కమిషన్ సిఫార్సు అమలు ప్రారంభించటానికి నీల్ ప్రవేశపెట్టారు. ఇక క్రమంగా దేశంలో నీల్ తోటలకు ఒకటివెంట ఒకటిగా స్వస్తి పలికారు. బీహార్‌లోని చంపారన్ జిల్లాలో ఆఖరి నీల్ కమతం మహాత్మాగాంధీ దేశంలోకెల్లా తొలిసారి ప్రారంభించిన సత్యాగ్రహోద్యమం ఫలితంగా 1917లో రద్దయ్యింది. ఈ నీల్ రైతుల తిరుగుబాటులో ఆసక్తికరమైన అంశమేమిటంటే ఈ ఆందోళన సారధుల్లో ఒకడు స్వయంగా యూరోపియన్. ఆయనపేరు జాన్ లార్మర్.

ఈలోగా హుగ్లీనది ఎడమ ఒడ్డున 1686లో జాన్‌చర్నోక్ నెలకొల్పిన కలకత్తా ఈస్టిండియా కంపెనీ రాజకీయ, వాణిజ్య కార్యకలాపాల ప్రధానంగా విస్తరిల్లుతూ చాలా ప్రాముఖ్యతనీ, సంపదలనీ సమకూర్చుకుంది. స్థానిక దళారుల సహకారంతోనే బ్రిటిష్ వ్యాపారులు తమ వాణిజ్యం పెంపొందించుకునేవారు. ఈ స్థానిక ఏజంట్లు భారీ లాభాలు ఆర్జించారు. చాలా తక్కువ మొత్తాన్ని పెట్టుబడులుగా తెచ్చుకుని

అత్యధిక కోట్లలో వడ్డీ, కమీషన్ వసూలు చేస్తూ ఏజంట్లు అపార ఆర్జన మరిగారు బ్రిటిష్‌వారి ద్వారా భారతదేశంలో బాగుపడ్డది ఈ ఏజంట్లు మాత్రమే. వీరంతా కలకత్తా చేరుకొని జల్సారాయుళ్లుగా, ఆడంబర జీవితం మరిగారు. 1793నాటి పెర్మనెంట్ సెటిల్‌మెంట్‌వల్ల తక్షణ ప్రయోజనం పొంది పెద్దపెద్ద ఎస్టేట్లు సంపాదించుకొని కలకత్తాలో ఫాషన్ జనంగా బ్రతికారు. ఈ ధనవంతులే తదనంతరం బ్రిటిష్ పరిపాలన స్థిరపడడానికి పట్టుకొమ్మలయ్యారు. వీరంతా బ్రిటిష్ పాలనను బలపరుస్తూ రాజకీయ, సాంఘికార్థిక మార్పులను ఆశించే ఎట్టి ప్రయత్నాలకైనా అడ్డుపడుతూ వచ్చారు.

ఆదిలో 'ఫెరింగ్' సంస్కృతికీ, ఆధునిక పాశ్చాత్యప్రపంచపు విజ్ఞానానికీ, దాని గురించిన ఆలోచనలకీ దూరంగా ఉంటూ వచ్చినవారు తదనంతరం ప్రభుత్వ ఉద్యోగాల అవకాశాలు, చదువుకు సంబంధించిన, చదువు అవసరమైన వృత్తులూ పెరగడంతో ఇంగ్లీషు విద్యవైపు మొగ్గారు. ఐతే కలకత్తాలోనూ, చుట్టుప్రక్కల గ్రామాలలోనూ గల ద్వితీయ శ్రేణి ఉన్నతవర్గాలవారు విద్యారంగంలో వీరిని ప్రక్కకు నెట్టారు వారి సంఖ్యాబలం ఎక్కువ భారతదేశాన్ని జాగృతం చేయడంలో గణనీయమైన భూమిక వహించిన మేధావివర్గపు ఆవిర్భావం ఆ రకంగా మొదలైంది

మొగల్ ప్రాభవం తరువాత 19వ శతాబ్ది ప్రాంగణంలో భారతీయ సంస్కృతి ఏమాత్రమూ ముందడుగు వేయలేదు 19వ శతాబ్దం ప్రారంభంలో యూరప్‌లోనూ, అమెరికాలోనూ చోటు చేసుకున్న గొప్ప రాజకీయ. సైద్ధాంతిక ఉద్యమాల గురించి ఎవరికీ పరిచయం లేదు అలాగే పాశ్చాత్యదేశాలలో భౌతిక విజ్ఞాన రంగాలలో సాధించిన అభివృద్ధి కూడా మన దేశంలో ఏమీ పరిచయం కాలేదు అక్షరాస్యత చాలా తక్కువ. అప్పుడు మన దేశపు 'విద్య'లో పవిత్ర గ్రంథాల బోధనల పరిచయం,, సంస్కృతం పర్షియన్ శాస్త్రాల అధ్యయనం దాదాపుగా శూన్యం పర్షియన్ భాష కేవలం నాటి ముస్లిమ్ పాలకుల పాలనాయంత్రాంగానికే పరిమితమైనది వేదాలు, ఉపనిషత్తులకు సంబంధించిన విజ్ఞానం ఇస్లామిక్ ఆధ్యాత్మిక అధ్యయనానికి ఏవో కొన్ని ప్రాంతాలు మినహాయిస్తే దాదాపుగా లేవు. హేతుబద్ధంకాని సనాతనసూత్రాలకు గుట్టగా అంటిపెట్టుకొని ఉండడమే మతంగా చెలామణిలో ఉంది. నగర జీవితం దిగజారిన నైతిక విలువలను ప్రతిబింబిస్తూ

ఉండేది. హిందూ సమాజంలో పొడసూపిన దిగజారుడు హిందూమహిళల పట్ల హిందువుల క్రూర ప్రవర్తనలో స్పష్టమయింది. హిందూ సమాజంలో బహు భార్యాత్వం అమలులో వుంది. బాలికలను, యువతులను పెళ్ళిపేరిట చరాస్తులవలె అమ్మివేయడం ఉంది. స్త్రీలను అక్కడ సమాజంతో సంబంధంలేకుండా విడదీసి పరదాల మాటున ఉంచి, ఇళ్ళకే పరిమితం చేసేవారు. భర్తృవిహీన అయిన స్త్రీని మతం పేరుతో భర్త చితాగ్నిలోకి బలవంతంగా నెట్టి సతీసహగమనం పేరుతో సజీవదహనం జరిపేవారు. ఈ ప్రమాదం తప్పిన మహిళలను జీవితాంతం పరాధీనలుగానూ, బానిసలుగానూ మాత్రమే బ్రతకనిచ్చేవారు. భర్త ఆస్తికి ఆ భార్యను వారసురాలు కాకుండా చేసి ఆమెని ఈ స్థితికి నెట్టేవారు. స్త్రీలకు పిత్రార్జితంలో కూడా వాటా దక్కదు. వితంతువులకు పునర్వివాహం పూర్తిగా నిషిద్ధం.

అయితే పాలకులైన బ్రిటిష్ వ్యాపారులు మరింత సమర్థవంతమైన పరిపాలనకుగాను భారతీయులకు ఇంగ్లీషు భాష నేర్పాల్సిన అవసరాన్ని గుర్తించినప్పటికీ, ఆధునిక మానవ జాతులు, శాస్త్రవిజ్ఞానం గురించి భారతీయులకు బోధించడం వారికంతగా ఇష్టం లేకపోయింది. కారణం? (ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్లలో ఒకరైన లయొనిల్ స్మిత్ మాటలలో చెప్పాలంటే) "ఇంతవరకూ దేశాన్ని మనం భిన్నమతాలు, తెగలపేరిట విడదీసి పాలించాము. విద్య పరమ ప్రయోజనం ఈ వేర్పాటు తత్వాలకు స్వస్తి పలకడమే. మహమ్మదీయులను హిందూ వ్యతిరేకులుగా, ఇంకా భిన్నమతస్తులు, తెగలు, కులాలవారిని, తక్కిన మతాలు, కులాలు తెగలకు వ్యతిరేకులుగా మనం తయారు చేశాము. విద్యద్వారా వారి మేధాసంపత్తిని, భావనా పరిధిని విస్తృతం చేయడం అంటే వారు వారి బలాన్ని గుర్తెరిగేటట్టు చేయడమే!"

అయినప్పటికీ సబార్డినేట్ అధికారుల హోదాలో మరింతగా భారతీయుల్ని చేర్చుకోవాల్సిన అగత్యం ఏర్పడడంతో ఇంగ్లీషు విద్యా బోధనా కేంద్రాలని పరిమిత సంఖ్యలోనైనా ప్రారంభించడానికి బ్రిటిష్‌పాలక వ్యాపారులు అయిష్టతతోనే అంగీకరించారు. చతుష్పదులు మక్తాబ్‌లకు సబ్సిడీ, సౌకర్యాలు ఇస్తూ దేశంలో ఒక ప్రక్క అప్పటి సాంప్రదాయ విద్యను ప్రోత్సహించడమే ఈస్టిండియా కంపెనీ అభిమతం. ఆ సాంప్రదాయ విద్య సాగుతూండగానే వేరొక ప్రక్క మిషనరీలు,

కొందరు ప్రైవేటు వ్యక్తులు కలకత్తాలోనూ చుట్టుప్రక్కలా పెక్కు స్కూళ్ళు ప్రారంభించారు. స్కూళ్ల ప్రారంభించిన ప్రైవేటు వ్యక్తులలో డేవిడ్‌హేర్ అనే ఆంగ్లేయుడు, రాజారామమోహనరాయ్ తదితరులు ఉన్నారు. రాయ్ భారతదేశంలో ఆధునిక యుగారంభకునిగా పేరుగాంచాడు. మతం ప్రసక్తిలేని సార్వజనిక విద్యను బోధించే తొలి కళాశాల 1817లో కలకత్తాలో నెలకొల్పడం జరిగింది. ఆ నగరంలో నివసించే ప్రముఖ భారతీయుల విరాళాలతో ఈ కళాశాల స్థాపించారు. ఈలోగా బొంబాయిలోనూ, మద్రాస్‌లోనూ కూడా ఇంగ్లీషు విద్య వ్యాప్తి చెందుతోంది. 1835లో లార్డ్ మెకాలే, ఆయన సహ ఆంగ్లేయులు ప్రతిపాదించిన విద్యాపద్ధతిలో రెండు ప్రధాన లోపాలున్నాయి.

**ఒకటి :** ఈ విద్యాపద్ధతిలో దేశీయ భాషల అధ్యయనం పూర్తిగా విస్మరించబడింది

**రెండు :** ప్రభుత్వపు క్రొత్త విద్యా విధానం ఆధునిక విద్య నేర్చుకునే గ్రామీణప్రజల హక్కును పూర్తిగా త్రోసిరాజంది. ఈ లోపాలు సరిదిద్దడానికి ప్రైవేటు వ్యక్తులే రంగంలోకి దిగారు. రామమోహనరాయ్ అందించిన వరవడిలో ఆది జర్నలిస్టులు ముఖ్యంగా రాయ్ అనంతరం పేరుగడించిన ఈశ్వరచంద్రవిద్యాసాగర్ వంటివాడు చేసిన కృషి ఫలితంగా బెంగాలీలో సాహిత్యం అభివృద్ధి చెందింది. విద్యాభివృద్ధికి సాహిత్యాభివృద్ధికి బెంగాల్ వారికే ఋణపడి ఉంది.

విలియంకేరీ, జాషువా మార్ష్‌మాన్ మిషనరీలకు కూడా బెంగాల్ చాలా ఋణపడి ఉంది. బెంగాలీలో కొద్ది పేజీలతో చిన్న పత్రికలను 1800 ప్రాంతంలో మిషనరీ పత్రికను కూడ మార్ష్‌మాన్ ప్రచురించేవారు.

1844 నాటికి పాలనా యంత్రాంగం స్థాయిలో ఇంగ్లీషు భాష పూర్తిగా వాడకంలోకి వచ్చేసింది. ఇంగ్లీషు పరిజ్ఞానం వలన పాశ్చాత్య సాహిత్య పరిచయం వలన ఒక క్రొత్త మేధావి వర్గం ఉద్భవించింది. అయితే ఈ వర్గం అత్యవసర సమయాలలో అప్పటి సామాజిక సంప్రదాయ పంథాలకే అంటిపెట్టుకుని ఉంది. కేవలం పట్టణవాసులతో కూడిన చిన్న వర్గం మాత్రం ఈ కట్టుబాట్లను నిరసించింది. 1857లో కలకత్తా, బొంబాయి, మద్రాసు యూనివర్శిటీలను స్థాపించారు. సిపాయి తిరుగుబాటు జరిగినది ఆ సంవత్సరమే. భారత స్వాతంత్ర్యోదమానికి ఒక మార్గం ఏర్పడిన సంవత్సరం కూడా అదే. ఇంగ్లీషు విద్యావ్యాప్తి తెచ్చే మార్పుతో భారతీయులు ఒక అభిరుచి, ఆలోచన, నైతిక

సూత్రాలు, మేధస్సురీత్యా ఆంగ్లేయులతో సారూప్యం చెందుతారనీ, ఆ రకంగా తుదకు భారతీయులు సులభంగా క్రిస్టియన్లుగా మార్పుచెందుతారనీ దేశంలో భయాలు, బ్రిటన్‌లో ఆశలూ తలెత్తాయి. కాని ఆ విధంగా భయపడ్డవారూ, ఆశపడ్డవారూ కూడా చివరికి భంగపడ్డారు. పాశ్చాత్యుల భౌతికవాదంతో కూడిన జానకీ సెక్యులరిజానికీ క్రైస్తవ మిషనరీల సారధ్యంలో పోరాట స్థాయిలో సాగిన క్రైస్తవమత బోధనలకీ దేశంలో వ్యతిరేకత ఎదురైంది. ఇందుకు భారతదేశపు పురాతన సంస్కృతీ వారసత్వాన్ని పరిరక్షించుకోవాలన్న జిజ్ఞాస పెంపొందడం, సామాజికార్థికస్థితి యథావిధంగా కొనసాగడం వంటి పెక్కు కారణాలున్నాయి. మత పరంగాను, సాంఘిక, రాజకీయ రంగాలలోను ఈ ప్రతిఘటనా భావానికి గట్టి పునాది వేసిన వారిలో రాజారామమోహనరాయ్ (1772-1833) అగ్రగణ్యుడు. బ్రిటిష్‌వారి పెత్తనం క్రింద గల భారత ప్రజ పాశ్చాత్య ప్రపంచంతో విడదీయరాని పోరాటంలో ఇరుక్కొని ఉందని, ఈ పోరాటం నివారించ శక్తి కానిదని ముందుగా గుర్తించిన వ్యక్తి రాయ్. సమస్య కేవలం మతపరమైనది కాదు; రాజకీయార్థిక సంబంధమైనదీ, సంస్కృతికి చెందినది కూడా అని ఆయన గుర్తించారు. సకల మతసారాన్ని అధ్యయనం చేసిన మొదటి భారతీయునిగా రాయ్, దేముడొక్కడే అనే వేదాంతపరమైన విశ్వాసాన్ని తాత్వికస్థాయిలో అన్ని మతాల మధ్య ఐక్యతా సాధనకు తిరుగులేని సూత్రంగా గుర్తించారు. తన ఆధ్యాత్మిక మానవతా వాదంతో ఆయన పాశ్చాత్యుల భౌతిక మానవతా వాదాన్ని ఢీకొన్నాడు. ఆ రాయ్ అనుచరులైన స్వామివివేకానంద, రవీంద్రనాధఠాగోర్, మహాత్మాగాంధీ, సర్వేపల్లి రాధాకృష్ణన్ ప్రభృతులు రాయ్ ప్రతిపాదించిన ఆధ్యాత్మిక మానవతావాదాన్ని ముందుకు తీసుకుపోయారు. రాయ్ కాలంలో ఇదే ఆధునిక భారతీయ వివేచనకు మూలస్తంభమయ్యింది. ఆధ్యాత్మిక మానవతా వాదాన్ని, ఆధునిక శాస్త్ర విజ్ఞానాన్ని ప్రక్కప్రక్కగా మొలకెత్తించడంలోనే భారతదేశ భవిష్యత్తు ఆధారపడి ఉన్నదని రాజారామమోహనరాయ్ కనుగొన్నాడు. తదనంతరం వివేకానందుడు కూడ ఇదే అభిప్రాయం ప్రకటించాడు. పశ్చిమ దేశాలలో రాజకీయ పరిణామాలు క్షుణ్ణంగా తెలుసుకున్న వ్యక్తి కావడం చేత, రామమోహనరాయ్ భారతీయ సమాజంలోని అసమానతలు గమనించారు. దేశమైక్యతకు భంగంగా నిలిచి "విభజించి పాలించడం" బ్రిటిష్‌వారికి సులభం చేసి పెట్టిన వర్గాల్నీ, తెగల్నీ కూడ బాగా గుర్తించారు.

వసుధైక అస్తిత్వవాదాన్ని ప్రతిపాదించడంతో పాటు మానవ సంక్షేమానికి అంకితమై చిత్త శుద్ధితో పనిచేయడం సర్వమానవ సమానత్వం అనే సూత్రాలు ప్రాతిపదికగా సామాజిక నియమావళి రూపొందాల్సిన అవసరం ఉన్నదని ఆయన భావించాడు. తన సాంఘిక సంస్కరణల ఉద్యమానికి ఈ మానవతావాదాన్ని పునాది చేసుకున్నారు. / కులవ్యవస్థను ఖండితంగా నిరసించడంతో పాటు కులనిర్మూలనకు పాటుపడిన సనాతన హిందూ సమాజంలోని శక్తివంతమైన వర్గపుతీవ్ర ద్వేషానికి ఆయన గురి అయ్యారు. సతీసహగమన దురాచారం నిర్మూలనలో ఆయన ప్రధాన పాత్ర వహించారు. మహిళా విమోచననూ స్త్రీలకి ఆస్తిహక్కును ఆయన బలపరిచారు. బహు భార్యాత్వాన్ని, బాల్య వివాహాలనూ ఆయన వ్యతిరేకించారు. వితంతువుల పునర్వివాహ హక్కును ప్రచారం చేశారు.

రామమోహనరాయ్ దేశంలో జర్నలిజం అభివృద్ధికి పాటుపడిన మొదటి జర్నలిస్టు కూడా. బెంగాలీలో సంబాద్ కౌముది (1821) పర్షియన్‌లో మిరాత్-ఉల్-అక్బర్ (1822) అనేవి ఆయన నడిపిన రెండు పత్రికలు. ఈ రెండు పత్రికలలో ఆయన దేశ, విదేశీ వ్యవహారాలు పరిణామాలపై నిష్పాక్షికమైన, జాతీయతావాదంతో కూడిన వ్యాఖ్యలను ప్రచురించేవారు. సంస్కృత పవిత్ర గ్రంథాలు పెక్కింటిని ఆయన అనువదించాడు. 'వేదాంతసూత్ర', 'ఉపనిషత్తులను' బెంగాలీలోకి అనువదించాడు. దీర్ఘ వస్త్రాల మాటున ఆకృతి మరుగు పడిన విధంగా ఉన్న నాటి బెంగాలీ వచనానికి ఆయన అనువాదాలు ఒక రూపం కల్పించాయి. పత్రికా రచయితగా ఆయన జతీయవాదం గల పత్రికా రంగానికి పునాదులు వేశారు. పత్రికా స్వాతంత్ర్యాన్ని హరించడానికి 1823లో నాటి ప్రభుత్వం వార్తలు, వ్యాఖ్యలు ప్రచురణకు ముందు సెన్సారు చేసే ప్రీ-సెన్సార్‌షిప్ విధానాన్ని ఆర్డినెన్సు ద్వారా అమలులోకి తెచ్చినప్పుడు రామమోహనరాయ్ గట్టి నిరసన తెలుపుచూ సుప్రీంకోర్టునకు, తదనంతరం ప్రివీ కౌన్సిల్‌కు అర్జీ పెట్టుకున్నారు. ఆయన సంకల్పించిన ఈ వినతి పత్రం పత్రికా స్వాతంత్ర్యానికి ప్రమాణపత్రం అనతగ్గది. అంతేకాక సెన్సార్‌షిప్‌ను నిరసిస్తూ ఆయన తన పర్షియన్ పత్రికను మూసివేశారు. ఆర్డినెన్సు రద్దును కోరుతూ భారతీయ మేధావి వర్గాన్ని ర్యాలీ జరిపారు.

ప్రాచీన ఆధ్యాత్మిక వివేకాన్ని పునఃపరిశోధించి దాని ప్రాతిపదికపై హిందూ

మత విశ్వాసాలను పునరుద్ధరించడం ద్వారా హిందూ సమాజానికి అవసరమైన నైతిక బలం చేకూర్చడంలో రామమోహనరాయ్ కృతకృత్యుడైనప్పటికీ, ఆయన ప్రతిపాదించిన సాంఘిక సంస్కరణలు, విగ్రహారాధనపట్ల ఆయన నిరసన, సనాతన వాదులైన హిందూ ఛాందసులకు ఆగ్రహం తెప్పించింది. ఆయనను వెలివేయడమే కాదు. జీవితాంతం ఆయనపై ఏదో కేసు పేరిట ప్రాసిక్యూషన్ నడిచింది. తనను వెలివేసినవారిని ఆయన లక్ష్యపెట్టలేదు. 1830లో ఆయన స్థాపించిన బ్రహ్మ సమాజం సభ్యులను కూడ వెలివేశారు. ఐనప్పటికీ నాడు అపార మేథా సంపత్తి గల వ్యక్తులతో ఏర్పడిన కారణంగా బ్రహ్మసమాజం లక్ష్యాలను విడనాడకుండా కొనసాగి 19వ శతాబ్దంలో సాంస్కృతిక రాజకీయ ఉద్యమాలను ముందుకు నడిపించిన అసామాన్య నాయకులను కొందరిని దేశానికి అందించింది. 19వ శతాబ్ది అంతటా సనాతన ఛాందస వర్గానికీ, బ్రహ్మ సమాజానికి చెందిన అభ్యుదయ వాదులకీ మధ్య వాద ప్రతివాదాలు కొనసాగుతూనే వున్నాయి.

హిందూ పునరుజ్జీవోద్యమం పేరిట సాగిన ఉద్యమం నిజానికి పునరుద్ధరణోద్యమంగా కాక సంస్కరణ ఉద్యమంగా సాగింది శ్రీరామకృష్ణ పరమహంస (1836-1886) వసుధైక అస్తిత్వవాదాన్ని ప్రచారం చేసి ప్రపంచాన్ని ఆకర్షించారు. ఆధ్యాత్మిక అధ్యయనంలో అన్ని పద్ధతులూ, చివరికి దేవుని అస్తిత్వాన్నే ఋజువు పరుస్తాయని ఆయన పేర్కొన్నాడు. వేరే మాటల్లో చెప్పాలంటే అన్ని మతాల విశ్వాసాలు సరిసమానంగా ఒకదానికొకటి సాటిగా నిలిచేవే! చిత్తశుద్ధితో కూడిన మానవతా వాదమే ఆయన సందేశం. (బాధితుల, సర్పదష్టులను చూసి జాలిపడడం కాదు - వారికి సేవ చేయాలి; దేవునికి విధేయుడుగా ఉండడం అంటే సాటి మానవుని సేవించడమే (మానవసేవే మాధవసేవ): ఆయన శిష్యులలో చాలా గట్టివాడైన స్వామి వివేకానంద (1863-1902) మానవతా విలువలకు అంకితమై దీన జనులకు సేవ చేసేందుకు రామకృష్ణ సేవాకేంద్ర వ్యవస్థను నెలకొల్పి దేశానికి ఎనలేని సేవ చేశాడు; అంతే కాక; 19వ శతాబ్దం ప్రాంగణంలో భారతదేశంలో ప్రారంభమైన రాజకీయోద్యమంలో నిర్భీకత, క్రమ శిక్షణ, స్వార్థ రాహిత్యం, జాతి స్వాతంత్ర్యానికి అంకితమై పనిచేసే దీక్షవంటి సద్గుణాలు పాదుగొల్పిన వ్యక్తి కూడా వివేకానందుడే. అందుకుగాను దేశం ఆయనకు ఋణపడి వుంది. ప్రాక్పశ్చిమ దేశాల సంస్కృతులు,

శాస్త్రవిజ్ఞానాలలోని సల్లక్షణాలను మేళవించి అనువర్తింపచడం భారతదేశానికి అవసరమని ఆయన చాటాడు. పశ్చిమ దేశాల భౌతికతత్వం, భారతదేశపు ఆధ్యాత్మిక చింతన ఈ రెండింటి అల్లికతో నూతన సంస్కృతీ ఉద్భవాన్ని వివేకానందుడు ఆశించాడు "భారతీయ మత సూత్రాలతో ఐరోపా సమాజ వ్యవస్థ నిర్మిద్దాం" అని ఆయన పిలుపునిచ్చారు. దేశంలో ఉన్నత కులాలు అనేవి నశించవనీ, జనబాహుళ్యం ప్రతిస్పందనే దేశానికి భావి ఆశాకిరణమనీ, ఆ జనబాహుళ్యానికి వారి హక్కుల గురించి తెలియచెప్పి జాతీయతా సందేశాన్ని, అవగతం చేయాలనీ వివేకానందుడు ఉద్బోధించాడు. సరిగ్గా రామమోహనరాయ్ సందేశం మరింత ప్రస్ఫుటంగా శతాబ్ది ఆఖరున వివేకానందుడి పిలుపుతో ప్రతిధ్వనించింది ఫలితంగా భారతదేశం ఆశ్చర్యం గొలిపే రీతిలో చైతన్య శిఖరాన్నధిరోహించింది. ఆ శతాబ్దపు నిష్ణాతులందరిలో వివేకానందుడు ప్రత్యేకత సంతరించుకున్నాడు. భారత ప్రజ గురించి ఆయన అందరికంటె ఎక్కువ అవగాహన ఏర్పరచుకున్నాడు. భారతీయ సమాజంలోని భిన్న వర్గాలతో సూటిగా సంబంధాలు ఏర్పరచుకుని ఆయన ఈ ప్రత్యేకత సాధించాడు./1850 నాటికి విద్యావంతులైన ప్రముఖుల వర్గంలో జాతీయతా దృక్పథం తగినంతగా పెంపొందింది. సాంఘిక, సాహిత్య, రాజకీయ పరమైన వివిధ కార్యకలాపాలతో శాఖోపశాఖలుగా ఈ జాతీయతా భావం వెల్లివిరిసింది నాటి అభ్యుదయ ధోరణులకు ఈశ్వరచంద్ర విద్యాసాగర్ (1820-1890) సారధిగా భాసిల్లారు. గ్రామీణ భారతం ఆయన నేపథ్యం. ఆ గ్రామీణ ప్రాంతపు సమస్యలు, అవసరాలు నిరంతరం ఆయన మనోవేదనలు, ప్రాచీన పవిత్రగ్రంథాలు, సాంప్రదాయాలతో పాటు పాశ్చాత్యుల సామాజిక వివేచనలో అంతర్భాగమైన మానవతా వాదం పట్ల అవగాహన గల వ్యక్తి. ఈ కారణాలచేత ఆయన దేశప్రజల అంతులేని పేదరికం, అజ్ఞానం, నానాటికి తీసికట్టుగా ఉన్న పరిస్థితులను స్పష్టంగా చూడగలిగారు. సామాజిక దురన్యాయాలన్నింటినీ పారద్రోలడానికి విరామ మెరుగని పోరాటం ప్రారంభించారు. వితంతువులకు పునర్వివాహం హక్కు సాధించడం ఆయన ప్రథమ లక్ష్యంగా పెట్టుకున్నారు. ఈ లక్ష్య సాధనలో ఆయన బ్రహ్మసమాజ సభ్యులను, హిందూ సంస్కరణ వాదులనూ మిత్రులుగా గుర్తించారు. పోరాటంలో కృతకృత్యుడైనాడు సనాతన ఛాందసవర్గపు తీవ్ర నిరసనల మధ్య ఆయన 1856లో చివరికి వితంతువుల పునర్వివాహానికి వీలు

కల్పిస్తూ చట్టాన్ని చేయించ గలిగారు. బహు భార్యాత్వం, బాల్య వివాహాలు, త్రాగుడు వంటి నైతిక విరుద్ధమైన ఆచారాలనూ, అలవాట్లనూ నిరసిస్తూ ప్రచారం సాగించారు. ఈ కృషిలో పాలుపంచుకొన్న నాటి మేధావుల వర్గంతో కలిసి ఆయన ఈ సాంఘిక సంస్కరణలకు ప్రజల అనుకూలతను సాధించగలిగారు.

స్త్రీ విద్యను ప్రోత్సహించిన ప్రముఖులలో విద్యాసాగర్ ఒకరు. ముందు క్రిష్టియన్ మిషనరీలు, బాలికల కోసం కొన్ని స్కూళ్ళు ప్రారంభించినప్పటికీ ఈ స్కూళ్లకు సాధారణంగా క్రిష్టియన్ కుటుంబాలకు, తక్కువ కులాలకు చెందిన పిల్లలు మాత్రమే వచ్చారు. అదీగాక ఈ స్కూళ్లలో బోధించే విద్య కూడా మతం మార్పిడిని ఉద్దేశించినదిగా ఉండేది. ఈ దశలో విద్యాసాగర్ ఆయన మిత్రులు రంగంలోకి దూకి గవర్నర్ - జనరల్ కౌన్సిల్‌లో న్యాయ విభాగం సభ్యుడు డ్రింక్‌వాటర్ బెతూన్ సహాయంతో 1849లో హిందూబాలికా విద్యాలయాన్ని స్థాపించగలిగారు. తరువాత తొమ్మిదేళ్ళ కాలంలో విద్యాసాగర్ స్వయం కృషితో వేర్వేరు జిల్లాలో మొత్తం 35 బాలికల పాఠశాలలు ప్రారంభించారు. బాలికల కోసం ప్రభుత్వేతర పాఠశాలలు ఎన్నో బ్రహ్మ సమాజికుల శ్రమ ఫలితంగా ప్రారంభమయ్యాయి.

విద్యాసాగర్ ప్రధానంగా హేతువాది. పశ్చిమ దేశాల తత్వశాస్త్రాన్ని, భారతీయ తత్త్వశాస్త్రాన్నీ అధ్యయనం చేయడానికి వీలుగా సంస్కృత కళాశాల విద్యార్థులకు కూడా ఆంగ్లం బోధించాలని ఆయన సూచించారు. ప్రజలకు సంక్షేమాన్ని పెంపొందించే విద్యను ఆయన కోరారు. జాతి జనులతో గాఢమైన సంబంధాలు లేకుండా మధ్యతరగతివారిని విద్యావంతులను చేసి పాలక వర్గంగా వారిని మార్చడం ఆయనకు ఇష్టంలేదు. ఈ విషయంలో ఆయన తానే ఒక ఉదాహరణగా నిలిచారు. నిరాడంబరమైన వస్త్రధారణ, పశ్చిమ దేశాల ప్రజా జీవితంలోని అద్భుతమైన నైతిక, సాంప్రదాయిక విలువల అనుసరణ ఆయనను ఆదర్శవంతంగా నిలబెట్టాయి.

రాబోయే తరాలవారికి ఈశ్వర చంద్రవిద్యాసాగర్ బెంగాలీ సాహిత్యానికి తాను చేసిన సేవ ద్వారానే గొప్ప మార్గదర్శకుడు అయ్యాడు. 19వ శతాబ్దానికి ముందు బెంగాలీ సాహిత్యమంతా ప్రధానంగా కవిత్వమే. ఆ కవిత్వంలో అత్యున్నత స్థాయి సాహిత్య విలువలుగల కవిత్వం కూడా ఉంది. అయితే బెంగాలీ వచనాన్ని మాత్రం

అవ్యమత ప్రచారానికీ, బ్రిటన్‌నుంచి వచ్చే ప్రభుత్వోద్యోగులకు బెంగాలీపాఠ్య గ్రంథాలు కూర్చడానికీ మిషనరీలు అభివృద్ధి చేశారు. వేదాంతపరమైన సిద్ధాంతాల వివరణకూ, రాజకీయ, సాంఘిక పరిణామాల వ్యాఖ్యానానికీ రామమోహనరాయ్ ప్రప్రథమంగా వచనాన్ని వాడాడు. ఆయన కూర్చి 432 బెంగాలీ గ్రంథాలలో 15 పాఠ్య గ్రంథాలున్నాయి. వీటిలో చాలా గ్రంథాలు, సంస్కృత, ఆంగ్ల గ్రంథాలకు అనువాదాలూ, అనుసరణలూ, ఒకటవ తరగతి ప్రాథమిక స్థాయినుంచి ఉన్నత పాఠశాల తరగతి వరకూ విద్యార్థులకు బోధించడానికి ఆయన ఈ పాఠ్యగ్రంథాలు వ్రాశారు. నేటికీ ఇంచుమించు ప్రతి బెంగాలీ బాలుడూ, బాలికా ఆయన కూర్చిపాఠ్య పుస్తకంతోనే తొలి పాఠాలు నేర్చుకుంటున్నది.

బెంగాలీవచనం బంకించంద్రఛటర్జీ (1836-1894) రచనల్లో పరిణితిస్థాయి అందుకుంది. కవిత్వం మినహాయిస్తే సాహిత్యంలో ఆయన ముట్టని ప్రక్రియలేదు. కలకత్తా యూనివర్శిటీ తొలి పట్టభద్రులలో ఒకరైన బంకించంద్ర ఛటర్జీకి సంస్కృత, ఆంగ్ల సాహిత్యాలతో పాటు భారతీయ పాశ్చాత్య తత్త్వశాస్త్రాలలో సమానమైన అభినివేశం ఉంది. నాటి వర్తమాన ఆంగ్ల కల్పనా సాహిత్య స్వరూపాన్ని అనువర్తింప చేసుకుని ముప్పిరిగొన్న జాతీయతా భావంతో ఆయన రచనలు సాగించారు. మతంపై వ్రాసిన విమర్శనాత్మక రచనల్లో సుస్పష్టంగా ఆయన తన సందేశాన్ని చాటాడు. సాటి మానవునికి ముఖ్యంగా స్వదేశీయునికి సేవ చేయటమే మాధవసేవకు దగ్గర మార్గమన్నది ఆయన సందేశం. భగవద్గీతకు భాష్యం చెబుతూ కొమ్టే, జాన్‌స్టూర్ట్‌మిల్ ప్రతిపాదించిన పాజిటివ్ హ్యూమనిజాన్ని గీత ప్రతిబింబించిన నిష్కామ కర్మలను మేళవించి శక్తివంతమైన సంఘసేవా సూత్రాన్ని ప్రతిపాదించారు. జాతీయతా భావంతో కూడిన తన ఆశయాలన్నింటినీ ప్రతిఫలింపచేస్తూ ఆయన వందేమాతరం గీతం వ్రాశారు. ప్రస్తుత శతాబ్దారంభంలో భారత జాతీయ వాదులకూ, విప్లవకారులకూ రణరంగంలో స్ఫూర్తినిచ్చిన నినాదంగా 'వందేమాతరం' భాసిల్లింది. "నిజానికి ఒక నవలాకారునిగా, వ్యాసకర్తగా తత్వవేత్తగా, సామాజిక దార్శనికునిగా, జాతీయవాదిగా, సిద్ధాంతకర్తగా బంకించంద్రఛటర్జీ మన సాంస్కృతిక పునరుజ్జీవానికి ప్రాతినిధ్యం వహించిన మహామేధావి' అన్నారు. భారతీయ చరిత్రకారుడొకడు జాతీయతా

భావావిర్భావంతో బెంగాలీ కవిత్వం ఒక క్రొత్త ఉద్యమం వైపు మలుపు తిరిగింది. ఆ కాలానికి తిరుగులేని బెంగాలీ కవి మైఖేల్‌ మధుసూధనదత్తా (1824-73). ఆంగ్ల భాషలోనూ, పాశ్చాత్య శాస్త్రీయ సాహిత్యంలోనూ అపార పాండిత్యం గడించిన దత్తా చిరస్మరణీయమైన విధంగా ఇతిహాసాలనూ, పాటలను, నాటకాలనూ మాతృభాషలో తర్జుమా చేశారు. ఇవే కోవకు చెందిన ఇతరులలో పేర్కొనదగ్గవారు హేమచంద్రబందోపాధ్యాయ రంగలాల్‌ బెనర్జీ, నవీన్‌చంద్రసేన్‌, బీహారీలాల్‌ చక్రవర్తి తదితరులు, వీరంతా జాతీయతా భావోద్వేగంతో స్పందించి పద్యరచనలో సాంప్రదాయాలను ఛేదించాడు. అంతర్లీనంగా వీరందరి రచనలలోనూ బంకించంద్ర ఛటర్జీ ప్రతిపాదించిన సామాజికాశయాలే ద్యోతకమయ్యాయి.

నాటక రంగంలో మధుసూదనదత్తా సృష్టించిన వరవడిని ఇతరులంతా అనుసరించారు. దీనబంధుమిత్రా (1828-1873) వ్రాసిన 'నీల్‌దర్పణ్‌' అనే నాటకం (1860) దేశవ్యాప్తంగా ఆందోళన చెలరేగడానికి కారణమయింది. గిరీష్‌ చంద్రఘోష్‌ కలకాలం నిలిచే కొన్ని నాటకాలు వ్రాయడమేకాక వృత్తి కళాకారులతో కూడిన శాశ్వత బెంగాలీ రంగస్థలం వ్యవస్థాపనలో గణనీయమైన కృషి చేశాడు. 1872లో సాధికారికంగా బెంగాలీ రంగస్థల కళ అస్తిత్వంలోకి వచ్చిన తరువాత అది సామాజిక దురన్యాయాలనూ, నాటి ప్రభుత్వ దుష్పరిపాలననూ విమర్శించే శ్రవ్య, దృశ్య సాధనంగా అభివృద్ధి చెందింది. పట్టణ ప్రజా జీవితంలోని జాతీయోద్యమ ధోరణులకు నాటి నాటకాలు అద్దం పట్టాయి.

ఆఖరున రవీంద్రనాథ్‌టాగోర్‌ (1861-1941) సాహిత్య రంగప్రవేశం కూడా ప్రత్యేకించి పేర్కొనతగ్గది. 19వ శతాబ్దంలో ఆయన కవిగా, కథకునిగా నవలా కారునిగా, పాటలకర్తగా, వ్యాసకర్తగా, జాతీయవాదిగా, సమీక్షకునిగా ప్రభాత సూర్యునివలె ప్రకాశించాడు.

రామమోహనరాయ్‌ కాలంలోనే భారతదేశంలో రాజకీయ వివేచన ఓనమాలు దిద్దుకుంది. ముఖ్యంగా ఆయన పత్రికలకు ఈ కీర్తి చెందాలి. ఆయన పత్రికలు ప్రభుత్వ విధానాలపైన, పరిపాలనపైన విమర్శనాత్మక వ్యాఖ్యాలను ప్రచురించేవి. పత్రికలు ప్రజాభిప్రాయాన్ని రేకెత్తించడం, క్రమబద్ధం చేయడం అనేది 'రాయ్‌' కృషితోనే ప్రారంభమయింది. 1823లో ప్రెస్‌ ఆర్డినెన్స్‌ను నిరసిస్తూ చేసిన ప్రకటనలో ఆయన రాజ్యాంగ సంబంధమైన ఆందోళనలకు సుస్పష్టమైన

గళాన్ని అందించారు. జ్ఞాన సముపార్జనలో ముందడుగు వేసిన జాతి చేపట్టిన ప్రతిఘటన అయినా అది ప్రభుత్వపు అస్తిత్వాన్నేగాక, ప్రభుత్వాధికారుల దుర్వినియోగాన్ని మాత్రమే నిరసించడానికి ఉద్దేశించినది అని ఆయన తన ప్రకటనలో విశదీకరించారు. క్రైస్తవ న్యాయశాస్త్రాల ద్వారానే క్రైస్తవులను విచారించేందుకు వీలుకల్పించే 1827 జ్యూరీ చట్టాన్ని నిరసిస్తూ చేసిన ప్రకటనలో ఆయన ప్రభుత్వానికి ఒక హెచ్చరిక చేశారు. భారత్ వంటిదేశాన్ని బలప్రయోగం ద్వారా అణచివేయగలమని ప్రభుత్వం భావించడం పగటికలకాగలదనీ, ప్రభుత్వాని కున్నవి రెండే ప్రత్యామ్నాయాలనీ ఆయన అన్నారు. "భారతదేశం బ్రిటిష్ సామ్రాజ్యానికి ప్రయోజనాలు సిద్ధింపచేసే అనుకూలమిత్రదేశంగా వ్యవహరించాలా లేక బద్ధశత్రువువలె బ్రిటిష్ పాలకులకు తలభారం కలిగించే దేశంగా మారాలా? ఏది కావాలో ప్రభుత్వం నిర్ణయించుకోవాలని ఆయన హెచ్చరించారు. తరువాత మౌలిక మానవ హక్కులు. సర్వమానవ సమానత్వం అనే ఫ్రెంచి విప్లవకారుల ముఖ్య ఆశయాల ద్వారా ఉత్తేజితులైన డిరోజియన్స్ రంగంలోకి దిగారు. పత్రికలపై ఆంక్షలు ఎత్తివేయాలని వారు ఉద్యమించారు. 1835లో చివరికి ఈ ఆర్డినెన్సు రద్దయింది. తదనంతరం మరో డిమాండు మార్మోగింది ప్రభుత్వంలో అత్యున్నత పదవులలో విద్యావంతులైన భారతీయులను నియమించాలన్నది ఆ డిమాండు. 1843లో ఈ డిమాండుకు ప్రభుత్వం సమ్మతించింది.

1837లో జమీందార్లు తమ సాధారణ ప్రయోజనాలను రాజ్యాంగరీత్యా నెరవేర్చుకోవడానికి జమీందారుల సంఘం ఏర్పాటు చేసుకుని దానిని 1839లో ఇంగ్లాండులో రామమోహనరాయ్ మిత్రుడు రివరెండ్ ఆడమ్ ఏర్పాటుచేసిన బ్రిటిష్ ఇండియా సొసైటీకి అనుబంధ సంస్థగా చేశాడు. ఇంగ్లండు సందర్శించిన ప్రిన్స్ ద్వారకానాథ్ టాగోర్ నాటి ప్రముఖ బ్రిటిష్ లిబరిస్టు జార్జి థాంప్సన్‌ను తోడ్కొని వచ్చారు. ఆయన సూచనపై 1843లో బెంగాల్ బ్రిటిష్ ఇండియా సొసైటీని స్థాపించారు. థాంప్సన్ దేశీయ రాజకీయ విజ్ఞాన వ్యాప్తికి నాంది పలకగా, ఒకటి సంపన్నులకూ, రెండవది మేధాసంపన్నులకూ ప్రాతినిధ్యం వహించే ఈ రెండు సంఘాల్లో జమీందారీల సొసైటీ, బెంగాల్ బ్రిటిష్ ఇండియా సొసైటీ, ఏమంత హెచ్చరికగా ముందుకు సాగలేకపోయాయి.

1849లో డ్రింక్ వాటర్ బెతున్ స్థానిక కోర్టుల పరిధిలోకి బ్రిటిషర్లను కూడ

చేర్చాలని బిల్లులను ప్రతిపాదించిన తరువాతగాని దేశంలో రాజకీయోద్యమం తిరిగి జీవం పుంజుకోలేదు. ఆ మేరకు నిషిద్ధ బిల్లులుగా బ్రిటిషర్లు ప్రకటించిన బిల్లులకు సాధారణామోదం, మద్దతు లభించినప్పటికీ, ఐక్యకార్యాచరణ ఏదీ లేకపోవడం వలన ఆ మద్దతు ఫలప్రదంకాలేదు. బ్రిటిష్ ప్రయోజనాల కోసం ఈ బిల్లులను రద్దుచేశారు. దానితో ఈ రెండు సంఘాలూ 1851లో విలీనమై బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్‌గా ఏర్పడాలని నిర్ణయించాయి. ఈ సంఘం సంస్కరణవాదంతో కూడిన రాజకీయ సంస్థ. బొంబాయి, మద్రాసు, పూనాలో కూడ ఇటువంటి సంఘాలు స్వతంత్రంగా ఏర్పడ్డాయి. తన ఉనికిని ప్రభుత్వం ఉపేక్షించలేని విధంగా ఈ సంఘం వ్యవహరించింది. శాసనసభలో భారతీయులను చేర్చాలనీ, భారతదేశంలోనూ, ఇంగ్లండులోనూ కూడా ఏకకాలంలో ఇండియన్ సివిల్ సర్వీసు పరీక్షలు నిర్వహించాలనీ, చట్టం ముందు బ్రిటన్‌లో జన్మించిన వారితో సహా అందరూ సమానులన్న సూత్రాన్ని ప్రభుత్వం ఆమోదించాలనీ, ఈ సంఘం పట్టువిడవకుండా డిమాండు చేస్తూ వచ్చింది. భారతీయులకు తగు మోతాదులో రాజకీయాధికారం లభింపచేసేందుకు మరికొన్ని ఇతర సంస్కరణలు ప్రతిపాదిస్తూ ఈ డిమాండ్లు కూడా చేశాడు. 1861లో తుదకు యురోపియన్ల హక్కులన్నింటినీ ఒక్క మినహాయింపుతో రద్దుచేశాడు. యురోపియన్లపై భారతీయ మేజిస్ట్రేటులుగానీ, న్యాయమూర్తులుగాని, విచారణ జరపరాదన్నదే ఆ షరతు. ఈ వివాదం చివరకు తీవ్రస్థాయికి చేరుకుని 1882-83లో ఇర్‌బెర్ట్ బిల్లుపై ఆందోళన మొదలైన తరువాత సంక్లిష్ట స్థితికి దారితీసింది.

1857లో సిపాయిల తిరుగుబాటు తరుణంలో ప్రముఖులతో కూడిన వర్గం ప్రభుత్వాన్ని బలపరచడం ఒక ఆశ్చర్యకరమైన పరిణామం. అయితే ఆ ప్రముఖుల వర్గంలో కూడా సిపాయిల తిరుగుబాటు అంతరాంతరాళంలో ఒక కుదుపు తెచ్చింది. ఈ తిరుగుబాటు తరువాత బ్రిటిష్‌దొరలకు ప్రభుత్వం అప్పగించబడినపుడు హిందూపేట్రియాట్ పత్రికా సంపాదకుడూ హరిశ్చంద్రముఖర్జీ ఇలా వ్రాశాడు. "భారతీయుల సమస్యలు భారతీయులే పరిష్కరించుకోవాల్సిన తరుణం ఇకవచ్చినట్లే. తిరుగుబాట్లు ఆంగ్లేయజనానికి అలవాటై పోయాయి. స్వదేశస్థునికి భాగస్వామ్యం లేని రాజకీయాల తీరే అంత." అప్పటికి దేశ స్వాతంత్ర్యానికై డిమాండు ఇంకా రాలేదు; భారతీయులు కోరినదల్లా తమకూ,

యురోపియన్లకు సమాన హక్కులుండాలనే. అప్పటికింకా శక్తివంతమైన జాతీయోద్యమం ఆవిర్భవించవలసిఉంది.

"భారతదేశపు సంపదలను తరలించడమే కాదు, స్వంతానికి కొల్లగొట్టడం కూడా ఈస్టిండియా కంపెనీ అధికారుల ఏజెంట్ల లక్ష్యం. ఈ రెండు కారణాల వేత, ముఖ్యంగా భారతదేశపు సంపదలను జేబులో వేసుకోవాలన్న ఆర్తి వేత ఈస్టిండియా కంపెనీ ప్రధాన కేంద్రానికి గాని, లండన్‌కి గాని, కంపెనీ అధికారుల అనధికార కార్యకలాపాల గురించి తెలియకుండా ఉండేందుకు అన్ని జాగ్రత్తలూ తీసుకున్నారు." (జె. నటరాజన్, హిస్టరీ ఆఫ్ ఇండియన్ జర్నలిజం.) కంపెనీ మాజీ ఉద్యోగి విలియమ్ బోల్ట్స్ 1776లో కలకత్తాలో ఇంగ్లీషు వార్తా పత్రిక ప్రారంభించడానికి ప్రయత్నించి భంగపడ్డారు ఈస్టిండియా కంపెనీ అధికారులు ఆయన ప్రారంభించబోయే పత్రిక గురించి వ్యాకులపడి వెంటనే ఆయనను ఇంగ్లాండుకు పంపించి వేశారు. రెండో ప్రయత్నంగా జె. ఎ హిక్ అనే మరో ఆంగ్లేయుడు 'ది బెంగాల్ గెజట్' అనే పత్రిక ప్రారంభించి ప్రభుత్వ బాకా పత్రికగా దాన్ని తయారు చేశాడు. అది జర్నలిజంలో అధమస్థాయికి ఉదాహరణగా తయారయింది 1786నాటికి బెంగాల్‌లో 4, మద్రాస్‌లో ఒకటి మొత్తం ఐదు ఆంగ్ల వార్త పత్రికలుండేవి బొంబాయిలో మొదటి వార్తా పత్రిక 1789లో ప్రారంభమైంది ఈ పత్రికలన్నీ ఆంగ్లేయుల సంపాదకత్వంలోవే ఏ సంపాదకుడైనా కంపెనీ అధికారులను గాని వారి పరిపాలనగాని విమర్శిస్తే ఇక ఆయన్ని తక్షణం ఇంగ్లండులో దిగవిడిచేవారు. ప్రింటింగు ప్రెస్సులన్నింటిపై కఠినమైన ఆంక్షలు ఉండేవి. 19వ శతాబ్ది ప్రారంభానికి కలకత్తాలో ఏడు ఆంగ్లవార్తా పత్రికలున్నాయి. 1813 - 1818మధ్య పత్రికల ప్రచురణా రంగంలోకి మిషనరీలు కూడా అడుగుపెట్టారు మిషనరీలు దిగ్‌దర్శన్ అనే బెంగాలీ మాసపత్రిక, సమాచారదర్పణ్, అనే బెంగాలీవార్తా పత్రిక, ది ఫ్రెండ్ ఆఫ్ ఇండియా అనే ఆంగ్ల మాసపత్రిక ప్రచురించేవి. అవన్నీ అధికారుల అండదండలలోనివే. 1818లో ఆంక్షలు ఎత్తివేశారు. ఆ తరుణంలో ఇద్దరు నియమబద్ధమైన నాయకులు పత్రికారంగంలో అడుగుపెట్టారు. వారు రామమోహనరాయ్, జేమ్స్, సిల్క్, బకింగ్‌హామ్ కలకత్తా జర్నల్‌లో బకింగ్‌హామ్ నిర్భయంగా ఈస్టిండియా కంపెనీ అక్రమ పాలనను తూర్పారబడుతూండడంతో ప్రభుత్వానికీ, ఆయనకూ మధ్య పచ్చగడ్డి భగ్గుమని

1823లో ఆయనను ఇంగ్లాండుకు తరలించేశారు. అక్కడ ఆయన తన ఉద్యమాన్ని కొనసాగించాడు. రామమోహన్‌ బెంగాలీలో సాంబాద్‌ కౌముది, పర్షియన్‌లో మీరతుల్‌ - అక్బర్‌, ఆంగ్లంలో బ్రాహ్మణికల్‌ మాగజైన్‌ పత్రికలు ప్రారంభించారు. పత్రికలు చాలా స్వల్పకాలం పాటు ప్రభుత్వదృష్టిలో లేకుండా చాలా స్వేచ్ఛ అనుభవించాయి. ఆ స్వల్పకాలాన్ని రామమోహనరాయ్‌ సద్వినియోగ పరచుకున్నారు. అయితే 1823లో ఆ స్వాతంత్ర్యం కాస్తా పోయింది. రామమోహన్‌ ఎలా ప్రతిఘటించినదీ ముందు చెప్పుకొన్నాం. భారతీయ భాషలలో భారతీయ యాజమాన్యంలో వెలువడే పత్రికలకు చాలా తక్కువ రాయితీలుండేవి. సనాతన హిందూ ధర్మాలు ప్రచారం చేసేవిగా ముద్రపడ్డ పత్రికలకు మాత్రమే స్వేచ్ఛ ఉండేది. సంస్కరణవాద పత్రికలు ప్రజాజీవితంపై విమర్శనాత్మక వ్యాఖ్యలు చేయకపోతేనే వాటిని కొనసాగనిచ్చేవారు. 1830లో బెంగాల్‌లో ప్రచురించే ఆంగ్లదిన పత్రికలు, వార పక్ష త్రైమాసిక పత్రికల సంఖ్య 33కాగా భారతీయ పత్రికల సంఖ్య 16మాత్రమే. వాటిలో చాలా పత్రికలు ఎంతోకాలం కొనసాగలేకపోయాయి. తక్కినవి ప్రచార వ్యాపారంతో వెలువడిన కాగితాలుగా మిగిలాయి. 1835లో పత్రికలపై ఆంక్షలు ఎత్తివేయడంతో విరుద్ధ భావ ప్రచారాలకు వివిధ పత్రికల మధ్య పోటీ పెరిగి సైద్ధాంతిక ఘర్షణలతో కూడిన జర్నలిజం వృద్ధిపొందింది. హిందూ మితవాదులూ, సంస్కర్తలు, క్రైస్తవ మిషనరీలు అందరూ కలాల యుద్ధంలోకి దూకారు. బ్రిటిష్‌ ప్రభుత్వానికి విధేయత మినహాయించి, సామాజిక, మతపరమైన సమస్యలు, అంశాల విషయంలో అవన్నీ వేర్వేరు దృక్పథాలను ప్రతిబింబించేవి.

1850 నుంచి బెంగాల్‌ పత్రికలు ప్రభుత్వ విధానాలపై ప్రభావం చూపడం మొదలుపెట్టాయి. 1853లో స్థాపించిన హిందూ పేట్రియాట్‌ పత్రికా సంపాదకులు హరిశ్చంద్రముఖర్జీ అధికార యంత్రాంగానికీ, కడుపులో చల్లకదలని ప్రభుత్వోద్యోగులకు, బెంగాల్‌ ప్లాంటర్సుకూ సింహస్వప్నంలా తలపించేవారు. విద్యాసాగర్‌ బెంగాలీ వారపత్రిక సోంప్రకాశ్‌, హిందూ పేట్రియాట్‌, ఇండియన్‌ మిర్రర్‌ అనే ఆంగ్ల పక్షపత్రిక, (1861 స్థాపితం) 1860-62లో తిరుగుబాటుగా రూపొందిన ఇండిగో వివాదంలో గణనీయమైన పాత్ర నిర్వహించాయి. ఆంగ్లంలో ప్రచురితమైన తదుపరి భారతీయ పత్రిక 'బెంగాలీ', 1862లో వారపత్రికగా

ప్రారంభమైన ఈ పత్రిక తదనంతరం సురేంద్రనాధ్ బెనర్జీ సంపాదకత్వంలో జాతీయోద్యమానికి కొమ్ముకాసిన ప్రముఖ పత్రికగా రూపొందింది.

౫. మోతీలాల్ ఘోష్, ఆయన సోదరులు ప్రజాజీవితంలోకి ప్రవేశించేనాటికి బెంగాల్ స్థితిగతులు ఆ విధంగా ఉన్నాయి పట్టణ ప్రాంతాలలోని నాయకులవలె కాక వారు గ్రామీణ పేదల మధ్యనుంచి వచ్చారు నాడు జోరుగా వ్యాపిస్తోన్న జాతీయోద్యమంలోకి భారతీయ జీవితానికి వెన్నుముక అనతగ్గ గ్రామీణ పేద ప్రజలతో ప్రత్యక్ష సంబంధంగల నాయకుల కొరతను వారు తీర్చారు

ఎస్.ఎల్.ఘోష్.

# 1. బాల్యము – విద్య

మోతీలాల్ ఘోష్ 1847 అక్టోబర్ 28న పాలువా-మగురా అనే గ్రామంలో ఉన్నత కాయస్థ కులస్థులైన సామాన్య మధ్యతరగతి కుటుంబంలో జన్మించారు. ప్రస్తుతం బంగ్లాదేశ్‌లో వున్న జెస్సోర్ జిల్లాలోనిది ఈ గ్రామం. మోతీలాల్ తల్లి అమృతమాయీ పేరిట ఈ గ్రామం పేరు అమృతబజార్‌గా మారింది. జిల్లాముఖ్య పట్టణం జెస్సోర్‌కు 15 కిలోమీటర్ల దూరంలో ఉంది పాలువా - మగురా గ్రామం. మోతీలాల్ తండ్రి హరినారాయణ ఘోష్ జెస్సోర్ పట్టణంలో ప్లీడరు. గ్రామస్థుల అవసరాలన్నీ తీర్చగల భారతదేశపు అన్ని గ్రామాలలో వలనే పాలువా -మగురా తక్కువ జనాభాగల చిన్న గ్రామం. ఆ జిల్లాకు, ఆ జిల్లా ముఖ్య పట్టణానికి మధ్య యుగాలనాడు అదే జిల్లాలో ఉండిన ప్రతిపాదితరాజు రాజధాని నగరం జస్సోర్ ద్వారా ఆ పేరు సంక్రమించింది. ప్రతిపాదితుడు నాటి ముఖ్య భూస్వాములలో ఒకరు. అతని సామ్రాజ్యాన్ని అక్బర్ చక్రవర్తి కలిపేసుకోబోగా అక్బర్ సేనలతో అతను పోరాడాడు. మరొక పౌరుషం గల రాజు రాజసీతారాం. ఆ స్థానం కూడ ఇదే జిల్లాలో ఉండేది. ఆయన తన స్వతంత్ర ప్రతిపత్తిని చాటడానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు. మోతీలాల్ జన్మించిన తరుణంలో అది చాలా ముఖ్యమైన జిల్లా. భారీ ఇండిగో ఉత్పత్తి కేంద్రాలలో ఆ జిల్లా కూడా ఒకటి. తాటిచెట్లనుంచి చక్కెర, బెల్లం ఉత్పత్తి జరిగేది. ఆ జిల్లా దక్షిణ సరిహద్దులో సుందరబన్స్ అవల బంగాళాఖాతం ఉంది. ఈ ప్రాంతంలో విస్తారంగా వరిపండే సుక్షేత్రాలైన భూములు, ప్రభుత్వ యాజమాన్యంలోని పెక్కు ఉప్పు కర్మాగారాలు కూడ ఉండేవి. ఈ జిల్లా ఎగువ ప్రాంతాలలో శతాబ్దాల తరబడి గ్రామాలు, గ్రామస్థులు ఆవాసాలు ఏర్పరచుకొని ఉన్నారు. దిగువ ప్రాంతంలో భూములను క్రమంగా సాగుచేసుకుని వరిపంట పండించారు వారు. దీనితో దేశీయ పరిశ్రమలు నశించడంవల్ల అదుపుతప్పిన ఆర్థిక సంక్షోభ ప్రభావం ఈ ప్రాంతాల ప్రజలను తాకలేదు. వారి

అవసరాలు చిన్నవి. వారి జీవితాలు చాలా నిరాడంబరంగా సాగాయి. మోతీలాల్ ఘోష్ తన వృద్ధాప్యంలో (1915) గత స్మృతులను ఆర్తితో నెమరువేసుకుంటూ "నేటి మన ఘోరమైన కలలకి అతీతంగా నాడు జీవితం చాలా ఆదర్శప్రాయంగా గడిచిపోయిందని" తలపోసేవారు. ఆయన స్వగ్రామం కల్కోనదిపై ఉండే బ్రిటిషర్లు కబోదాక్‌గా పిలిచిన ఈ నది నాడు చాలా ప్రశస్తమైనది. ఆ గ్రామస్థుల మధ్య మోతీలాల్ బాల్యం చాలా ఉల్లాసంగా గడిచింది.

మోతీలాల్ ఎనిమిదిమంది సోదరుల మధ్య నాలుగోవాడు. పెద్దన్నగారు బసంతకుమార్‌కు జ్ఞాన సముపార్జనాసక్తి మెండు. ఆయన తన విజ్ఞానాన్ని తమ్ములకు పంచుతూ వచ్చాడు. వారిలో జర్నలిజం పట్ల ఆసక్తి రేకెత్తించడానికి ఆయన బోధనలే కారణం. ఆయన బోధనలవల్లనే శిశిర్‌కుమార్, మోతీలాల్ తమ తదనంతర జీవితంలో పేరు ప్రఖ్యాతులు గడించగలిగారు. 1862 డిసెంబర్‌లో బసంతకుమార్ అమృత ప్రభాహిని అనే సంస్కృత పత్రిక ప్రారంభించాడు. జెస్సోర్‌నుంచి ఇది పక్షపత్రికగా సైన్సు,సాహిత్యం, పరిశ్రమలు, వ్యవసాయం ఆది రంగాల వైజ్ఞానిక సమాచారంతో వెలువడింది. పత్రిక ప్రారంభించిన కొద్ది కాలానికే ఆయన మరణించడంతో ఆ పత్రిక మూలపడింది. రెండవ అన్నగారు హేమంతకుమార్ కలకత్తా వైద్యకళాశాలలో వైద్యశాస్త్రం అభ్యసించారు. కాని 1864లో తండ్రి హరీంద్రనాథ్ మరణంవల్ల ఆర్థిక పరిస్థితి తలక్రిందులై ఆయన డిగ్రీ చేతికి రాకముందే చదువు విరమించవలసివచ్చింది. మూడవ అన్నగారు శిశిరకుమార్ భారతదేశంలో విఖ్యాత జర్నలిస్టుగా రూపొందారు. మోతీలాల్‌ను బాల్యంలో తీర్చిదిద్ది ఆయనకు అన్ని విషయాలలోనూ పెద్దదిక్కుగా వ్యవహరించారు. శిశిరకుమార్ మోతీలాల్ తమ్ములలో హీరా లాల్ చిన్నప్పుడే మరణించాడు. రామ్‌లాల్, వినోద్‌లాల్ కొద్ది కాలమే బ్రతికాడు. అందరికంటె చిన్నవాడైన గోలప్‌లాల్ అనే సోదరుడు మోతీలాల్ తదనంతరం పత్రికా సంపాదకత్వ బాధ్యతను చేపట్టి పత్రికా సంప్రదాయాలను నిలబెట్టాడు. బాల్యంలో చాలా సున్నితమనస్కుడైన మోతిలాల్ తనపెద్దన్నగారైన బసంతకుమార్ వద్దనే తొలి పాఠాలు నేర్చుకుని, ఆయనను తండ్రి సమానులుగా గౌరవించాడు. స్థానిక పాఠశాలలో ఆయన అన్ని తరగతులూ చదివాడు ప్రాథమిక విద్య తరువాత హైస్కూలు విద్యకు ఆయన నాదియా జిల్లా ముఖ్యపట్టణమైన క్రిష్ణగర్ వెళ్లాడు.

ఎందుకంటే ఆయన గ్రామంలోగాని, చుట్టు ప్రక్కలగాని అప్పుడు హైస్కూలు లేదు ఈ జిల్లా ఇండిగో వ్యాపారానికీ, క్రైస్తవ మిషనరీలకీ చాలా పటిష్టమైన కేంద్రమే కాక సనాతన సంస్కృత ఇతిహాస గ్రంథాల అధ్యయనానికి అనాదిగా పేరు గడించినది. అది నాదియా మహారాజులని పిలవబడే అర్ధ – భూస్వామ్య సంపన్న కుటుంబాల ఆస్థానం. మహారాజా కృష్ణచంద్ర పేరిట దానికా పేరు వచ్చింది. ప్లాసీ యుద్ధం సమయంలో మహారాజాకృష్ణచంద్ర బ్రిటిష్‌వారి పక్షం వహించాడు. ఆయన విద్య, విజ్ఞాన వ్యాప్తిని ప్రోత్సహిస్తూ పోషకునిగా ఉండేవాడు. క్రిష్ణనగర్‌లో ఇంగ్లీషు విద్య ఎంతగా వ్యాప్తి చెందిందంటే ఛాందస సనాతనవాదులు ఇంగ్లీషు నేర్చుకొన్న వారిని చూసి ముఖాలు చిట్లించేవారు. అయితే క్రైస్తవ మిషనరీలు సాగిస్తున్న ప్రచారంలోని బలాన్ని వారు గ్రహించారు. 1860లో ఈ పట్టణాన్ని బ్రహ్మసమాజోద్యమ నాయకులు మహర్షి దేవేంద్రనాద్ టాగోర్,బ్రహ్మానందకేశవ చంద్రసేన్ సందర్శించాడు వారి సందర్శన, నూతనత్వంతో జాగృతమైన వారి హిందూమతోపన్యాసాలు ప్రజలను ముఖ్యంగా యువకులను ఎంతగా ఆకట్టుకొన్నాయంటే త్వరలోనే ఆ పట్టణం బ్రహ్మసమాజ కార్యక్రమాలతో నిండిపోయింది. మోతీలాల్ కూడ ఆ ఉద్యమంలో చేరాడు. బ్రహ్మసమాజం బోధిస్తున్న సంఘసంస్కరణ కార్యక్రమాలను గట్టిగా బలపరచాడు. తన అన్నల వలెనే హిందూమత ప్రాతిపదికను కోల్పోకుండా సంఘసంస్కరణలను ఆయన ఆశయంగా పెట్టుకున్నాడు.

మోతీలాల్ ప్రవేశపరీక్ష ఉత్తీర్ణుడై స్థానిక కళాశాలలో ఆర్ట్సుకోర్సు మొదటి ఏడాదిలో చేరాడు సెలవు దినాల్లోనూ, కళాశాల తాత్కాలికంగా మూసే రోజుల్లోనూ ఆయన తన ఇంటికి తిరిగి కళాశాలకే నడుచుకుంటూ వెళ్లవలసి వచ్చేది. రానూపోనూ నడక 160 కిలో మీటర్లు. అప్పటి రోజుల్లో రైలు సౌకర్యం, అనుదినం బస్సు ఇత్యాది వాహనాల సౌకర్యం లేదు. ఒడుదుడుకులు లేకుండా చదువు కొనసాగించడంలో ఆయన ఈ కారణంచేత చాలా కష్టపడవలసి వచ్చేది. ఈ కారణం చేతనో, తండ్రి మరణానంతరం తల ఎత్తిన ఆర్థిక సమస్యల వల్లనో ఆయన ఫైనలు పరీక్షకు హాజరుకాలేదు. అదే జిల్లాలోని పిల్‌జంగా అనే గ్రామం[illegible] క్రొత్తగా ప్రారంభించిన ప్రైవేటు ఇంగ్లీషు హైస్కూలు హెడ్‌మాస్టరుగా చేర[illegible] అయితే ఎప్పుడూ దృఢంగాలేని ఆయన ఆరోగ్య పరిస్థితి అప్పుడు మరింత

క్షీణించి తన స్వగ్రామానికి తిరిగి వచ్చేశాడు. స్వగ్రామంలో మునుపు తన అన్నగార్లు ప్రారంభించిన ఉన్నత పాఠశాల, బాలికల పాఠశాల, వయోజన మహిళా పాఠశాల వ్యవహారాలు చూసుకునేవాడు. ఆ గ్రామంలోని అగ్రవర్ణాల నాయకులు వీరు ప్రారంభించిన సంస్కరణ కార్యకలాపాలకుగాను వీరిని దుయ్యబట్టారు. అయితే ఘోష్ సోదరులు హరిసభ, బ్రహసభ రెండూ పెట్టి వారి విమర్శలను గట్టిగా ప్రతిఘటించాడు. కాలక్రమాన ఘోష్ సోదరులు వైష్ణవం అనుసరించారు.

భాస్కరకుమార్ అకాలమరణం ఆ కుటుంబానికి అశనిపాతం అయ్యింది. అప్పటికి హేమంతకుమార్, శిశికుమార్ ఇద్దరూ ఆదాయం పన్ను డిప్యూటీ కలెక్టర్లుగా ప్రభుత్వోద్యోగాల్లో ఉన్నారు. అయినప్పటికీ ప్రజలను జాగృతి చేయగల ప్రచార సాధనంగా జర్నలిజం ప్రాముఖ్యతని వారు గుర్తించారు. ఆ స్పృహ వారి రక్తంలో జీర్ణించుకుంది. ఇద్దరూ 1867లో తమ ఉద్యోగాలకు రాజీనామా చేశారు. బెంగాలీలో వారి పత్రిక నడిపేందుకు వారు స్వగ్రామం చేరుకున్నారు. దశాబ్దకాలంలో చరిత్ర సృష్టించిన వార్తా పత్రిక అది.

# 2. ఒక పత్రిక ఆవిర్భవించింది

**1868** ఫిబ్రవరి 20వ తేదీన అమృత బజార్ పత్రిక విడుదలయ్యింది. నిజంగా అది ముగ్గురు సోదరుల ఉమ్మడి సంస్థ. ఒక గ్రామం నుంచి వారపత్రిక ప్రచురించడానికి సాహసం కావాలి - ఎందుకంటే - ఆ సోదరులు ముగ్గురూ ఆర్థికంగా అంత హెచ్చరికగా లేరు. అయితే వాళ్ళు ఆ సాహసాన్ని ఎలా ప్రారంభించి ఎలా కొనసాగించారు అన్నది మోతీలాల్ స్వంత మాటలలోనే బాగా వివరించారు.

ప్రింటింగ్ వ్యాపారం నిమిత్తం కలకత్తా దగ్గర ఒక చోట ఒక వ్యాపారి ప్రింటింగ్ యంత్ర పరికరాలు కొన్నాడు. అయితే ఆయన ఆ వ్యాపారంలో విఫలమయ్యాడు. అనంతరం కన్నుమూశాడు. ఆ యంత్రాలు, పరికరాల్ని అమ్మేయాలని ఆయన వితంతువు అనుకుంది. వాటిని కొని జెస్సోర్‌లోని చిన్న గ్రామం అమృత బజార్‌కు తేవడం జరిగింది. వీటిలో చాలా విలువైనది ప్రింటింగ్ ప్రెస్సు. అది చెక్క ప్రెస్సు. దాని పేరు బెలిన్‌ప్రెస్, ఖరీదు 32 రూపాయలు. గ్రామంలో ఉన్న వడ్రంగి సహాయంతో దాన్ని అమర్చారు. అరిగిపోయిన టైపులతో కేసులను స్టాండుల మీద అమర్చారు. ఈ రకంగా అమృత బజార్ గ్రామంలో ఓ ముద్రణాలయం ఏర్పడింది.

ఇదంతా చేసిన తరువాత పత్రికా స్థాపకులు కలకత్తాలో ముద్రణ వ్యాపారం గురించి నేర్చుకోవలసి వచ్చింది. పత్రిక ప్రారంభించిన తరువాత స్టిక్‌లు చేతపట్టి తమ రచనలు తామే టైపు కూర్చుకుంటూ, ప్రతులు తామే ముద్రించుకునేవారు. సూక్ష్మంలో చెప్పాలంటే, ఆ గ్రామంలో కొందరికి కంపోజింగ్, ముద్రణ నేర్పినా కూడా యజమానులు కంపోజిటర్, ప్రెస్‌మాన్ నుంచి సంపాదకుడి దాకా అన్ని పనులూ తామే చేసుకోవాలి. స్వగ్రామం అమృత బజార్‌లో ఉన్నంతకాలం అదే పరిస్థితి.

స్టిక్‌లు చేతబట్టుకోవడమే కాదు. ప్రతుల ముద్రణకు యంత్రం త్రిప్పడం,

రోలర్స్, టైప్స్ ఎక్కించడం, కాగితం, మాట్రిసులు సిద్ధంచేయడం, ఇంకు తయారుచేయడం అంతా యజమానులు చేసుకోవలసిందే. కాగితం తయారుచేయడంలో వాళ్లు విఫలమయ్యారు కాని మేలురకం ఇంకు తయారుచేయగలిగారు. మాట్రిసులు, టైపులు చాలా నాసిరకం తయారీలు, అయితే అత్యవసరాలకి అవే వాడారు.

బెంగాలీ వారపత్రికగా వారు అమృతబజార్‌పత్రికను ప్రారంభించినపుడు దాని సైజు 2 1/2 క్రౌన్‌సైజు. అమృత అంటే అమృతం, తేనె. బజార్ అంటే మార్కెట్. పత్రిక అంటే పత్రిక. ఈ మూడు పదాలు (ఎ.బి.పి) కలిస్తే ఈ పత్రిక తేనెను పంచి యిచ్చే పత్రిక అని ఒక అర్థం. అమృత అనే పదానికి విషం అనే మరో అర్థం చెప్పుకుంటే అమృత బజార్ అనేది దాని యజమానుల దృష్టిలో అటు అమృతాన్ని, ఇటు విషాన్నీ కూడ పంచి ఇచ్చేదని అర్థం. ఋజు దృష్టిగలవారికి అమృతాన్ని, దూరదృష్టిగలవారికి విషాన్ని పత్రిక అందిస్తుందని ఈ పత్రిక పేరులో ద్వంద్వార్థం గర్భితమై ఉంది.

పత్రిక ప్రచురణలో అంతా స్వయం సంచాలకత్వం ఎంతోకాలం సాగలేదు. పత్రికలో ప్రచురితమైన రచనల కర్తలు కూడ యజమానుల కుటుంబంలోనివారూ, వారి దగ్గరి బంధువులును, ప్రారంభించిన కొద్ది నెలలలోనే సర్క్యులేషన్ 500 కి పెరిగింది. అప్పటి కాలాన్ని బట్టి చూస్తే అది ఏమంత తక్కువకాదు. పత్రికకి లభించిన ప్రచారం వలన ప్రభుత్వం ఆ పత్రికలోని వ్యాఖ్యలు, రచనలని చాలా జాగ్రత్తగా గమనించడం ప్రారంభించింది. త్వరలోనే పత్రిక రాతలకి వళ్లుమండి ప్రభుత్వం పత్రికమీద కత్తిగట్టింది.

స్థానిక పరిపాలకులూ, అధికారులూ ప్రజలపై సాగిస్తున్న దురన్యాయాలను బహిర్గతం చేయడం, ప్రజల సాధకబాధకాలను పట్టించుకొనడం వల్లనే ఈ పత్రిక అనతికాలంలో విశేష ప్రచారం పొందింది. దానితో అధికారుల కీర్తికి ఈ పత్రిక ఆటంకం కలిగించి, వారికి కంటకప్రాయంగా తయారైంది. వారిలో చాలామంది దొరలు నిర్భీకత, నిస్సంకోచంతో తమపై పత్రిక ద్వారా విమర్శలు గుమ్మరిస్తున్న ఘోష్ కుటుంబానికి గుణపాఠం చెప్పాలని నిశ్చయించుకున్నారు. ఈ లోగా పత్రిక మిత్రవర్గం విస్తరిల్లింది. స్థానిక న్యాయవాదులు, అధ్యాపకులు ప్రజల అండదండలు పత్రికకి లభించాయి. పత్రిక నాలుగు నెలల ప్రాయంలో ఉండగా

ఆ పత్రిక పరువునష్టం దావాలో ఇరుక్కుంది మేజిస్ట్రేట్ కార్యాలయంలోని ఒక మిత్రుడు వ్రాసిన వ్యాసాన్ని ఈ పత్రిక ప్రచురించడం ఆ వ్యాసంలో యూరోపియన్ సబ్ డివిజనల్ అధికారి ఒకరిపై విమర్శలుండడం వలన ఈ కేసు బనాయించాడు. వ్యాసరచయిత పేరైతే ప్రచురితమైంది. అయితే ఆ రోజుల్లో పత్రికపై పత్రికా సంపాదకుని పేరు విధిగా ప్రచురించాలనే చట్టపరమైన నియమం ఏదీ లేదు ఈ కారణంచేత ఎ.బి.పి సంపాదకునిగా శిశిర్‌కుమార్‌దే ఈ కేసులో పూర్తి బాధ్యత అని నిరూపించడానికి ప్రాసిక్యూషన్ తెగ తంటాలు పడింది. మోతీలాల్ ఘోష్‌ను సాక్షిగా ప్రవేశపెట్టారు. కేసు విచారిస్తున్న మేజిస్ట్రేటుగారే స్వయంగా క్రాస్-ఎగ్జామినేషన్‌ని పకడ్బందీగా సాగించినా పత్రిక సంపాదకుడు ఎవరు అనేది తేలలేదు. "పత్రిక సంపాదకుడెవరు"ని మోతీలాల్‌ని మేజిస్ట్రేటు ప్రశ్నించినపుడు, మోతీలాల్ "పత్రిక ఈమధ్యనే ప్రారంభమైంది. ఎవరు సంపాదకుడన్నది ఇంకా నిశ్చయం కాలేదు" అని జవాబిచ్చాడు

మేజిస్ట్రేట్ : కాని శిశిర్‌కుమార్ సంపాదకుడని ప్రజలు భావిస్తున్నారు కాదా?

మోతీలాల్ : అది నిజమే ప్రజలు అలా ఎందుకనుకుంటున్నారంటే, శిశిర్‌కుమార్ చాలా బాగా వ్రాయగలడని వారు నమ్ముతున్నందువల్ల

మేజిస్ట్రేటు : శిశిర్‌కుమార్ ఆంగ్లం బాగా వ్రాయగలరని మీరు అనుకొంటున్నారా?

మోతీలాల్ : ఆ, చాలా బాగా వ్రాయగలడు. నిజం చెప్పాలంటే జేబులు పిక్కటిల్లే భారీ జీతాలు పొందుతున్న ప్రభుత్వోద్యోగులు చాలామంది కంటె చాలా బాగా వ్రాయగలడు.

పత్రిక తరఫున డిఫెన్స్ వకాల్తాను కలకత్తా హైకోర్టుకి చెందిన ప్రముఖన్యాయవాది మన్‌మోహన్‌ఘోష్ నిర్వహించారు. బోను ఎక్కినపుడు మోతీలాల్ ఘోష్ క్రాస్ ఎగ్జామినేషన్‌లో సూటిగా ఇచ్చిన జవాబులకి ఆ న్యాయవాది మెచ్చుకున్నాడు కేసు ఎనిమిది నెలలపాటు సాగింది. ఘోష్ సోదరులని నిర్దోషులుగా తేల్చి విడిచిపెట్టారు. అయితే ముద్రాపకుడికి ఆరు నెలలు, వ్యాసరచయితకి ఏడాది శిక్షలు పడ్డాయి. ఈ కేసులో సాక్ష్యాధార పత్రాలు గల్లంతు చేసారన్న అభియోగంపై మళ్ళీ ప్రాసిక్యూషన్ సాగింది. దావాకి కారణమైన వ్యాసాన్ని గయామత్ చేసారన్నది అభియోగం. కాని కేసు విఫలమైంది. ఆర్థికస్థితి ఎప్పుడూ అంతంతమాత్రంగా ఉండే ఘోష్ సోదరులు ఇక తీవ్రమైన ఆర్థిక ఒడిదుడుకుల్లో ఇరుక్కుపోయారు.

కొందరు సన్మిత్రుల చేయూతతో పత్రికా ప్రచురణ మాత్రం నిరాటంకంగా కొనసాగింది.

1869 నుంచి పత్రికలో ఆంగ్లభాష కూడా ప్రవేశపెట్టి కొన్ని వ్యాసాలు ఆంగ్లంలో ప్రచురించడం ప్రారంభించడంతో పత్రిక ద్విభాషా పత్రికగా మారింది. బెంగాలీ చదవని ఇతర ప్రాంతాలకు కూడ పత్రిక వ్యాపించాలని "ప్రచురణకర్తలు సంపాదకుడు" భావించడమే ఈ మార్పుకి కారణం పాఠకులు కూడ అటువంటి మార్పుకోరుతూ వచ్చారు నాటి బెంగాల్ ప్రెసిడెన్సీలో నేటి బెంగాల్, బీహార్, ఒరిస్సాలు ఉండేవి. మూడు భాషల రాష్ట్రాలు ఒకే పాలనా యంత్రాంగం పరిధిలో ఉండేవి. పత్రికని ద్విభాషా పత్రికగా మార్చిన తరువాత ఆ మార్పు బాగా విజయవంతమైంది, 1871 నాటికి ఈ పత్రిక ఆర్థికంగా బలం పుంజుకుంది. అక్కరలేని సొంత ఖర్చులన్నీ తగ్గించుకుని సిబ్బందికి మంచి జీతాలు ఇవ్వడం వలన ఇది సాధ్యమైంది. నిజానికి ఘోష్ సోదరులు జన్మాంతం నిరాడంబరత, రుజువర్తనకి పెట్టింది పేరుగా బ్రతికారు. ఎన్నడూ అట్టహాసాలకి ఆడంబరాలకి పోలేదు. ఇందువలన వారు సగటు ప్రజల హృదయాలను చూరగొని వారితో సత్సంబంధాలు ఏర్పరచుకోగలిగారు.

ఈ నిరాడంబరత్వం అనేది మోతీలాల్ ఘోష్‌కూ, ఆయన సోదరులకూ ఒక ఆదర్శం వలె ఉంటూ వచ్చింది. సామాజిక పరమైన అంశాల విషయంలో వారి సంస్కరణ దృష్టి యావత్తూ వారి వైష్ణవత్వం నుంచి పుట్టినదిగానే కనిపిస్తుంది. సకల జీవరాశిపట్ల దయ అనేది వారి మతం. వారు సగటు మానవునితో భావసారూప్యత చెందినందువల్లనే సామాన్యుల వేషభాషలు, జీవన సరళిని వరించారు. భక్తిసంగీతంలోనూ వారికి జన్మతః అలవడిన ప్రావీణ్యం ఉంది. ముఖ్యంగా ధ్రుపద కీర్తనల్లో నిష్ణాతులు. వైష్ణవుల భక్తి గీతాలలో కీర్తనలది ప్రత్యేకమైన సరళి.

తూర్పు భారతదేశంలో కీర్తనలు బాగా ప్రసిద్ధి. సాటిలేని సాహిత్య-శిశిరకుమార్ ఘోష్ ధ్రుపద గీతల రచయిత కూడ. విఖ్యాత వైష్ణవ ఆచార్యులు శ్రీచైతన్య జీవిత చరిత్రను 'అమియానిమై చరిత్ర' పేరిటగా శిశిరకుమార్ కావ్యం వ్రాశారు. అది బెంగాలీ సాహిత్యంలో ఒక ఇతిహాసంగా నిలిచిపోయింది. గ్రామంలో ఉన్నపుడూ తదనంతర కాలంలో కలకత్తాలో నివసించినపుడు కూడ ఘోష్ సోదరుల గృహం

ప్రతి సాయంత్రం భజనలతో సందడిగా ఉండేది. స్త్రీ పురుష వయోవృద్ధులు బాలలూ – అందరూ ఈ భజనల్లో పాల్గొనేవారు.

ఘోష్ సోదరులు తమ దృష్టిని కేంద్రీకరించిన మరో అంశం ఆధ్యాత్మిక చింతన. తండ్రి హరినారాయణ్ 1863లో మరణించారు; మోతీలాల్ చిన్న తమ్ముడు హీరాలాల్ ఎప్పుడూ ఏదో పోగొట్టుకొన్నట్టు విచారగ్రస్తుడై ఉండేవాడు. చివరికి 1866లో అతను ఆత్మహత్య చేసుకున్నాడు. ఈ రెండు కష్టాలూ వారి మనసులకి గాయాలయ్యాయి. అమెరికాలో అప్పుడే ప్రచారంలోకి వస్తున్న నవీన ఆస్తికవాద ధోరణుల ప్రభావంతో మరణించిన వ్యక్తుల తాలూకు దయ్యాలతో సంభాషించడం, వాటిని అదుపు చేయడం వాటిని లొంగదీసుకోడానికి సంబంధించిన సాహిత్యం విరివిగా మొదలైంది ఆ రచనలు నాడు భారతదేశంలో కూడ అందుబాటులో ఉండేవి అమెరికా వెళ్లి భూతవైద్యం వంటి అతీత శక్తులకు సంబంధించిన కళ నేర్చుకోవాలని శిశకుమార్ తలపోసారు. అయితే కలకత్తాలోని ఆయన సన్నిహిత సలహాదార్లు కొందరు ఆయిన అమెరికా వెళ్లనవసరం లేకుండానే ఆ యా విద్యలకు సంబంధించిన పరిజ్ఞానం అందచేశారు. స్వగ్రామానికి తిరిగి వచ్చిన తరువాత శిశిరకుమార్ ఆధ్యాత్మిక సదస్సులు, నిష్ఠగా నిర్వహిస్తూ వచ్చారు. హిందూ స్పిరిట్యువల్ మాగజైన్ (1908)లో ఆయన ఆధ్యాత్మిక చింతనపై వ్రాస్తూ,

"దేశంలో ఆధ్యాత్మిక వాదాన్ని మొదటిసారి మనమే ప్రవేశపెట్టాం. మొదటి గోష్ఠులు, సదస్సులు మన గ్రామంలోనే జరిగాయి. ఈ సదస్సుగురించి కలకత్తాలోని మన మిత్రులు కొందరు తెలుసుకుని తమ వార్తా పత్రికల్లో ప్రచారం చేశారు (ఇండియన్ డెయిలీ న్యూస్), తత్ఫలితంగా దేశం నూలమూలలా ఇది తీవ్ర సంచలనం సృష్టించింది. పట్టణాలకు, పల్లెలకు, ఇంటింటికీ ఈ సమాచారం చేరింది. అమృత బజార్ పత్రికవాళ్లు (అమృత బజార్) మన స్వగ్రామమే.) మరణించిన వారితో మాట్లాడడంలో కృతకృత్యులు అయ్యారని ప్రజలంతా చెప్పుకున్నారు. ఆవిధంగా దేశంలోని ప్రతి కుటుంబంలో ఆధ్యాత్మిక సంవాదాలూ, నిష్ఠలూ, సదస్సులూ ప్రారంభమయ్యాయి."

భూతవైద్యం అతీత శక్తుల విజ్ఞానం నేర్చుకోవడానికీ, ఆచరించడానికి మోతీలాల్ ఘోష్‌కు వ్యవధి దొరక్క పోయినప్పటికీ తక్కిన సోదరులు ముగ్గురూ ఈ

రంగంలో చాలా అభివృద్ధి సాధించారు. హేమంతకుమార్ కుమారుడు మృణాల్ కాంతి (1954లో మరణించాడు) భూతవైద్యంలో చాలా అందెవేసిన చేయి. మరణానంతర జీవితంపై "పరలోకాల్ కథా" పేరిట ఆయన వ్రాసిన బెంగాలీ గ్రంథం విపరీతంగా అమ్ముడుపోయింది. జాతర, లేదా ఆరుబయలు రంగస్థల కార్యక్రమాలు బాగా ప్రచారంలోకి వచ్చిన ఆ రోజుల్లో ఘోష్ సోదరులు తమ గ్రామంలో రంగస్థల నాటకాల ప్రదర్శన ఉద్యమానికి కూడ నాయకత్వం వహించారు. వారి నిర్వహణలో ప్రదర్శించే నాటకాలు చాలా ఉన్నత ప్రమాణాలు కలిగి ఉండేవి. పేరెన్నిక గన్న నటులు పలు ప్రాంతాలనుంచి వచ్చి వారి నాటకాల్లో పాల్గొనేవారు. 'నీల్‌దర్పణ్' నాటకం ద్వారా ఖ్యాతిగాంచిన దీనబంధు మిత్రా కూడా కొన్ని నాటక ప్రదర్శనల్లో పాల్గొనేవాడు. మొత్తానికి తమ గ్రామంలోని ప్రజలందరినీ వీలైనంత మేరకు అన్ని రంగాలలోనూ ఆరితేరేటట్లు చేయడమే ఘోష్ సోదరుల వ్రతంలా కనబడుతుంది. అన్యాయాలు తొలగించి కోర్కెలు సాధించుకోవడానికి వ్యవస్థీకృతమైన ఐక్య సంఘటన ఒక్కటే మార్గమని నీల్ విప్లవం గుణపాఠాలు ద్వారా తేటతెల్లమైంది.

మోతీలాల్ వివాహం 1869లో జరిగింది. ఆ గ్రామంలో ఘోష్ సోదరుల కార్యకలాపాలు చూసి ఓర్వలేక ప్రతిఘటించి నెగ్గలేక సతమతమవుతున్న ఛాందసవర్గం వారు మోతీలాల్ వివాహ తరుణంలో వెంటనే రంగంలోకి దిగారు. నాదియా జిల్లా 'కుమారఖలి' కి చెందినది వధువు. ఢాకాలోని ఒక జిల్లా కోర్టులో ఆమె తండ్రి అధికారి. ఘోష్ సోదరులు బ్రహ్మ సమాజంలో సభ్యులుగా చేరకపోయినప్పటికీ సమాజంతో వారికి గల సంబంధాలు పైకి తెలిసినవే. ఘోష్ సోదరులు పేరు ప్రతిష్ఠలు పెరగడాన్ని చూసి సహించలేకపోయిన ఛాందసవర్గం వారు ఆ తరుణంలో ఒక కట్టుకథ ప్రచారం చేశారు. ఘోష్ సోదరులు క్రైస్తవమతం పుచ్చుకున్నారనీ, అందువల్ల గొడ్డుమాంసం తింటున్నారనీ ప్రచారంచేస్తూ, వారి ఇంటి సమీపంలో దొరికిన ఎద్దు కళేబరం అవశేషాలు పట్టుకొచ్చి అందరికీ చూపారు. కుమార్ ఖలీలో పెళ్లికూతురు ఇంటికి ఈ వర్తమానం చేరేశాడు. ఈ ఎద్దు కథ విని పెళ్లికూతురి తరఫువారు చాలా అయోమయంలో పడినా, ఈ కథలోని నిజానిజాలను హేతుబద్ధంగా ఆలోచించగా అనుమానించారు. గ్రామాలలో రాజకీయాలు ఎంత దూరం వెడతాయో వారికి అనుభవైక వేద్యాలు కనుక అలా అనుమానించి

పెళ్లికూతురి పెద్దన్నగారిని (తదనంతరం ఆయన జిల్లా జడ్జి అయ్యారు) నిజానిజాలు విచారించి రమ్మని పంపారు. ఈ ఎద్దు కథంతా కల్పితమని ఆయన తేల్చిన తరువాత ఇరు వర్గాలు బరువు దిగిపోయినట్టయి ఆనందాతిరేకల్లో మునిగి ఉండగా తుదకు వివాహం అయ్యింది. మోతీలాల్ భార్య - ఆయనకు తగిన సహధర్మ చారిణి. వారి ఏకైక సంతానం (కుమార్తె) వారికి 1876లో కలిగింది. ఆమె పేరు సజలనయన.

# 3. వలస

పత్రిక ప్రారంభమైన మూడేళ్లలోనే జనంపై తన ముద్ర నిలుపుకుంది. అమృత బజార్ వార పత్రికకు 'ఇతర పత్రికలకంటె విస్తృతమైన పాఠకలోకం ఉండడమే కాదు; (1872లో ప్రచురితమైన బెంగాల్ అడ్మినిస్ట్రేషన్ రిపోర్టునుంచి) ఆ పత్రికలో అచ్చయ్యే వ్యాసాల భాష శషబిషలు లేకుండా సూటిగా ఘాటుగా ఉంటూ ఒక పక్క కౌలుదార్లు మరొక పక్క భూస్వాముల సమస్యలని చాలా లోతుగా చర్చించేందుకు పదునైన ఉపకరణగా ఉండేది. ప్రజలలో ఈ పత్రిక పలుకుబడి ఎంతగా ఇనుమడించిందంటే సాధికారికమైన సమాచారాన్ని పత్రిక అందించడానికీ, అవసరం వచ్చినపుడు ఆర్థిక సహాయం చేయడానికి ఈ పత్రిక త్వరలోనే సమర్థులైన మిత్రులను సంపాదించింది ప్రభుత్వం ఈ పత్రికను ఒక ప్రక్క అసంతృప్తితోనే మొత్తానికి పట్టించుకోవడం ప్రారంభించింది. "పత్రికకు" మునుపటి ఇబ్బందులు కొంచెం సడలాయి

1871 వర్షాకాలంలో మొత్తం బెంగాల్ అంతటా మలేరియా అంటువ్యాధి వ్యాపించింది. బెంగాల్ చరిత్రలో ఈ అంటువ్యాధి ప్రబలడం అదే ప్రథమం ముఖ్యంగా ఈ వ్యాధి జెస్సోర్ జిల్లాలో ఎక్కువ ప్రభావం చూపింది అమృతబజార్ గ్రామంలో ఇంచుమించు ప్రతి ఇంటికీ ఈ వ్యాధి సోకింది ఆ రోజుల్లో దీనికి నిర్దుష్టమైన చికిత్స ఏదీ లేదు - ఎందుకంటె కర్పూరం అప్పట్లో మార్కెట్‌లో లేని వస్తువు -ఒకసారి ఈ వ్యాధి సోకినవారు వేశవాళీ మందులతో ఉపశమనం పొందినా దోమలదాడితో మళ్లీ మంచం పట్టేవారు. ఈ వ్యాధి పట్టిపీడించగా అనేకమంది మరణించడం, చాలామంది కృశించిపోయి కాయకష్టానికీ, పనిపాటలకీ పనికిరానివారుగా తయారుకావడం సంభవించింది. గోరుచుట్టుపై రోకటిపోటులా బెంగాల్‌లో తీవ్ర వరదలు సంభవించాయి. ఈ వరదల ఫలితంగా పంటలు నాశనం కావడం, లక్షలాది పాడి పశువులు నశించడంతో పాటు నీరు నిలవ పేరుకుపోయి

మలేరియా అంటువ్యాధి మరింత భీకర రూపం దాల్చింది. అందువలన అనివార్యంగా పత్రిక కూడ కష్టనష్టాలకు గురి అయింది. పత్రిక కార్మికులు చాలామంది మలేరియా వ్యాధి పీడితులై ప్రచురణ కుంటుపడింది. వర్షాకాలంలో వరదలు మళ్లీ సంభవించడంతో పరిస్థితి మరింత దిగజారింది.

దానితో ఘోష్ సోదరులు అయిష్టంగానే ఒక తుది నిర్ణయం తీసుకున్నారు పత్రికను కలకత్తాకు తరలించడం మినహా దారిలేదని వారు నిర్ణయానికి వచ్చారు. అయితే చేతిలో చిల్లిగవ్వలేని పరిస్థితి వాళ్లకు మళ్లీ ఎదురైంది బకాయిలు తీర్చడానికి, అత్యవసర ఖర్చులకి ప్రెస్‌ని అమ్మివేయాలని నిర్ణయానికి వచ్చారు. స్థానిక వడ్డీ వ్యాపారి దగ్గర వంద రూపాయలు అప్పు చేశారు మోతీలాల్ తన జీతంలోంచి దాస్తు రాగా పోగైన రెండు వందల రూపాయలు ఈ అప్పు చేసిన 100 రూపాయలూ కలిసి మొత్తం 300 రూ॥లతో పెఘోష్ సోదరులు 30మంది కుటుంబ సభ్యులను వెంట తీసుకుని కలకత్తాలో అడుగుపెట్టారు అక్కడి వాళ్లు అనామకులు, అక్టోబర్ నెలాఖరులో వాళ్లు యావన్మంది బజార్ క్వార్టరులో ఒక గది అద్దెకు తీసుకున్నారు. పత్రికను తిరిగి ప్రచురించే సంకల్పంతో ప్రెస్‌కానే ప్రయత్నాలు ప్రారంభించారు అమ్మకానికి ఓ ప్రెస్ బేరం తగిలింది. కాని దాని ఖరీదు 600 రూ॥లు ఘోష్ సోదరుల దగ్గర వున్నది అంతా కలిపి 300 రూపాయలే. కలకత్తాలో అత్యంత ధనవంతులైన భూస్వాములలో ఒకరైన రాజా దిగంబర్ మిత్రా ఋణం ఇవ్వ మూపగా శిశిరకుమార్ తిరస్కరించారు అదృష్టవశాత్తు మరో భూస్వామి ఆ రాజా నుంచి 60 వేల రూపాయల ఋణాన్ని పొందడంతో కమీషన్ ఏజంటుగా శిశిరకుమార్ వ్యవహరించి 800 రూపాయల కమీషన్ పొందారు.

చేతి యంత్రాలతో పనిచేసే ఈ ప్రెస్‌ను కొనడం, కలకత్తానుంచి ఆనంద బజార్ పత్రిక తొలి సంచిక 1871 సెప్టెంబర్ 21న ప్రచురించడం సాధ్యమైంది. ఈ సంచిక సంపాదకీయ వ్యాఖ్యలలో ఇతర విషయాలతో బాటు పత్రిక సాధకబాధకాలు కూడ ముచ్చటించారు.

"పాఠకులకు మాపై గల విశ్వాసం మాకు తెలుసు. గతంలో పత్రిక విషయంలో మేము ఎన్నో ఇబ్బందులకు గురై అమృతబజార్ పత్రికకు చాలా ధనం ఖర్చు చేసినా, కాలక్రమేణా అది లాభదాయకంగానే మారి పత్రిక

నిలదొక్కుకుంది. లాభదాయకమైన సంస్థని ఏ కారణం చేతనూ ఎవరూ వదల్చుకోరు. ఓ గ్రామంనుంచి ఓ మహానగరానికి పత్రికను తరలించడం బట్టి పత్రిక సంపాదకీయ ధోరణిలో కూడ మార్పు ఉంటుందని ఎవ్వరైనా భావించవచ్చు. కాని అది నిజం కాదు. పత్రిక మునుపు ఎవరు నడిపారో వారి నిర్వహణలోనే ఉందనీ, ఈషణ్మాత్రం కూడా ముప్పు వుండదనీ మేము చెప్పదలిచాం. అయితే మాకు కొన్ని ఇబ్బందులున్నాయి. ముఖ్యంగా మా ఖర్చులు వందరెట్లు పెరిగాయి. ప్రజలు మా కష్టాల్లో ఏ కొంచెం పాలుపంచుకున్నా, కలకత్తా పౌరులు తమ దయాపూరిత హస్తాన్ని ఏ కొంచెం అందించినా చాలు. నిజానికి అది లభించిననాడే మా పత్రిక నిలదొక్కుకుంటుంది లేదా అమృతబజార్ పత్రిక చీకట్లో కలిసిపోతుంది.

కలకత్తాలోని జర్నలిస్టు ప్రపంచపు రద్దీలోకి అమృతబజార్ చాలా ప్రశాంతంగా, ఆడంబర రహితంగా ప్రవేశించింది. 1874 వరకూ ఘోష్ సోదరులు బౌబజార్‌లోని తమ గృహం నుంచి పత్రికను ఎప్పటివలెనే తాము శ్రమిస్తూ వెలువరించారు. 1874లో ఉత్తర కలకత్తాలోని - బజార్ క్వార్టరులో వారు సువిశాలమైన పెద్ద ప్రహరీగల పురాతన భవంతిని అద్దెకు తీసుకున్నారు. భారతీయ జర్నలిజం చరిత్రలో ప్రసిద్ధమైన ఈ గృహం కాశిం బజార్ మహారాజా వారిది. వారు నెలకు 40 రూపాయలకు దీనిని ఘోష్ సోదరులకు అద్దెకిచ్చారు. 50 ఏళ్ళపాటు ఇది అమృత బజార్ పత్రిక కార్యాలయంగా, ఘోష్ సోదరుల నివాసంగా ఉంది. అదే వీధిలో తదనంతరం ఘోష్ సోదరులు తమ స్వంత భవనం కట్టుకున్నా ఆనందచటర్జీ లెన్‌లో నెం.2 గృహం అద్దెకు ఇంకా వారి అధీనంలోనే ఉండేది

జాతీయోద్యమ పోరాట నిపుణులను సంప్రదించేందుకు దేశ విదేశాల నుంచి గొప్ప గొప్ప వ్యక్తులు ఈ భవంతికి వచ్చేవారు. ప్రఖ్యాత బెంగాలీ కవి నబీన్ చంద్ర సేన్ ఈ భవనం గురించి ప్రస్తావిస్తూ "అసలీ గృహం శతాబ్ద కాలంలో మరమ్మత్తులు ఎరగదు" అని వ్రాశారు. స్వీయచరిత్ర వ్రాసుకుంటూ ఆయన ఈ భవనం గురించి విపులమైన వర్ణన చేశారు. (బెంగాలీ నుంచి పరమానందదత్తు అనువదించి తన "మెమోరీస్ ఆఫ్ మోతీలాల్ ఘోష్" గ్రంథంలో ఈ వర్ణన పొందుపరిచాడు.) ఆ వాక్యాలు చాలా గమ్మత్తుగా ఇలా సాగేయి.

"ఆ భవనం క్రింది అంతస్తు, మొదటి అంతస్తు బైట గదుల నిండా ప్రింటింగ్

ప్రెస్‌కు సంబంధించిన రకరకాల వస్తువులూ, గుర్తు తెలియని సామానులూ చెల్లాచెదురుగా గుట్టలుగాపడి వున్నాయి. ఆ మొత్తం ప్రదేశము అంతా దుర్వాసన కొడుతూ, దుమ్ము కొట్టుకు పోయాయి. చాలా అపరిశుభ్రంగా ఉంది. పైకిపోయే చెక్క మెట్ల దారి చాలా ఇరుకుగా ఉండడమే కాక చాలా చోట్ల విరిగిపోయింది, ఆ చెక్కమెట్లను గాని, గదులను గాని చాలా ఏళ్లుగా ఒక్కసారైనా చీపురుతో తుడిచిన దాఖలాలు లేవు. మొదటి అంతస్థు వరండాలో మట్టిగొట్టుకుపోయిన చిన్న టేబుల్ ఉంది. గదికి ఒక ప్రక్క విరిగిపోయిన ఒక కుర్చీపై మోకాళ్ళ మధ్య గడ్డాన్ని ఆనించి ఒక చిన్న మనిషి - బ్రిటీష్ పాలకుల గుండెల్లో రైళ్ళు పరిగెత్తించే అపారమైన సామర్థ్యంగల ఒక వ్యక్తి - కూర్చొని వున్నాడు. మోతీలాల్ ఘోష్ అనే ఆ వ్యక్తి ఒక మామూలు కాగితం సాదా పెన్నుతో రాజకీయ ఆయుధాలు విసురుతున్నాడు ఆయన మకిలిపట్టిన ఎర్రబోర్డరున్న సాదా ధోవతి, బొత్తములు లేని తెల్ల చొక్కా ధరించి వున్నాడు. ఆయన ముందు, టేబుల్‌కి అవతలి ప్రక్కన ఒక మామూలు బెంచి, మరో ప్రక్కన నల్లుల మయమైన మరో పాత కుర్చీ వున్నాయి. దాని ఒక చేయి విరిగిపోయివుంది బహుశా 'ప్లాసీ' యుద్ధంలో కాబోలు. ఆ టేబుల్‌కి ఇవతలి ప్రక్కన మకిలి పట్టిన గోడ, ఆ గోడకి అవతలి వైపున మరో పెద్ద గదీ, లేదా హాలూ వుంది. ఆ గదిలో సీలింగ్‌మీద ఆ మకిలి, సాలెగూళ్లు, గోడలపై వుమ్మి మరకలూ, ఇంకు మచ్చలూ, ఎన్నేళ్ల బట్టీ శుభ్రం కాకుండా అలా పడి వున్నాయో ఎవరు చెప్పగలరు? గది అంతా దర్రీ పరిచారు. దర్రీ మీద దుప్పట్లు ఒక మూల రెండు మూడు బోల్‌స్టర్‌లు (శరీరాన్ని ఆనించేందుకు గల గుండ్రని మెత్తలు) ఉన్నాయి. గది గోడల్లో లాగానేవీటిమీద కూడా రకరకాల మరకలు ఆ దుప్పట్లు బోల్‌స్టర్‌లు "మేము అసలు దోబీ ముఖం చూసి ఎరగం." అని ముక్త కంఠంతో ఘోషిస్తున్నట్లు కనిపించాయి ఆ దుప్పట్ల మీద, బోల్‌స్టర్‌ల మీద తమ పాదధూళి ముద్ర వేయని దేశప్రముఖుడు ఎవరూ లేరనడం అతిశయోక్తి కాదు! ఘోష్ సోదరుల బైటగది తీరు తెన్నులు ఆ విధంగా ఉంటే ఇక లోపలి గదుల్లో పరిస్థితి మరింత దయనీయంగా ఉన్నట్లు విన్నాం."

గ్రామం నుంచి కలకత్తా నగరానికి వలసవచ్చి ఆ కుటుంబం పూర్తిగా భిన్న లోకంలో అడుగుపెట్టింది. 10 లక్షల స్థాయికి చేరుకుంటున్న నగర జనాభాలో అనేక జాతుల వారున్నారు. 1901 జనాభా లెక్కల నివేదిక ప్రకారం కలకత్తాలో

10 లక్షల జనాభాలో బెంగాలీల మెజారిటీ చాలా స్వల్పంగా ఉంది. ఒకటి పాయింట్ మూడు శాతం (1.3%) అనగా నూటికి యిద్దరు కూడా లేని బ్రిటీష్ వారే రాజకీయ, వాణిజ్యాధికారాలు గుప్పిట్లో పెట్టుకున్నారు 1.6% వున్న యూరోపియన్లకే రైల్వేలూ, తంతి తపాలా ఇతర దేశంలోపలి కమ్యూనికేషన్ రంగాలలోని ద్వితీయ శ్రేణి ఉద్యోగాలన్నిటిపై గుత్తాధికారం ఉంది. వ్యాపార వాణిజ్యరంగాల్లో కొద్దిమంది అమెరికన్లు, యూదులు, గుజరాతీ హైందవులు, ముస్లిములు ఉండేవారు. పరిశ్రమలు, రవాణా కట్టడపు పనులకు అవసరమైన కార్మిక వర్గంలో అధికభాగం, బీహార్, తూర్పు యు.పి, ఒరిస్సా నుంచి వచ్చినవారే బెంగాలీలలో అత్యధిక భాగం కార్యాలయాల్లో గుమాస్తాలు ఉపాధ్యాయులూ, న్యాయవాదం, వైద్యం వంటి వృత్తులూ, చిన్న చిన్న వ్యాపారాలూ చేపట్టారు. ఆంగ్లభాషా పరిజ్ఞానం అనేది గౌరవప్రపత్తులు కలిగించే చిహ్నం అది కేవలం కలకత్తా నగరానికే పరిమితమై లేకపోయినా ఆంగ్ల విజ్ఞానానికి ఆ నగరం పట్టు కొమ్మలా ఉండేది. 1872 ప్రాంతంలో జిల్లా ముఖ్య పట్టణాలైన జెస్సోర్, ఢాకా, కృష్ణగర్, మిడ్నపూర్, మెమెన్‌సింగ్ రంగపూర్, పాట్నా, తదితర పట్టణాలలో జాతీయతత్వం జీర్ణించుకొంటున్న కీలక విద్యావంతుల వర్గం ఏర్పడింది. పత్రికా రంగంలో స్టేట్స్‌మన్, ఇండియన్ డైలీన్యూస్, ది ఇంగ్లీష్‌మాన్ వంటి దిన పత్రికలు బ్రిటీష్ వారి ప్రయోజనాలకు అనుగుణంగా ఉండేవి. ఆంగ్లంలో ప్రధాన వార్తా పత్రికలుగా ది హిందూ, పేట్రియాట్, ది ఇండియన్ మిర్రర్, ది బెంగాలీ పత్రికలు పేరు గడించాయి. బెంగాలీ పత్రికా రంగానికి సోమ్‌ప్రకాష్, సులభ సమాచార్ (వార పత్రిక) ద్విభాషా పత్రికయిన అమృతబజార్ పత్రిక ప్రాతినిధ్యం వహించేవి. కలకత్తా మంచి పత్రికను నడపడంలోని సౌలభ్యాలు కరువయ్యాయి.

ఈసమయంలో ఆదాయం పన్ను పెంచుతూ ప్రభుత్వం బిల్లు ప్రవేశపెట్టింది. ఈ బిల్లును నిరసించడంలో బ్రిటిష్ పత్రికలు, భారతీయ పత్రికలూ అన్నీ ఏకమయ్యాయి. అయితే అమృతబజార్ పత్రిక ఒక్కటే ఆ చర్యను సమర్థించింది. తత్ఫలితంగా సంపన్నవర్గంలో ఈ పత్రిక చందాదార్లనేకులు పత్రికను కొనడం మానేశారు. అయితే పత్రిక పాఠకులలో అత్యధిక వర్గం దిగువాదాయ వర్గాలవారు కావడం చేతను, ఆదాయం పన్ను హెచ్చింపు వారిని ప్రభావితం చేయక పోవటం వల్లనూ పత్రిక వారిని కూడగట్టుకొనడంలో కొంత విజయవంతమైంది.

రాజాదిగంబర మిత్ర వంటి కలకత్తాకు చెందిన ప్రముఖవ్యక్తులు కొందరు పత్రిక సర్క్యులేషన్ పెంచేసి కార్యక్రమానికి అండగా నిలిచారు. క్రొత్తగా చేరిన చందాదారుల్లో కలకత్తా హైకోర్టుకి చెందిన విఖ్యాత న్యాయమూర్తి ద్వారకానాథ్ మిత్రా కూడా ఒకరు. ఆయన శిశిరకుమార్‌తో ఒకానొక సందర్భంలో మాట్లాడుతూ "మీ పత్రిక నేను కొంటున్నాను మీ రచనల్లో అంతర్లీనంగా ఉన్న ఉగ్రవాదం వల్ల ఉత్తరోత్తరా ప్రజలు ప్రభావితులైతే దేశంలో అసంతృప్తి, అలజడి తత్వం పెరుగుతుందేమోనని, సందేహంగా ఉంది" అన్నారు ఘోష్ సోదరుల స్వభావానికి దర్పణం పట్టే జవాబు శిశిరకుమార్ ఇచ్చాడు. ప్రజలలో వారి స్థితిగతుల పట్ల వివేచన కలిగించి దేశభక్తిని వారిలో ప్రేరేపించడమే తమ పత్రిక లక్ష్యమని ఆయన నిర్ద్వంద్వంగా బదులిచ్చారు. "ప్రజలు ఇప్పుడు జీవన్మృతుల వలె ఉన్నారు వారిని అచేతనం నుంచి జడత్వం నుంచి విముక్తం చేయాలి అందుకు మనం వాడే భాష శంఖారావం వలె భాష పెట్టాలి " అన్నాడు శిశిరకుమార్. ఆ తదనంతర ఉదంతాలు రుజువు చేసినదేమిటంటే, ఇది ఒకానొక పత్రిక పంథా కాదు తరువాత శతాబ్దంలో స్వాతంత్ర్యోద్యమం ముప్పిరిగొన్న రోజుల్లో ఉద్భవించిన జాతీయవాద పత్రికారంగం యావత్తూ అనుసరించిన పంథా అది. జాతీయవాద పత్రికలకు వెనుతిరిగే ప్రశ్నలేని లక్ష్యశుద్ధి ఏర్పడింది. ఈ లక్ష్య సాధనకు నిబద్ధులై మొక్కవోని దీక్ష ప్రదర్శించడం ద్వారా మోతీలాల్ దీనిని వృద్ధిపరచాడు.

# 4. పత్రికమార్పుకి దోహదపడినపరిణామాలు

దాదాపు అంతా బ్రిటిషర్ల అదుపులోనే వారితోనే నిండి ఉండి బ్రిటిష్‌వారు తమకోసం భారతదేశాన్ని ఎడతెగని విధంగా దోచుకోవడానికి మార్గదర్శకంగా వ్యవహరిస్తున్నది. ఇండియన్ సివిల్ సర్వీసు దీని పట్ల భారతీయుల విమర్శలు ప్రభుత్వానికి గొంతులో పచ్చి వెలక్కాయలా పరిణమించాయి. ఇంగ్లీషు విద్య అభ్యసించిన పట్టణ ప్రజ బ్రిటిష్ పాలకులు కల్పించిన సౌకర్యాలకు కృతజ్ఞతగా ప్రభుత్వ విధానాలకు వత్తాసు పలుకుతుందని వారు ఆశించినదంతా వ్యర్థమైంది. పాలనా యంత్రాంగంలోనూ ప్రభుత్వ విధానాల రూపకల్పనలోనూ తమకు హెచ్చు భాగస్వామ్యం కల్పించాలన్న భారతీయుల డిమాండు వారికి కంటకప్రాయంగా మారింది ఈ డిమాండ్‌కి ఒప్పుకుంటే పాశ్చాత్య ప్రజాస్వామిక భావాలు, సంస్థలు భారతీయుల చేతుల్లో దుర్వినియోగమవుతాయని వారు తలపోశారు. దానితో అప్పుడు లెఫ్టినెంట్ గవర్నరు, నలుగురు యూరోపియన్ అధికారులు, నలుగురు యూరోపియన్ అనధికారులు, ఇద్దరు భారతీయ అధికారులు, ఇద్దరు భారతీయ అనధికారులతో కలిపి మొత్తం 13 మంది సభ్యులతో బెంగాల్ విధాన పరిషత్ ఏర్పడింది. కలకత్తా బెంగాల్ ప్రావిన్షియల్ గవర్నమెంటు కేంద్రస్థానమే కాక భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యానికి రాజధాని కావడం మూలాన సామ్రాజ్య విస్తరణ విధానాలు పత్రికలలో విమర్శల రూపంలో బట్టబయలు కారాదనీ, ప్రభుత్వ చర్యలు వైస్రాయికి తెలియకూడదని బ్రిటిష్ ప్రభుత్వం తహతహలాడడం ప్రారంభించింది.

భారతదేశంపై రష్యా కన్నువేసిందని అనుమానించి, రష్యా ప్రయత్నాలు వమ్ము చేయడం కోసం ఆఫ్ఘనిస్తాన్‌ను ఆక్రమించడానికి పథకాలు రూపొందించడంలో 1870 లో నియామకమైన వైస్రాయ్ లార్డ్ లిట్టన్ తలమునకలై ఉన్నాడు. "కాశ్మీర్ మహారాజాకి వైస్రాయ్ తగిన ఆయుధాలు సరఫరా చేశారు. చిత్రాల్‌లోకి

సైన్యాన్ని నడిపించవలసిందిగా మహారాజాను ప్రేరేపించాడు. కాశ్మీర్ అజేయమైన రాజ్యం. బ్రిటీష్ ఇండియా అధికపన్నుల భారం వలన రుజాగ్రస్తమై మూలుగుతోంది. శతాబ్దంలో కనీవినీ ఎరుగనంతగా లేవు దుర్భిక్షచ్ఛాయలు ఎల్లెడలా అలుముకున్నాయి. అయితే వైస్రాయ్ ఆర్థిక వ్యవస్థను పట్టించుకోవడానికి గానీ, పన్నుల భారం సడలించడానికిగానీ సిద్ధంగా లేరు. ఊహాజనితమైన ప్రమాదాన్ని తొలగించడానికి ఆయన అపారమైన ఖర్చుకి వెనుకాడలేదు. అది ఊహాజనితమైన ప్రమాదమే అయినా అటువంటి భయాలకు ఆయన చర్యలే కారణం.("ఎకనామిక్ హిస్టరీ ఆఫ్ ఇండియా, వాల్యూమ్-2, దత్ రచన.") రక్తం త్రాగే ప్రభుత్వ విధానమును పత్రికలు విమర్శించరాదు; 1877లో మద్రాస్ రాష్ట్రాన్ని పిల్పి పిప్పి చేసిన దారుణ కరువు కాటకం వలన అపార కష్టనష్టాలకు గురైన ప్రజలపట్ల ప్రభుత్వ విరుద్ధవైఖరిని వేలెత్తి చూపరాదు అదీ నాటి పాలకుల మనస్థితి. నాటి బెంగాల్ లెఫ్టినెంట్ గవర్నర్ సర్ ఆష్లే ఎడెన్ చివరికి లంచం ఎరచూపి, బెదిరించి, ఆంగ్లభాషా పత్రికలను లొంగదీసుకొని వాటి నోరు నొక్కడానికి సంకల్పించారు. హిందూ పేట్రియాట్‌కు చెందిన సౌమ్యుడు. బలహీనుడు, క్రిస్టోదాస్‌పాల్‌ను ఆ రకంగా లోబరచుకోగలిగిన తరువాత సర్ ఎడెన్ ఎకాఎకి శిశిర్‌కుమార్‌కు కబురు పెట్టారు. తన సలహా పాటిస్తే ప్రభుత్వంలో ప్రాతినిధ్యం కల్పిస్తానని ఎరచూపాడు. ఈ ఉదంతంపై మోతీలాల్ వ్యాఖ్యానిస్తూ ఇలా అన్నారు.

గౌరవనీయులు చేసిన ప్రతిపాదన పాఠం స్థూలంగా ఇది -

"నేను, నీవు (శిశిర్‌కుమార్), క్రిస్టోదాస్ మన ముగ్గురం బెంగాలీ రాష్ట్రాన్ని పరిపాలిద్దాం. నా సలహాల ప్రకారం తన పత్రిక నడపడానికి క్రిస్టోదాస్ ఒప్పుకొన్నాడు. నువ్వు కూడా అదే పని చేయాలి. హిందూ పేట్రియట్‌కు ఇస్తున్నట్టుగానే మీ పత్రికకు కూడా ముట్ట చెబుతాను. ప్రభుత్వాన్ని విమర్శిస్తూ, నువ్వు ఎప్పుడు ఏది రాసినా వ్రాతప్రతిని ప్రచురణకు ముందు నాకు పంపు. ప్రతిఫలంగా నీ పత్రిక హెచ్చు ప్రతులని ప్రభుత్వం కొంటుంది. రాష్ట్ర పరిపాలనా నిర్వహణలో క్రిస్టోదాస్‌ను సంప్రదిస్తున్నట్టుగా నిన్ను కూడా సంప్రదిస్తాను."

ఆ తరుణంలో శిశిర్‌కుమార్ చాలా పేద వ్యక్తి. కలకత్తా సమాజంలో ఆయన స్థితి ఏమంత పెద్దది కాదు. ఎకాఎకి రాష్ట్రపాలకుని నుంచి తిన్నగా చేయూతకు అవకాశం వచ్చింది. కానీ ...... . శిశిర్‌కుమార్ ఆలోచనలు మరోలా ఉన్నాయి.

ఆయన నిర్ణయం ఇంకోలా ఉంది. గౌరవనీయుడి 'ఔదార్యానికి' శిశిర్‌కుమార్ కృతజ్ఞతలు తెలుపుతూ చాలా ప్రశాంతంగా, "అయ్యా! ఈభూమి మీద కనీసం ఒక్కడైనా నిజాయితీగల జర్నలిస్టు ఉండడం చాలా అవసరం...." అన్నాడు.... అంతే - సర్ యాష్లి ఎడెన్ ఆగ్రహోదగ్రుడై పోయాడు.

మాటలతో గాయపరిచే వ్యంగ్యం గుప్పిస్తూ బాబూ శిశిర్‌కుమార్‌తో సర్‌ఎడెన్ "నువ్వు ఎవరితో మాట్లాడుతున్నావో మరిచిపోయావు. బెంగాల్ రాష్ట్రంలో అత్యున్నత అధికారిగా ఏ రోజైనా నిన్ను ఆరు మాసాలు జెయిల్లో పెట్టకపోను. నీ పత్రికలో విమర్శనాత్మకమైన నిందా పూర్వకమైన రాతలు రాస్తున్నందుకు ఆరు నెలల్లో నిన్ను మూటాముల్లెతో సహా తిరిగి జెస్సోర్‌కు తరిమేస్తాను" అని బెదిరించాడు. ఆ బెదిరింపు వట్టి మాటకాదు. వెర్నాకులర్ ప్రెస్ ఏక్ట్ పేరిట ప్రాంతీయ భాషా పత్రికల చట్టం (1878లో 9వ చట్టం) వచ్చింది. భారతీయ భాషలలో ఏ పత్రిక ముద్రాపకుణ్ణి, ప్రచురణకర్తనైనా పిలిపించి ప్రభుత్వంపై అసంతృప్తిని తిరుగుబాటు తత్వాన్ని రెచ్చగొట్టే ఎటువంటి పదాలు, చిహ్నాలు, ఫొటోలు, చిత్రాలు వంటివి ప్రచురించరాదని వారి వద్ద లిఖిత పూర్వకమైన బాండ్లు తీసుకొనే అధికారాన్ని జిల్లా మేజిస్ట్రేటు, లేదా పోలీసు కమీషనర్‌కు ఈ చట్టం కల్పించింది. అంతేకాక బ్రిటీష్ ఇండియాలోని వివిధ జాతులు, వర్ణాలు, కులాలు, మతాలు, తెగల ప్రజల మధ్య పొరపొచ్చాలు, వైషమ్యాలు, శత్రుత్వం రెచ్చగొట్టే రాతలు రాయరాదనీ, అందుకు బాండుతో పాటు పత్రిక ప్రచురణకర్తల నుంచి ప్రభుత్వం తోచినంత సొమ్మును పూచీకత్తుగా తీసుకోవాలనీ చట్టం నిర్దేశించింది. చట్ట నిబంధనలు ఉల్లంఘించిన పక్షంలో పూచీకత్తు డబ్బును ప్రభుత్వం స్వాధీనపరుచుకోవచ్చు. ఈ చర్యను నిరసిస్తూ పత్రిక యజమానులు కోర్టుకు పోయే సావకాశం లేదు. 'అభ్యంతరకరమైన రాతలు'గా వర్గీకరించిన వాటిలో ఈ క్రింది అంశాలు కూడా ఉన్నాయి.

"తిరుగుబాటు తత్వాన్ని ప్రేరేపించే ప్రకటనలు ప్రచురించడం, ప్రభుత్వంపై దొంగతనం, దోపిడీ, అణచివేత, నిజాయితీ రాహిత్యం, విశ్వాస రాహిత్యం, అన్యాయాలు, పాక్షికదృష్టి వంటి నేరాలు ఆపాదిస్తూ తులనాత్మకమైన అసత్య ప్రచారాలతో కూడిన విమర్శలతో దాడిచేయడం నిషిద్ధం-

1 ప్రభుత్వాధికారులపై తిరుగుబాటును; ఆగ్రహాన్ని రేకెత్తించే విధమైన రాతలు

నిషిద్ధం.

న్యాయసంబంధమైన వ్యవహారాలలో ప్రభుత్వం కోర్టు ధిక్కారానికి పాల్పడినట్లు రాయడం, ప్రభుత్వానికి అపవిత్రత, అనర్హత ఆపాదించడం నిషిద్ధం-

యూరోపియన్ల వ్యక్తిత్వాన్ని ఎద్దేవాచేస్తూ కపటత్వాన్ని, మోసాన్ని, దుర్మార్గాన్ని, నిర్దయనీ వారికి ఆపాదిస్తూ రాయడం తగదు.

క్రైస్తవుల మీద, క్రైస్తవ ప్రభుత్వాల మీద, విమర్శనాత్మకమైన ప్రకటనల ప్రచురణ నిషిద్ధం. జాతి మత వైషమ్యాలు రెచ్చగొట్టే కుయుక్తితో కూడిన ధోరణులు నిషిద్ధం.

ఆయా రచనల రచయితలు చేసే సూచనల్లో, ఎగతాళితో కూడిన వ్యాఖ్యలతో సమ్యక్‌దృష్టి కొరవడితే వాటిని కూడా తిరుగుబాటును రెచ్చగొట్టే ప్రకటనలుగానే పరిగణించడం, జరుగుతుంది-"

నిజానికి ఈ చట్టం అమృతబజార్ పత్రికకే గురిపెట్టినదవడంలో సందేహం లేదు. విధాన పరిషత్‌లో చేసిన ప్రసంగంలో సర్ యాష్లే దాపరికం లేకుండా ఈ విషయం బైటపెట్టనే పెట్టాడు. "ప్రభుత్వ అభ్యంతరం ఏమిటంటే - కొన్ని ప్రాంతీయ భాషా పత్రికలు అవిధేయతతో - తిరుగుబాటు ధోరణిలో రాతలు రాస్తున్నాయి. అజ్ఞానులైన ప్రజల హృదయాల్లో బ్రిటిష్ పాలన పట్ల అసంతృప్తి జ్వాలలు రేకెత్తించడానికి అవి ప్రయత్నిస్తున్నాయి. .. స్వాతంత్ర్యం, స్వేచ్ఛ పేరుతో పత్రికలు ఏ దశకు చేరుకొన్నాయంటే శాసనపరంగా ప్రభుత్వ జోక్యం అవసరపడింది......"

అయితే శిశిర్‌కుమార్, ఆయన సోదరులు యాష్లే బిగించిన చట్రంలో ఇమిడేంత తెలివిహీనులు కారు "ఈ చట్టం అమలులోకి రాకపూర్వమే వారు తమ పత్రికను పూర్తిగా ఆంగ్లంలో ప్రచురించడం మొదలు పెట్టడం ద్వారా చట్టం పరిధిలో లేకుండా తప్పించుకొని లెఫ్టినెంట్ గవర్నరుతో ఢీ అంటే ఢీ అన్నారు. మోతీలాల్ ఏమన్నాడంటే "పూర్తిగా ఇంగ్లీషులో ప్రచురించే పత్రిక లార్డ్ ఎట్టన్ గారి వెర్నాక్యూర్ ప్రెస్ యాక్టుకు అతీతమైనది.

సర్ యాష్లే నోట్లో నువ్వుగింజి నానని వ్యక్తి. చట్టం పరిధినుంచి పత్రిక తప్పించుకొనడం పట్ల ఆయన తన అసంతృప్తిని తన సన్నిహిత బెంగాలీ మిత్రుల దగ్గర వెళ్ళగక్కుకున్నాడు అమృతబజార్ పత్రికను ఆంగ్లంలోకి మార్చడం

మరొక్క వారం రోజులు ఆలస్యం అయితే ఆ పత్రిక నుంచి చాలా పెద్ద మొత్తంలో పూచీకత్తు రాబట్టి దానిని చావుదెబ్బ తీసేవాణ్ణి." అని ఆయన మిత్రులతో పిచ్చాపాటీలో అన్నారట.

ఆ విధంగా చట్టం వెలువడిన తదుపరి సంచిక (1878, మార్చి 21) పూర్తి ఆంగ్ల పత్రికగా దర్శనమిచ్చింది. ఆ సంచికలోని సంపాదకీయ వ్యాఖ్యలో పై చట్టాన్ని తిన్నగా ప్రస్తావించలేదు. అవ్యాపదేశంగా ప్రస్తావిస్తూ, ఇలా పేర్కొన్నారు :

మాతృభాషా రచనలకు పత్రికలో స్వస్తి చెప్పవలసి వచ్చినందులకు చాలా బాధపడుతున్నాము. మా మిత్రులు, పోషకుల బలవంతంపై ,వారి అభిప్రాయాలకు మేమెప్పుడూ విలువనిస్తాము కనుక, ఈ మార్పును ప్రవేశపెట్టాం. ఈ మార్పు మన దేశానికి ప్రయోజనకరమా, కాదా అన్నది ఆ దేముడికే తెలియాలి, అయితే మేమొక్కటి మాత్రం చెప్పగలం ... స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు గల పూర్తి ఆంగ్ల పత్రిక ప్రచురణ ఆవశ్యకత ఈనాడు దేశానికి ఎంతైనా ఉంది. మేము అనేక అగ్నిపరీక్షల నుంచి నెగ్గుకువచ్చాము. అన్నివేళలా మాకు లభించిన సానుభూతిని గుర్తుకు తెచ్చుకొన్నపుడల్లా కృతజ్ఞతా భావంతో మా హృదయాలు నిండిపోతాయి ప్రజల మద్దతుకు నిజంగా మేము అర్హులమే అయితే సాక్షాత్తు ఆ దైవమే ప్రజలనుంచి మాకు అది పుష్కలంగా లభించేలా చేయగలదన్న ఆశ మాకు వుంది."

కపటమైన ఈ చట్టం పట్ల ప్రజలు చాలా తీవ్ర ఆగ్రహావేశాలు ప్రదర్శించారు ఇక్కడ ఓ నిజం చెప్పాలి. 1875లో శిశిర్‌కుమార్, మోతీలాల్ ప్రజలను కూడగట్టేందుకు ఇండియన్ లీగ్‌ను స్థాపించారు. మరుసటి సంవత్సరం అంటే 1876లో సురేంద్రనాథ్ బెనర్జీ ఇండియన్ అసోసియేషన్ స్థాపించిన తరువాత ఈ లీగ్ రద్దు అయింది సురేంద్రనాథ్ 1869లో ఇంగ్లాండులో సివిల్ సర్వీసు పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు అయితే వయస్సు తప్పుగా ప్రకటించాడన్న ఆరోపణపై ఆయన నియామకాన్ని ఉపసంహరించారు. ఈ ఆరోపణను ఖండించి ఈ కేసులో పోరాడి ఆయన విజయం సాధించాడు. చివరికి 1871లో ఆయనను సిల్హెట్‌లో అసిస్టెంట్ డిస్ట్రిక్టు మేజిస్ట్రేటుగా నియమించారు. అక్కడ ఆయన తన యూరోపియన్ సహఉద్యోగులతో సమాన స్థాయి పొందాడు. దీనితో ఆ యూరోపియన్లకు కన్నుకుట్టి తగిన ఆధారాలు లేకపోయినా ఏదో ఆరోపణమీద

ఆయనను సర్వీసు నుంచి తొలగించేలా చేశారు. ఇది పెద్ద వివాదంగా మారింది సురేంద్రనాథ్ భారతీయుల సానుభూతే ఆయుధంగా తన పునర్నియామకానికై పోరాటం సాగించారు ఈ కేసుపై ఆయన లండన్‌లో ఇండియా ఆఫీసుకు అప్పీలు చేసుకున్నాడు. అయితే కేసులో ఓడిపోవడమే కాక బారిస్టర్ - అట్‌లాగా ప్రాక్టీసు చేసే హక్కును కూడా ఆయన కోల్పోయారు.

ఆయన జీవితంలో ఇది పెద్ద మలుపు అయ్యింది "ఏ నేషన్ ఇన్ మేకింగ్" అనే తన స్వీయచరిత్ర గ్రంథంలో ఆయన ఏమన్నారంటే - "నేను ఒక భారతీయుణ్ణి కాబట్టి, అవ్యవస్థీకృతంగా, జనాభిప్రాయం మరుగున పడిపోయే స్థితిలో మగ్గిపడివున్న జాతికి చెందినవాణ్ణి కాబట్టి, ప్రభుత్వంతో సలహా సంప్రదింపుల్లో వాటాలేని ప్రజాసమూహానికి చెందిన వాణ్ణి కాబట్టి, కష్టనష్టాలకు గురి అయ్యానని, ఉడుకుడుకు యువరక్తం ప్రవహిస్తున్న నేను చాలా ఆవేశపూరితంగా, ఆగ్రహపూరితంగా అనుకునే వాడిని, మనం అంతా మనజన్మ భూమిలో కేవలం పొలాలలో మట్టి పిసికేవాళ్ళుగా, కట్టెలు కొట్టే వాళ్లుగా, ఏతమెత్తే వారిగానే బతుకుతున్నామని. . మన తప్పిదాలని తొలగించుకొని మన వ్యక్తిగత హక్కుల్నీ, జాతి హక్కుల్నీ పరిరక్షించుకొనే గమ్యం వైపు మన ప్రజలు సాగేలా వారికి సహాయపడాలని నాలో నేను వితర్కించుకొని ఒక నిర్ణయానికి వచ్చాను."

వజ్రసంకల్పం, ఆంగ్లంలో అనర్గళ వాక్చాతుర్యం, యువకుల్ని తన ప్రబోధాలతో గమ్యం వైపు మళ్లించగల శక్తి ఆయన ప్రత్యేకతలు. భారతదేశానికి మరలివచ్చిన వెనువెంటనే ఆయన ఇండియన్ లీగ్‌లో చేరారు; ఆయన వలెనే బ్రహ్మసమాజ సభ్యుడైన ఆనందమోహనబోస్ నాయకత్వాన గల స్టూడెంట్స్ అసోసియేషన్‌లో చేరారు. మెట్రోపాలిటన్ కళాశాలలో ఇంగ్లీషు ప్రొఫెసర్‌గా ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ఆయనను నియమించారు. అందువల్ల నమ్మశక్యం కాని స్వల్ప వ్యవధిలో ఇండియన్ అసోసియేషన్‌ను స్థాపించగల అవకాశం ఆయనకు లభించింది. ప్రజాబాహుళ్యానికి సంబంధించిన వ్యవహారాలలో స్వీయభావ ప్రకటన హక్కుకై నాటి విద్యావంతులైన మధ్యతరగతివర్గం మధన పడసాగింది. వారి డిమాండ్ తీర్చడంలో నాటి భూస్వాములతో నిండిన బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్ విఫలమైంది. సురేంద్రనాథ్ బెనర్జీ కూడా 'ది బెంగాలీ' అను సొంత వార్తా పత్రికను తన జాతీయవాద ప్రచారానికి సాధనంగా మలచుకున్నాడు.

అనన్య సామాన్యమైన నిర్వహణ సామర్థ్యం, అనర్గళ వాక్పటిమ, విషయజ్ఞత మూలకంగా సురేంద్రనాథ్ బెనర్జీ అనతికాలంలోనే దేశంలోని అగ్రశ్రేణి నాయకులలో ఒకరు కాగలిగారు. ఇండియన్ అసోసియేషన్‌ది నిజమైన జాతీయ దృక్పథం. అసోసియేషన్‌లోని అధ్యక్షుడు కృష్ణమోహన్ బెనర్జీ భారతీయ క్రైస్తవ కార్యకర్తకాగా కార్యదర్శి శ్రీ ఆనందమోహన్ బోస్ బ్రహ్మసమాజ సభ్యుడు. ఈ సంఘం విస్తృతలక్ష్యాలలో మొదటిది – దేశంలో నిర్దిష్టమైన ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడం. ఉమ్మడి రాజకీయ ప్రయోజనాలు, ఆశయాల ప్రాతిపదికగా భిన్న జాతులు, మతస్థులైన ప్రజలందరనూ ఒక త్రాటిపై నిలపడం, హిందువులు మహమ్మదీయుల మధ్య సోదర భావాన్ని, మైత్రిని పెంపొందించడం, జనబాహుళ్యాన్ని నాటి ప్రజోద్యమాలలో పాల్గొనేటట్టు చేయడం, ఆ వరుస క్రమంలో ఈ సంస్థ ప్రధాన లక్ష్యాలు. వెర్నాకులర్ ప్రెస్ యాక్టుకు నిరసనగా ఈ సంఘం చాలా బలీయమైన ఆందోళన నిర్వహించింది. తన సాధికారిక ప్రసంగాల ద్వారా సురేంద్రనాథ్ బెనర్జీ ప్రజల హృదయాలు చూరగొన్నాడు.

సురేంద్రనాథ్‌కు బ్రిటిష్ లిబరల్ రాజకీయ సిద్ధాంతాల పట్ల మక్కువ ఏర్పడింది. సామ్యవాద ప్రభుత్వం నుంచి రాయితీలు, సౌకర్యాలు రాబట్టడానికి రాజ్యాంగ బద్ధమైన ఆందోళన మార్గాన్ని అనుకూల ప్రజాభిప్రాయం సేకరించి కోర్కెలు నివేదించే పద్ధతిని ఆయన నమ్మాడు. నియమబద్ధమైన పురోగమనం అవసరమని ఆయన విశ్వసించాడు. భారతీయులతో సమానత్వానికై బ్రిటిష్ లిబరల్స్ చేస్తున్న బోధనలు చిత్తశుద్ధితో కూడుకున్నవేనని ఆయన విశ్వసించాడు భారతీయులతో సమానత్వానికై బ్రిటిష్ లిబరల్స్ చేస్తున్న బోధనలు చిత్తశుద్ధితో కూడుకొన్న వేనని ఆయన పూర్తిగా నమ్మారు. కానీ అమృతబజార్ సంపాదకులే బ్రిటీష్ పాలకులను సరిగా అర్థం చేసుకోగలిగారు; విదేశీ పాలకులు పరాయి భూమి ఆక్రమించుకొని తమ బ్రిటీష్ జాతీయుల కడుపులను నింపడానికి అలవాటు పడినపుడు వినతి పత్రాల ద్వారానూ; ఫిర్యాదుల ద్వారానూ దిగరాదనీ, వట్టి ప్రతిఘటన కార్యాచరణ ద్వారానే పాలన సాగించడం దుర్లభమై తొలగిపోతారని వారు గ్రహించారు. ఎందుకంటే లెఫ్టినెంట్ గవర్నర్ సర్ ఎ. మాకెనీ శషభిషలు లేకుండా చెప్పినట్లు "ఏ ప్రభుత్వమైనా ముఖ్యంగా ఏ విదేశీ ప్రభుత్వమైనా తన ప్రయోజనాలు రక్షించుకోవడమే ప్రధానం." అందుచేత ఏ ప్రభుత్వ చర్యలోనూ

కనీస నిజాయితీ ఉండదు. ప్రజలు తమ హక్కులను బలం ప్రదర్శించి చాటాలి ఘోష్ సోదరులు తమ యువ ప్రాయంలో చూసిన నీల్ విప్లవంలో పోరాట వరవడిని గ్రహించగలిగారు. సురేంద్రనాథ్‌కూ మోతీలాల్‌కు మధ్యగల ఈ మౌలిక సిద్ధాంతపరమైన భేదాభిప్రాయం (అప్పటికి శిశిర్‌కుమార్ ప్రజా జీవనరంగం నుంచి ఆధ్యాత్మిక చింతనలోకి నిష్క్రమించారు.) కాలక్రమేణా దేశంలో జాతీయ ఉద్యమం పెంపొందిన తరువాత స్పష్టమైంది.

బ్రిటీష్ జనరల్ ఎన్నికలలో 'తోరీ పార్టీ' ఓటమి వలన వైస్రాయిగా లార్డ్ విట్టన్ పదవీకాలం 1880 లో ముగిసింది. లార్డ్‌విట్టన్ స్థానే వైస్రాయిగా లార్డ్ రిప్పన్‌ను బ్రిటీష్ ప్రధాని గ్లాడ్‌స్టన్ నియమించారు లార్డ్‌రిప్పన్ ప్రారంభించిన మొట్టమొదటి చర్యలలో 'వెర్నాకులర్ ప్రెస్' చట్టాన్ని రద్దు చేయడం ఒకటి. 1881 డిసెంబరులో ఈ చట్టం రద్దయింది. సురేంద్రనాథ్ ప్రజలలో విశేష పలుకుబడి సాధించారు ఆయన సూచనపై సర్ యాష్లే ఎడెన్ నిష్క్రమణ తరుణంలో ఆయనకు పౌరుల వీడ్కోలు సన్మానం జరుగలేదు ఈలోగా ఘోష్ సోదరులు 1878లో 'ఆనందబజార్' పత్రిక అనే బెంగాలీ వార పత్రికను ప్రారంభించారు. ఇది ముఖ్యంగా మత ప్రాతిపదిక గల పత్రిక. 1922లో ఈ పత్రిక సురేష్ చంద్ర మజుందార్, ప్రఫుల్లకుమార్ సర్కార్ యాజమాన్యంలో జాతీయవాద దినపత్రికగా రూపాంతరం చెంది అనతికాలంలో విశేష ప్రాముఖ్యం పొందింది.

# 5. నమ్మినవారికి గుణపాఠం

లార్డ్ రిప్పన్ విషయజ్ఞుడు, గంభీర స్వభావుడు. మహారాణి సామ్రాజ్యంలోని భారతీయులు చల్లగా ఉండాలని ఆయన ఆకాంక్షించారు. జిల్లాలు, మున్సిపల్ పట్టణాల్లో స్థానిక స్వపరిపాలన ప్రవేశపెట్టినందువల్ల చరిత్రలో ఆయన పేరు నిలిచిపోయింది. స్థానిక స్వపరిపాలనా సంస్థను ఆదిలో పరిపాలన మెరుగుపరచే ఉద్దేశంతో కాక, రాజకీయ ప్రజావివేచనకు ఉపకరణంగా ప్రవేశపెట్టడం జరిగింది. మెజారిటీ సభ్యులకు ఎన్నికలు జరపడంద్వారా జిల్లా బోర్డులను ఏర్పరిచాడు. జిల్లా పరిపాలనా గతమైన అధికారాలు బోర్డు అధ్యక్షునివి. ఆ జిల్లాకు సంబంధించినంతవరకు బోర్డు చైర్మన్ ప్రభుత్వకార్య నిర్వాహక అధికారి. రోడ్లు, ప్రాథమిక, మాధ్యమిక విద్య, ఆసుపత్రులు, కొన్నిరకాల నాటు పడవలు జిల్లా బోర్డుల అధికార పరిధిలో ఉండేవి. స్థానిక బోర్డులను కూడ ఏర్పరచి, జిల్లా బోర్డుల క్రింద ఉంచారు. పట్టణమున్సిపాలిటీలకు కూడా మెజారిటీ సభ్యులను ఎన్నుకోనేవారు. బాగా నిలదొక్కుకున్నా కొన్ని మున్సిపాలిటీల అధ్యక్షులుగా అనధికారులను ఎన్నుకోనిచ్చేవారు. లార్డ్ రిప్పన్ భారతీయ విద్యా కమీషన్‌ను కూడా ఏర్పాటు చేశారు. దాని తీర్మానాలను అమలు పరిచారు.

పాలకుడు నిజాయితీ పరుడైనా, విదేశీపాలన నిజాయితీగా సాగే ఆస్కారం లేదన్న అమృతబజార్ పత్రిక వాదానికి ఉదాహరణగా లార్డ్‌రిప్పన్ ఒకా నొక చర్యను తలపెట్టి ఘోరంగా విఫలమయ్యాడు. పరిచయ వాక్యాలలో చెప్పినట్లు1849 బ్లాక్‌యాక్ట్‌దేశంలో బ్రిటిష్ అధికారులకు, భారత జాతీయులకూ మధ్య తీవ్రమైన స్పర్థలకు దారితీసిన విషయం ఇక్కడ ప్రస్తావించడం అవసరం. ఈ చట్టం క్రింద దేశంలోని యూరోపియన్లను బ్రిటిషర్లు మాత్రమే విచారించాలంటూ యురోపియన్లకు వర్తింపచేసిన రాయితీని 1882లో లార్డ్ రిప్పన్ రద్దుచేయ సంకల్పించారు. విధాన పరిషత్ లీగల్ మెంబరు అయిన సి.పి.ఇల్బెర్ట్ ప్రవేశపెట్టిన నేరస్థుల శిక్షా స్మృతిని ఈమేరకు సవరించే బిల్లును

రిప్పన్ రూపొందించాడు భారతీయులు ఈ బిల్లుకు హర్షం ప్రకటించినా, దేశంలోని యూరప్ జాతీయులందరూ దీనిని వ్యతిరేకిస్తూ విరుచుకు పడ్డారు. ఎ.బ్రాన్సన్ అనే బారిస్టరు వారి ఆందోళనకు నాయకత్వం వహించాడు యూరోపియన్ల మహాసభను ఆయన ఏర్పాటుచేశాడు. సభలో ఈ బిల్లును ఖండిస్తూ వేసిన తీర్మానం ఆమోదించారు. తీర్మానంలో ఇతర అంశాలతో బాటు ఈ క్రింది పాఠం వుంది "ఈ బిల్లు యూరోపియన్ బ్రిటిష్ పౌరుల విలువైన రాయితీలకు ఇంతకాలం గౌరవప్రదంగా భాసిల్లిన హక్కులకు స్వస్తి చెప్పటం తప్పించి భారత జాతీయులకు మేలు ఏమీ చేకూర్చదు యూరోపియన్, బ్రిటిష్ పౌరుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను హరించటం వల్ల భారత జాతీయుల హక్కులకు ఏమీ రక్షణ కలగదు జిల్లాలలో, పల్లెలలో నియమితులైన యూరోపియన్ల బ్రిటిష్ అధికారులు, ఉద్యోగులు వారి వారి భార్యాబిడ్డలు ఈ బిల్లు వల్ల ఒక విధమైన భద్రతా భావనలో పడతారు తత్ఫలితంగా దేశంలో బ్రిటిష్ పెట్టుబడులు తగ్గిపోతాయి 1857 సిపాయిల తిరుగుబాటు తరువాత ఎన్నడూ ఎరగని జాతి వైషమ్య భావం, అసూయను భారత, బ్రిటిష్ జాతీయుల మధ్య ఈ బిల్లు రెచ్చగొట్టింది"

అయినప్పటికీ రిప్పన్ సంకల్పాన్ని విరమించదలచలేదు. యూరోపియన్ల గర్జన ఎక్కువయింది. 1883లో వారి అసంతృప్తి ఎంతతీవ్రస్థాయికి చేరుకుందంటే – డార్జిలింగ్ నుంచి రిప్పన్ మరలి వస్తున్నపుడు వైస్రాయి భవనం గేటువద్ద ఆయనపై బండబూతుల వర్షం కురిపించారు పరమానంద దత్ వ్రాసిన ప్రకారం "నిజానికి అనేకమంది ఆంగ్లో ఇండియన్‌లు పెద్ద కుట్ర పన్నారు. ఈ శాసనాన్ని ప్రభుత్వం విరమించకపోతే గవర్నమెంటు హౌస్ వద్ద సెంట్రీలపై దాడి చేసి వైస్రాయిని చాంద్‌పాల్ ఘాట్ వద్ద స్టీమరులోకి బలవంతంగా ఎక్కించి కేప్‌గుడ్ హోప్ మీదుగా ఇంగ్లండుకు బలప్రయోగం ద్వారా తరలించివేయాలని పథకం వేసుకున్నారు." చివరికి లండన్‌లో బ్రిటన్ సుప్రీమ్ గవర్నమెంటు భారతదేశంలో బ్రిటన్ పెట్టుబడులకు విఘాతం కలుగుతుందన్న అభిప్రాయంతో ఏకీభవించి వివాదంలో జోక్యం చేసుకుంది. ఈ సంకల్పం విరమించుకుంటూ లాంఛన ప్రాయంగా జిల్లా మేజిస్ట్రేట్‌లు, సెషన్స్ జడ్జీల అధికార పరిధులను ఉటంకించడంతో వివాదానికి తెరపడింది. ఈ ఆఫీసుల్లో బ్రిటిష్ సివిల్ ఉద్యోగులే ఎక్కువగా

ఉన్నారు, భారతీయుల సంఖ్య చాలా తక్కువ. తరువాత చేసిన చట్టం యూరోపియన్ల ప్రత్యేక హక్కులు కుదించడం పోయి సాగదీసింది. క్రిమినల్ నేరాలకు పాల్పడినట్లు ఆరోపించబడిన యూరోపియన్‌లకు ముందు ఎన్ని రాయితీలు వున్నాయో అన్ని రాయితీలూ ఇప్పుడూ వున్నాయి.

"చట్టం ముందు అందరూ సమానులే" అని పరిగణించే శుభోదయం కలగబోతున్నదని ఆశించిన భారతీయులకు ఈ ఇల్బర్ట్ బిల్లుపై యూరోపియన్ల ఆందోళన పర్యవసానం వల్ల మళ్ళీ నిరాశ ఆవరించింది. అయితే మోతీలాల్, అమృత బజార్ పత్రిక ఈ ఉదంతం నుంచి ఒక గుణపాఠం నేర్చుకున్నారు అదేమిటంటే బ్రిటిష్ రాణికి భారతీయులు ఎంత విధేయులుగా ఉండాలని దేశంలోని యూరోపియన్‌లు ఆశించారో అంత విధేయంగా తాము మాత్రం లేరు. భారత జాతీయుల నిరసన ప్రదర్శనలను యూరోపియన్‌ల తైనాతీలు విమర్శించినప్పుడల్లా యూరోపియన్ల ఈ ఆందోళనను ప్రస్తావించి మోతీలాల్ వారిని ఎద్దేవా చేసేవారు. యూరోపియన్‌లు దేశంలో తిష్ఠవేసింది భారతీయుల్ని అణచివేయడానికి, దోచుకోవడానికి అనీ భారతీయులకు తిరుగుబాటు తప్ప గత్యంతరం లేదనీ మోతీలాల్ నిర్విరామంగా చాటుతూనే ఉన్నాడు ఆశ్చర్యం ఏమిటంటే ఆయన యూరోపియన్‌లపై ఎంతటి "నిప్పుల బాణాలు రువ్వినా కఠిన పదజాలంతో నిందారోపణలు చేసినా దయాపూరకమైన చిరునవ్వులో ఆ పని చేసేవారు. ఆయనతో పనుండి వచ్చిన యూరోపియన్‌లు ఆయన నిజాయితీని రుజువర్తననే గౌరవించేవారు. న్యాయమూర్తి నోరిస్‌పై చేసిన విమర్శకు గాను సురేంద్రనాథ్ బెనర్జీ కలకత్తా హైకోర్టును ధిక్కరించినట్లు నిర్ధారించి ఆయనకు రెండు నెలల జైలు శిక్ష విధించిన సంఘటనతో ఇల్బర్ట్ బిల్లు వివాదంతో ప్రజాభిప్రాయం మరింత ఆగ్రహాన్ని నింపుకుంది "ది బెంగాలీ" పత్రికలో సురేంద్రనాథ్ ఒక వ్యాసం రాస్తూ, ఒక కేసులో సాల గ్రామ విగ్రహాన్ని కోర్టు గుర్తించడానికిగాను కోర్టు ప్రాంగణంలో ప్రవేశపెట్టాలని అన్న జస్టిస్ నోరిస్ న్యాయమూర్తి పదవికి అనర్హుడు అని విమర్శించారు. అందుమీదట ఆయనకు ఈ శిక్ష పడగానే హిందువులంతా తీవ్ర నిరసన వ్యక్తం చేయడం, మరోసారి సురేంద్రనాథ్ బెనర్జీకి అఖండ ఖ్యాతి లభించడం జరిగింది. విడుదలైన వెంటనే 1883 డిసెంబరులో కలకత్తాలో ఇండియన్ అసోసియేషన్ అఖిల భారత

జాతీయ మహాసభ ఏర్పాటు చేశారు. భారతదేశపు మిత్రుడు డబ్ల్యూ. ఎస్.బ్లంట్ ఈ మహాసభను "జాతీయ పార్లమెంటు ఆవిర్భావానికి తొలి మెట్టుగా అభివర్ణించారు. 1870లోనే జాతీయ పార్లమెంటుకై శిశిర్‌కుమార్ సూచించారు. 1885లో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ స్థాపన తరువాత కాన్ఫరెన్స్ అందులో విలీనమయింది.

పత్రిక ఈ పరిణామాలని బలపరిచింది అలవాటు తప్పకుండా పత్రిక ఎప్పుడూ ప్రభుత్వాన్ని దుయ్యబడుతూనే వుంది 1884లో సెంట్రల్ ఇండియాలోని గవర్నర్ జనరల్ ఏజెంటుగా వున్న సర్‌లెపెల్ గ్రిఫిన్ అక్రమాలను పత్రిక బట్టబయలు చేసింది. భోపాల్ నేటివ్ స్టేట్ పాలనా వ్యవహారాల్లో గ్రిఫిన్ అక్రమాలపై పత్రిక విమర్శలు రుజువు కావడంతో గ్రిఫిన్ పదవికి రాజీనామా యిచ్చి సర్వీసు నుంచి తొలగిపోవలసి వచ్చింది.

అదేవిధంగా 1889లో పత్రిక మరో గొప్ప రహస్యాన్ని బయటపెట్టి (స్కూప్) తీవ్ర సంచలనం రేకెత్తించింది కాశ్మీర్ మహారాజాను గద్దె దించడానికి వెనుకగల కారణాన్ని తెలిపే విదేశాంగ శాఖ రహస్య పత్రాన్ని పత్రిక ప్రచురించింది. మహారాజా రాజీనామా చేయలేదనీ, ఆయన్ని తొలగించడానికి ప్రజలపై అణచివేత ధోరణులు సాగిస్తున్నాడన్న వాదన కూడా కారణం కాదనీ, గిల్‌గిట్ ప్రాంతాన్ని కొన్ని వ్యూహాల ఆచరణ నిమిత్తం బ్రిటిష్ ప్రభుత్వం ఆక్రమించ సంకల్పించడమే కాశ్మీర్ మహరాజా పదవీచ్యుతికి వెనుకగల రహస్యమనీ పత్రిక బట్టబయలు చేసింది. అత్యంత ప్రాముఖ్యంగల రహస్య పత్రం ఆ విధంగా బయటకు పొక్కడంతో దేశంలో తీవ్రాతి తీవ్రమైన గలాభా వెలరేగి తుదకు కాశ్మీర్ మహారాజాను తిరిగి గద్దె ఎక్కించారు ఇంత కల్లోలం రేకెత్తించినా పత్రిక సురక్షితంగా మనగలిగింది. ఎందుకంటే అప్పటికి అధికార రహస్యాల చట్టం అనేది లేదు. దానితో పత్రికపై చర్యకు ఆస్కారం కలగలేదు. తిరుగుబాటు తత్వంతో ప్రభుత్వంపై దాడి చేయడమే లక్ష్యంగా గల పత్రికల బారినుంచి రక్షణకు గాను ఆదరాబాదరాగా ప్రభుత్వం అటువంటి చట్టాన్ని రూపొందించింది. హడావుడిగా తెచ్చిన ఈ చట్టం ప్రభుత్వ ఉద్దేశాలపట్ల ప్రజల ఆగ్రహాన్ని మరింత పెంచింది అధికారులు ఆ సంగతి గ్రహించలేకపోయారు. కాని బాగ్ బజార్‌లో "చిన్నమనుషులు" అధికార రహస్యాల గురించి చెవులు కొరుక్కుంటూ ఉండేవారు.

బెంగాల్‌లో "ది బెంగాలీ", "అమృతబజార్" పత్రికలు అగ్రస్థానం వహిస్తున్న

తరుణంలో ప్రాంతీయ భాషల పత్రికారంగం భారత జాతీయోద్యమం సందేశాన్ని వ్యాపింపచేయడం ప్రారంభించింది. బెంగాలీ పత్రికలలో బంగబాసి (1881), సంజీబాని(1883), హితబాది(1891) విశేష ప్రచారం గలవి. బంగబాసి సనాతన హిందూ ధర్మాలను బలపరచగా, సంజీబాని బ్రహ్మసమాజ వాణిని వినిపించేది. హితబాది హిందూ సంస్కరణ వాదాన్ని ప్రచారం చేసేది. మహారాష్ట్రలో 'హిందూ ప్రకాష్', 'మహారాట్ట', 'కేసరి', 'కాల్' పత్రికలు, బొంబాయిలో 'బొంబాయ్ సమాచార్', 'జయ్ - ఇ -జయ్‌షెడ్', 'రాస్త్ గుఫ్తార్' పత్రికలు, మద్రాస్‌లో 'ది హిందూ', స్వదేశ మిత్రన్‌ఉత్తర భారతదేశంలో "ద్రిబ్యూన్" పత్రికలు వెలువడేవి. 1890లో కేసరి, మహారాట్ట పత్రికల ఎడిటర్‌పదవి చేపట్టిన బాలగంగాధర తిలక్, తన గురువుగా శిశిర్‌కుమార్‌ను పేర్కొన్నారు. "ఆయనను నా తండ్రిగా గౌరవిస్తాను. ఆయన కూడ నన్ను తన కుమారునిగా ఆదరించారు," అని 1917లో తిలక్ వ్రాశారు.

విద్యావంతులైన విదేశీయుల్ని శత్రువుల వలె కాక మన పరిపాలనకు మిత్రులవలె మరల్చాలని బ్రిటీష్ ప్రభుత్వోద్యోగులలోని ఉదార స్వభావులు తలపోశారు. లార్డ్ రిప్పన్‌నుంచి స్ఫూర్తి పొంది వారీ ప్రతిపాదనకు వచ్చారు. క్రొత్త మేధావి వర్గాన్ని వినియోగించుకొనకపోవడం తప్పుడు విధానం మాత్రమే కాదు, అధికారం వ్యర్థం చేయడం కూడా అని లార్డ్ రిప్పన్‌తో పాటు వారూ భావించారు. కలకత్తాలో ఇండియన్ అసోసియేషన్ విద్యావంతులైన భారతీయ ప్రజల అభిప్రాయాలు సమీకరించే ప్రయత్నంలో ఉన్నప్పుడు ముగ్గురు బ్రిటీష్ అధికారులు ముందుకు వచ్చి భారతీయ జనాభిప్రాయానికి వేదికగా అఖిల భారతస్థాయి వ్యవస్థ ఏర్పాటుకు సూచించారు. వారి పేర్లు, 'ఏ.వో.హ్యూమ్, సర్ డబ్ల్యూ. వెడర్‌బర్న్, డబ్ల్యూ. ఎస్. బంట్.' 1883లో హ్యూమ్ దేశంలో కెల్ల అత్యున్నత విద్యావంతులుగా ఎంపికైన మేధావులకు బహిరంగ లేఖ రాస్తూ "మీకూ మీ దేశానికి మరింత అధిక స్వాతంత్ర్యాన్ని , మరింత నిష్పాక్షిక పాలనా వ్యవస్థని స్వదేశానికి సంబంధించిన వ్యవహారాల నిర్వహణలో విస్తృతమైన భాగస్వామ్యాన్ని సాధించడానికి పోరాటం సాగించండి.... కార్యాచరణ ఏ తీరుగా వుండాలో గ్రహించండి... స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు సంతోషాల సాధనకు ఆత్మ పరిత్యాగం, స్వార్థ రాహిత్యం తిరుగులేని మార్గాలనే శాశ్వత సత్యాన్ని గుర్తెరిగి త్యాగాలకు సిద్ధంకండి. 1884లో లార్డ్ రిప్పన్ స్థానే

వైస్రాయిగా వచ్చిన లార్డ్ డుఫెరిన్ మద్దతుతో చేపట్టిన పథకం ప్రకారం "ఎంపిక చేసిన వ్యక్తుల" సమావేశం బొంబాయిలో 1885 డిశంబరులో జరిగింది. ఇండియన్ నేషనల్ కాంగ్రెస్‌ను ఆ సమావేశంలోనే స్థాపించారు. కలకత్తాకు చెందినవాడు, పాశ్చాత్య భావాలుకల ప్రముఖ బారిష్టర్, సంస్థ అధ్యక్షుడు డబ్ల్యూ. సి. బెనర్జీతో పాటు "ది ఇండియన్ మిర్రర్" "నబ బిభాకర్" పత్రికల సంపాదకులిద్దరు మాత్రమే బెంగాల్ నుంచి ఈ సభకు హాజరయినారు. సురేంద్రనాథ్‌ను కూడా ఆహ్వానించినప్పటికీ, అదే సమయంలో కలకత్తాలో ఏర్పాటైన ఇండియన్ అసోసియేషన్ ద్వితీయ సదస్సు మూలకంగా తీరికలేక ఆయన హాజరు కాలేదు. బెంగాల్ నుంచి ఇంకెవరినీ ఆహ్వానించినట్లు లేదు

కాంగ్రెస్ ద్వితీయ సదస్సు తరువాత సంవత్సరం కలకత్తాలో దాదాభాయ్ నౌరోజీ అధ్యక్షతన జరిగినప్పుడు ఇండియన్ అసోసియేషన్ విలీనం కావడం, కాంగ్రెస్ ఒక రాజకీయ సంస్థగా ఆవిర్భవించడం జరిగింది. విధాన పరిషత్తులలో భారతీయులను నామినేట్ చేసే సాంప్రదాయం వద్దని ఎన్నికల ద్వారా ప్రాతినిధ్యం కల్పించాలని ఒక ముఖ్య డిమాండ్ ఈ సదస్సులోనే వినవచ్చింది. సదస్సు తీర్మానాలు మందకొడిగా, అమాయకంగా ఉంటే, సదస్సులో చర్చలు మరీ అంతకన్నా కనాకష్టంగా వుంటే ఏమయ్యేదో కాని లార్డ్ డఫెరిన్‌కి ఈ సమావేశంవల్ల తీవ్ర అసంతృప్తి ఎదురైంది. "విదేశీ యంత్రాంగం క్రింద మగడం" గురించి ప్రతినిధులు చర్చించడం ఆయనకు కంటకప్రాయమైంది. బ్రిటిష్ వారు "ఎంపిక చేసిన వ్యక్తుల" కూటమిని మొదటి నుంచి అయిష్టంతో చూస్తూ వచ్చిన మోతీలాల్ జాతీయ జనాభిప్రాయాన్ని ప్రతిబింబించే శక్తివంతమైన సంస్థగా కాంగ్రెస్‌ను గుర్తించారు. కాంగ్రెస్‌పై ప్రభుత్వం కన్నెర్ర చేసినకొద్దీ మోతీలాల్‌కు మక్కువ పెరుగుతూ వచ్చింది. కాంగ్రెస్‌ను "సూక్ష్మమైన అల్పసంఖ్యాక వర్గానికి" ప్రాతినిధ్యం వహించేదిగా లార్డ్ డఫెరిన్ ఈసడించినపుడు మోతీలాల్ కాంగ్రెస్‌తో చేయి కలిపాడు. అలహాబాద్‌లో 1888లో జరిగిన కాంగ్రెస్ 4వ సదస్సుకు పురాతన ఖద్దర్ ధరించి ఆయన హాజరైనారు. ఇండియాలో ఇంగ్లాండుతో పాటు ఏకకాలంలో జరిగిన ఐ.సి.ఎస్ పరీక్షలలో ఉత్తీర్ణులైన అభ్యర్థులు ఏడాదిపాటు లండన్‌లో నిర్బంధంగా శిక్షణ పొందాలన్న ప్రతిపాదనను ఆయన తిరస్కరించారు.

మోతీలాల్ వాదం అందరినీ ఆకర్షించింది. ఇరు దేశాలోను ఏకకాలంలో

బహిరంగంగా ఐ.సి.ఎస్ పోటీ పరీక్షలు జరపనంత కాలం భారతీయులకు పూర్తి న్యాయం జరుగదని, తీర్మానంలో కేవలం ఒక వినతిచేశారు. ఈ మహాసభ ఫలితాల పట్ల మోతీలాల్ సంతృప్తి చెందలేదన్న విషయం పత్రికలో ఆయన వ్రాసిన వ్యాఖ్యలను బట్టి అర్థమైంది. "అలహాబాద్‌లో మహాసభకు వెళ్ళిన చిత్తశుద్ధి గల ప్రతినిధులంతా అసంతృప్తితో అక్కడ నుంచి వచ్చారు. వారు ఎన్నో చెప్పాలి. ఎన్నో చేయాలి అని అనుకున్నారు. కాని ఆ అవకాశం లేక కాంగ్రెస్‌కు ప్రతినిధుల సంఖ్య పెంచడం మినహాయించి ఏమీ చేయలేకపోయారు. క్రిందటేడాది మదరాసులో జరిగిన మహాసభ గురించి ముందుగా ఎంతో ఆత్రుతతో తర్జన భర్జనలు మటుకు సాగాయ్."

మోతీలాల్‌కు అంతటి అసంతృప్తి కలగటానికి రెండు ముఖ్య కారణాలున్నాయి. మొదటి దేమిటంటే ఈసారి కాంగ్రెస్ లక్ష్యం స్వీయ పరిపాలన కాదు. భారత, ఇంగ్లాండ్‌ల మధ్య సయోధ్యను పదిలపరచడం, అందుకు భారతదేశానికి బాధాకరమైనట్టి పరిస్థితులలో బ్రిటిష్ ప్రభుత్వం మార్పులు తెచ్చేటట్టు చేయడం లక్ష్యంగా ద్యోతకమయింది. కాంగ్రెస్ సంస్థ ఆదినాయకులు స్వీయపాలనకోసం గట్టిగా కోరలేనంతగా బ్రిటిష్ లిబరల్ సూత్రాల పట్ల వ్యామోహం పెంచుకున్నారు. అంతేకాక దేశపాలనలో బ్రిటిష్ పాలకులతో పరిసమానమైన భాగస్వామ్యం కోసం ఉవ్విళ్ళూరారు. కాంగ్రెస్ నాయకత్వంలోని మెజారిటీ భాగం అగ్రశ్రేణి భారతీయ నిపుణులు, బడా భూస్వాములు, యూరోపియన్ వ్యాపారులు, సివిల్ ఉద్యోగులతో కూడుకున్నది. భారతీయ వ్యాపారులు, గుమాస్తాలు, అధ్యాపకులు, డాక్టర్‌లు, చిన్నస్థాయి అధికారులు, లాయర్లతో కూడిన మైనారిటీ వర్గం బెంగాలీ అభిప్రాయానికి ప్రాతినిధ్యం వహించేది. నిర్బంధ ఇంగ్లీషు చరిత్ర అధ్యయనం ద్వారా ఈ మైనారిటీ వర్గం మానవ హక్కులు చాలా విలువైనవనీ, బలప్రదర్శన ద్వారానే వాటిని సాధించుకొనగలమని చాలా లోతుగా విశ్వసించింది. ఈ అభిప్రాయాలను బలపరిచి ప్రచారం చేసినది అమృతబజార్ పత్రికే. బెంగాలీ మధ్య తరగతి మేధావి వర్గం బ్రిటిష్ ప్రభుత్వపు వివక్షతలతో కూడిన పాలననీ, తాము చేసిన చట్టాలను తామే ఉల్లంఘిస్తూ ఆంగ్లో ఇండియన్స్ పట్ల అపార వాత్సల్యం చూపే విధానాలనీ, ఎప్పటికప్పుడు విడువకుండా విమర్శిస్తూంటే, బ్రిటిష్ సివిల్ ఉద్యోగులు కంటగించుకొనడం ప్రారంభించారు. పరస్పరం

ఏహ్యభావ ప్రదర్శన స్పష్టం కాజొచ్చింది.

ఈలోగా సామ్రాజ్యవాద ప్రభుత్వం ముస్లిం వేర్పాటు వాదాన్ని లేవనెత్తింది. మహమ్మదీయులలో ప్రభుత్వం ఏర్చికూర్చిన వర్గమొకటి, సిపాయిల తిరుగుబాటు జరిగినప్పటి నుంచీ, రాజకీయ అస్తిమితాన్ని ప్రేరేపిస్తూ వచ్చింది. సివిల్ సర్వీసులోని టోరీ సెక్షన్ అండదండలతో, సర్ సయ్యద్ అహమ్మద్ ఖాన్ ఇటువంటి ఎంపికచేసిన వ్యక్తులను విధేయత ద్వారా ప్రభుత్వ గుర్తింపునకు ప్రాకులాడే ఒక వర్గంగా ఏర్పరచి పోటీ రాజకీయ పక్షాన్ని రూపొందించారు యావత్ భారతదేశాన్ని ఒకే జాతిగా పరిగణిస్తున్నదన్న కారణాన కాంగ్రెస్‌కు సయ్యద్ అహమ్మద్ అభ్యంతరం చెప్పారు. ముస్లిమ్‌లు, హిందువులు వేర్వేరు జాతులనీ భారతదేశంలో దేశానికి ప్రాతినిధ్యం వహించే ప్రభుత్వం ఏర్పడితే హిందూ మధ్యతరగతి - ఇంకో మాటల్లో బెంగాలీ బాబులు ఆధిక్యతలో ఉన్న కాంగ్రెస్ పాలనకు దారి తీస్తుందని అహమ్మద్ ఖాన్ భయాందోళనలు వ్యక్తం చేశారు. "ఉన్నత కుటుంబీకులు తమ ధన ప్రాణాదులను, దిగువ శ్రేణి ప్రజలకు నమ్మి అప్పగింపబోరు." అని ఆయన వ్యంగ్య వాదన. కాని విద్యావంతులైన మహమ్మదీయులలో మెజారిటీ వర్గం, కాంగ్రెస్ వెంటే వుంది. అందువల్ల తన బ్రిటీష్ సలహాదారులు కోరినమేరకు 1888లో యునైటెడ్ ఇండియన్ పేట్రియాటిక్ అసోసియేషన్ స్థాపించి అది కాంగ్రెస్‌కు పోటీగా రూపొందాలని సయ్యద్ అహమ్మద్ ఉద్దేశించారు. హిందూ, ముస్లిం ఉన్నత వర్గాల వారితో కాంగ్రెస్ వ్యతిరేక వేదికగా దానిని స్థాపించారు. 1878లోనే బెంగాల్‌లో అమీర్ ఆలీ అనే సంపన్న ముస్లిం బారిష్టరు సెంట్రల్ నేషనల్ మహమ్మదీన్ అసోసియేషన్‌ను ప్రభుత్వంలో ముస్లిమ్‌లకు హెచ్చు భాగస్వామ్యాన్ని సాధించేందుకు స్థాపించారు. ఎన్నికల వంటి పోటీ సూత్రాలకు స్వస్తి చెప్పి నామినేషన్ల ద్వారా ప్రాతినిధ్యం సాధించాలన్నది ఉద్దేశ్యం. మహమ్మదీయ వేర్పాటు వాదానికి అధికారుల అండదండలే కాక అప్పుడే రూపు దిద్దుకుంటున్న జాతీయవాదంలోని హిందూ పక్షపాత ధోరణి కూడా దోహదం చేసింది. కాంగ్రెస్ తగినంత పటిష్టమైనది కాదని బెంగాలీలలో అసంతృప్తి ప్రబలడానికి మరో కారణం ఏమిటంటే - అఖిల భారత స్థాయి సంస్థగా ముఖ్యమైన స్థానిక ప్రాంతీయ సమస్యలపై చర్చను కాంగ్రెస్ తిరస్కరిస్తూ వచ్చింది. ఒకటి తరువాత ఒకటిగా పలు ప్రాంతాలను పట్టి పల్లార్చే

రీతిలో తరచు సంభవిస్తున్న కరువు కాటకాల వల్ల గ్రామీణ పేద రైతులలో రగుల్కొంటున్న నిరాశ, నిస్పృహలను కాంగ్రెస్ ఆలస్యంగా గుర్తించింది. అస్సాంలో బ్రిటిష్ పారిశ్రామికవేత్తల యాజమాన్యంలోని తేయాకు తోటల్లో పని చేయటానికి పేదకూలీలను బలవంతంగా తెచ్చి అమానుషంగా దోపిడీ చేస్తుంటే బెంగాల్ తీవ్ర అసంతృప్తితో అట్టుడికిపోగా కాంగ్రెస్ ఈ అంశాన్ని పట్టించుకోవడానికి నిరాకరించింది చివరికి కాంగ్రెస్ విరుద్ధ వైఖరివల్ల 1887లో బెంగాల్ ప్రావెన్షియల్ కాంగ్రెస్ ఏర్పాటైంది. అణచబడిన ప్రజల తరఫున, రైతుల తరఫున, వారి ప్రయోజనాల రక్షణకు ఉద్యమించటం ద్వారా మాత్రమే విద్యావంతులు జాతీయ నాయకత్వం బాధ్యతను సక్రమంగా నెరవేర్చగలుగుతారని మోతీలాల్‌తో పాటు ఆయన తరహా ఆలోచనాపరులు భావించారు. ప్రజా ప్రాతినిధ్య ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలన్న డిమాండ్ విషయంలో కూడా కాంగ్రెస్ కన్నా బెంగాలీలు ముందు నిలిచారు. గ్రామాలు జిల్లాలు ఈ అంశంలో కలకత్తా నగరంతో సమానంగా నిలిచాయి. ఆయా కార్యకలాపాలన్నీ మోతీలాల్ పత్రికలో చాలా విస్తృతంగా అగుపించేవి. మోతీలాల్, శిశిర్‌కుమార్ పత్రికా రచనలో వాడిన ఇంగ్లీష్ భాష మధ్యతరగతి ప్రజలకు అర్థమయ్యే విధంగా ఉండటం ఒక అవసరమైంది. పవిత్రమైన పదాడంబరముతో కూడిన ఇంగ్లీష్ రాస్తే ఆ భాష అంతగా తెలియని పాఠకులు విషయాన్ని సులభంగా అర్థంచేసుకోలేక పోయారు అందువల్ల ఘోష్ సోదరులు భారతీయ ప్రత్యామ్నాయ పదజాలం మధ్యమధ్య వాడుతూ చాలా సులభమైన ఇంగ్లీష్ రాయడం "ఫ్యాషన్‌గా ప్రవేశపెట్టారు ఈ ప్రయోగం తక్షణం భారతీయ పాఠకుల ప్రశంసను పొందినది కాని ఆంగ్లేయులు ఆ ఇంగ్లీషుకు ముఖం చిట్లించి ఇదంతా "బాబూ ఇంగ్లీష్" అని కొట్టిపారేసేవారు

# 6. ప్రజా జీవనరంగంలో...

**1887**లో పబ్లిక్ సర్వీస్‌లపై రాయల్ కమీషన్‌ను సుప్రీంకోర్టు ఏర్పాటు చేసింది. ఈ కమీషన్‌కు సాక్షిగా మోతీలాల్ హాజరయ్యారు. ఈ కమీషన్‌కు సాక్షిగా ప్రజాజీవితానికి సంబంధించిన వ్యక్తిగా మొదటిసారిగా ఆయన వెలుగులోకి వచ్చిన సంఘటన యిది. ఆ తరుణంలో బ్రిటీష్ సామ్రాజ్యపు పాలనా వ్యవస్థలో తొమ్మిది వందల మంది సివిల్ ఉద్యోగులున్నారు. వీరిలో చాలామంది బ్రిటీష్‌వారే. బ్రిటీష్ విశ్వవిద్యాలయాలకు పూచిన పూవుగా ఈ వర్గానికి ముద్దు పేరుండేది. లిబరల్స్ వ్యతిరేకించక పోవటంతో బ్రిటన్‌లో ప్రభుత్వం ఈ కాంట్రాక్టు సర్వీసులలో భారతీయులను చేర్చుకోకూడదని కోరుకుంది. దేశంలో కేంద్రీకృతమైన బ్రిటీష్ అనధికారుల వర్గం భారతీయుల యావన్మందినీ ఏవగించుకొనేది కావటం వలన ముఖ్యంగా ఆందోళనా మార్గాన్ని అవలంబించే బెంగాలీల పట్ల తీవ్రమైన ఏవగింపు పెంచుకోవడం వలన బ్రిటన్ ప్రభుత్వపు ఉద్దేశ్యాన్ని గట్టిగా బలపరిచింది. వాళ్ళ అవగాహన ఏమిటంటే – "డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేట్‌లు, వారి ముఖ్య సబార్డినేట్‌ల ఉద్యోగాలు పూర్తిగా ఇంగ్లీషువారికే ఉండాలి." భారతీయులు అందునా ప్రత్యేకించి ఏవగింపునకు గురైన బెంగాలీలు చారిత్రక కారణాల వలన పబ్లిక్ సర్వీస్ పరీక్షలలో ఎన్ని అవరోధాలకైనా ఓర్చుకొని చాలా ప్రతిభని ప్రదర్శించి ఉత్తమ ఫలితాలు సాధించడం ప్రారంభించారు. ఓపెన్ కాంపిటీటివ్ పరీక్షల నిర్వహణ ద్వారా ప్రభుత్వ సర్వీసుల్లో భారతీయులకి హెచ్చు ప్రాతినిధ్యం కల్పించాలన్న భారతీయుల డిమాండును పూర్తిగా నిర్లక్ష్యం చేయడం ఇక దుర్లభమైంది. భారతీయ జనాభిప్రాయాన్ని కొంతమేర శిరసావహిస్తూ తొలి చర్యగా రాయల్ కమీషన్ ఏర్పాటైంది. పత్రిక జాయింట్ ఎడిటర్‌గా తన అభిప్రాయాలు వినిపించడానికి మోతీలాల్‌ను కమీషన్ ఆహ్వానించింది. కమీషన్ తన అభిప్రాయాలు వినిపిస్తూ మోతీలాల్ ప్రధానంగా పోస్టల్ డిపార్టుమెంటును

ప్రస్తావించారు – ఎందుకంటే దేశంలో ఈ శాఖ భారతీయులు తప్ప అన్యదేశస్థులు ఎవరూ నిర్వహించడానికి వీలులేని – అయినప్పటికీ ఉన్నత హోదాలలో ఆంగ్లో ఇండియన్‌లే నిర్వహిస్తూ వస్తున్నది. పోస్టాఫీస్ డిపార్టుమెంటులో ఏ ఆఫీసులోను భారత జాతీయుణ్ణి ఇంకెవర్నీ నియమించరాదు అని భారతీయ తపాలా చట్టం నిర్దేశిస్తోంది. కాని రాష్ట్రాలలో పోస్ట్ మాస్టర్స్ జనరల్, వారి ముఖ్య సబార్డినేటు లందరూ యూరోపియనులే. బెంగాలులోని మొత్తం పదిహేను జిల్లా సూపరింటెండెంట్లలో ఎనిమిది మంది, పధ్నాలుగు రైల్వే మెయిల్ సర్వీస్ అధికారుల ఉద్యోగాలలో పదిమందీ యూరోపియనులే. మోతీలాల్ మరింత ఆశ్చర్యం గొలిపే వాస్తవం బైట పెట్టారు. ఈ నియామకాలలో 18, 20 మధ్య వయస్కుల నియామకాలు పధ్నాలుగు దాకా వున్నాయని తెలిపారు. ఆ శాఖలో వ్రేళ్ళు పాతుకుపోయిన అవినీతి, లంచగొండితనాన్ని వెల్లడిచేస్తూ ఆయన మాట్లాడారు. మోతీలాల్ ఇచ్చిన ఈ ప్రకటన పోస్టల్ సర్వీసులు భారతీయుల పరం కావడానికి దోహదపడింది. అంతేకాక పత్రికల్లో మోతీలాల్ ప్రకటన అచ్చుకావడంతో కుంభకోణం రచ్చకెక్కి బ్రిటీష్ పార్లమెంటులో చార్లెస్ బ్రాడ్‌లాఫ్ ఈ అవినీతిపై చర్చ లేవనెత్తడం, భారతదేశంలో తపాలాశాఖ డైరెక్టర్ జనరల్ రాజీనామా చేయడం కూడా జరిగింది. ఆ అధికారి పేరు హాగ్

కె కమీషన్‌కు మోతీలాల్ ఇచ్చిన సాక్ష్యం, ఆ సందర్భంగా ఆయన చేసిన వ్యాఖ్యలు యూరోపియన్లను, బల్లచాటు వ్యవహారంలో బాగుపడే అవకాశము యూరోపియన్లను, అసంతృప్తి పాలు చేసింది 18 – 20 లోపు నవ యువకుల నియామకాలపై కమీషన్ ఎదుట మోతీలాల్ వ్యాఖ్యానిస్తూ : "మన అష్టావక్రుడు వలె తల్లి గర్భం నుంచి వస్తూనే ప్రపంచాన్ని శాసించే సత్తా ఏ పనైనా చేయగల సత్తా పుణికి పుచ్చుకుంటే తప్ప ఆ యువకులు అందులో కొందర్ని కుర్రాళ్ళన్నా తప్పులేదు – సూపరింటెండెంట్ వంటి ఉన్నత పదవికి అర్హులు కాదు. వాళ్ళంతా అష్టావక్రులై ఉండాలి. అష్టావక్రుడు పన్నెండేళ్ళపాటు తల్లి గర్భాశయంలో ఉన్నప్పుడే తండ్రి శిష్యులకు బోధనల ద్వారా సర్వజ్ఞత సంపాదించాడు..."

మోతీలాల్ కమీషన్‌ఎదుటచేసిన ఈవ్యాఖ్యలకి అనేకపాఠకులవద్ద నుంచి ఉత్తరాలు వచ్చాయి. ఓ యురోపియన్ లేదా యురోపియన్ ఆకాశ రామన్న ఇలా రాసాడు :

6."మోతీలాల్ ఘోష్ – క్రితం రోజు పబ్లిక్ సర్వీస్ కమీషన్ ఎదుట నీ వాగుడు చదివిన పాఠకులకి మీ దుర్మార్గపు జాతివాళ్ళు ఏ పాటివారో మీ రెటువంటి నీచ విషయాలు మాట్లాడగలరో అసందర్భపు పనులు చేయగలరో బాగా అర్థమైంది. అక్కడ హాజరైవున్న యురోపియన్ పెద్దమనుషులు తమ బూట్ల మడమలతో నీ వీపు వెూత మ్రోగించలేదంటే ఆశ్చర్యంగా ఉంది. మీ బెంగాలీ మర్యాదలు, అలవాట్లు ప్రదర్శించినందుకు అసలు అదే శాస్తి జరగాల్సి ఉంది. భూమ్మీద మీ బెంగాలీలంత కనాకష్టమైన జాతి మరొకటి లేదు. మెకాలే ఏమన్నాడో చదువు, "మీ ... (ఇక్కడ ముద్రించటానికి వీలులేని పదం) ...అందర్నీ ఇంగ్లీషు ప్ర[illegible]త్వం కాబట్టి సహిస్తుంది' అన్నాడు మెకాలే. బెంగాలీ మోసగాళ్ళు, దొంగలు, లు[illegible]లు, అందర్నీ మించి నువ్వు, మీ జాతి ప్రయోజనాలకు నష్టం కలిగించారు

"... (ఇక్కడ రాయకూడని మాట)

కుమారగుప్తికే .. (ఇక్కడ రాయకూడని మాట)"

అమృతబజార్ పత్రిక ఈ లేఖను ప్రచురిస్తూ ఈ క్రింది వ్యాఖ్య జోడించింది;

"ఈ పై లేఖ ఒక యూరోపియన్ లేదా ఒక – పోస్టల్ ఆఫీసర్ రాసిందనడంలో మా కెటువంటి సందేహం లేదు. అదే యదార్థమైతే ఆ లేఖ చివరనగల – అతనికి పోస్టల్ ఆఫీసరుగా ఉద్యోగమిచ్చిన పెద్దమనిషి ఎవరో ఆయనకే చెందాలి. ఆ పెద్దమనిషికి దానిని మేము ఉచిత బహుమానముగా అందిస్తున్నాము."

మోతీలాల్ ఇండియన్ నేషనల్ కాంగ్రెస్‌లోకి, ఇంతకు ముందే చెప్పినట్లు, దాని శక్తికిగాను ఆకర్షితులై చేరారు. లేకపోతే నాటి కోట్లు, బూట్లు ధరించిన కాంగ్రెసు నాయకులతో ఆయన వంత పాడేవాడు కాడు. 1889లో జరిగిన కాంగ్రెస్ వార్షిక సభలో సర్ విలియమ్ వెడర్బర్న్ అధ్యక్షోపన్యాసం ఇస్తూ భారతీయులకు హెచ్చు ప్రాతినిధ్యం కల్పించటానికి వీలుగా శాసన పరిషత్తులలో సంస్కరణను సూచించారు. ఓ ప్రతినిధిగా హాజరయిన మోతీలాల్ భారతీయులకి తిన్నగా ప్రాతినిధ్యం కల్పించేందుకు ఓ పథకాన్ని ప్రతిపాదించారు భారతీయుల ఆశలు, లక్ష్యాలను చిత్తశుద్ధితో బలపరచిన బ్రిటిష్ సోదరుడు చార్లెస్ బ్రాడ్‌లాఫ్ కూడా ఈ సెషన్‌కి హాజరయ్యారు. (బ్రిటీష్ పార్లమెంటులో 'భారతదేశపు సభ్యుడు" అని ఆయనకు మారుపేరు ఉండేది.) మహాసభలో సమర్పించిన ప్రతిపాదనలన్నింటికన్నా అమృతబజార్ పత్రిక ప్రతిపాదించిన పథకమే

ఉత్తమమైనదని ఆయన భావించారు. భారతీయులకు తీవ్రంగా ప్రాతినిధ్యం కల్పిస్తే బ్రిటన్ సామ్రాజ్యవాద ప్రయోజనాలు దెబ్బతింటాయి. కనుక పార్లమెంటులో టోరీ మెజారిటీ వర్గం ఈ ప్రతిపాదనను బలపరచబోదని ఆయన భావించారు. అలాటి పరోక్ష ప్రాతినిధ్యానికి వీలు కల్పించే పథకాన్ని సూచిస్తూ మహాసభలో తీర్మానాన్ని ఆమోదించారు. తద్వారా ప్రావిన్షియల్ కౌన్సిళ్ళలో భారతీయుల ప్రాతినిధ్యం పెరిగింది. ఉదాహరణకు బెంగాల్ కౌన్సిల్లో ప్రాతినిధ్యం వివరాలు ఇలాఉన్నాయి: ఎక్స్ ఆఫీషియో; లెఫ్టినెంట్‌గవర్నర్; నామినేటెడ్10; అనధికారులు 3; సిఫార్సుపై నియమించే సభ్యులు - కలకత్తా కార్పొరేషన్ 1, మునిసిపాలిటీ 2, జిల్లా బోర్డులు 2,యూరోపియన్ వ్యాపారులు 1, కలకత్తా యూనివర్శిటీ 1,నామమాత్రపు సమానత్వం కల్పించబడింది.

ఈ కాంగ్రెస్ మహాసభలో జరిగిన మరో చర్య ఏమిటంటే - భారత జాతీయ కాంగ్రెస్‌కు చెందిన బ్రిటిషు కమిటీ ఏర్పాటుచేయడం బ్రిటన్‌లో కాంగ్రెస్ లక్ష్యాల సాధనకు కృషి చేయడం ఈ కమిటీ లక్ష్యం. రిటైరైన ప్రభుత్వాధికారులు వెడర్‌బరన్, కాటన్‌తో బాటు కీర్ హార్డీ, ఎసీకిరాట్ క్లిఫ్, మెక్‌డొనాల్ (తరువాత బ్రిటన్ ప్రధానిగా ఎన్నికైన లేబర్‌పార్టీ సభ్యుడు), చార్లెస్ బ్రాడ్‌లాఫ్, డా॥ హెచ్.బి. రూథర్‌ఫర్డ్‌వంటి ఉగ్రవాదులు, హెచ్ డబ్ల్యూ నెవింగ్‌సన్, విలియం డిగ్‌బీ,విల్‌ఫ్రెడ్ స్కావెన్ బ్లంట్ వంటి ఇతరులతో ఈ బ్రిటీష్ కమిటీ ఏర్పడింది. 1892లో కాంగ్రెస్ నాయకుడు దాదాభాయ్ నౌరోజీ కాంగ్రెస్ టికెట్‌పై బ్రిటీష్ పార్లమెంటుకు ఎన్నికవడం ఈ కమిటీ సాధించిన ఘన విజయం. అదొక్కటి మినహాయిస్తే నాటి టోరీ బ్రిటీష్ ప్రభుత్వపు అభివృద్ధి నిరోధక జాతి వివక్షతలతో కూడిన సామ్రాజ్యవాద విధానాలను ఈ కమిటీ ఏమాత్రం ప్రభావితం చేయలేక పోయింది. "ఆ ప్రభుత్వం తమ దేశంలోని ప్రజాస్వామ్య వ్యవస్థ భారత సామ్రాజ్యంపై చూపుతున్న ప్రభావాన్ని తలచుకుని, అటువంటి ప్రజాస్వామ్య వ్యవస్థ పునాదిగా ఆంగ్లేయుల ప్రమేయం లేని పూర్తి స్వయం ప్రతిపత్తిగల భారతీయ ప్రభుత్వాన్ని ఊహించుకుని భయపడింది. అందుమూలంగా పార్లమెంటులో భారతదేశానికి సంబంధించిన అంశాల్ని కూలంకషంగా చర్చిస్తే ఆ దేశాన్ని బ్రిటన్ పూర్తిగా కోల్పోవలసి వస్తుందన్న భయంతో దిగువసభ సభ్యులు అసలు ప్రస్తావించేవారు కారు." ( ది బ్రేక్ అప్ ఆఫ్ బ్రిటీష్ ఇండియా, 1969 బి.ఎన్.పాండే రచన). బ్రిటీష్

కమిటీకి ఖర్చులకుగాను యాభైవేల రూపాయల వార్షిక గ్రాంటును కాంగ్రెస్ మంజూరు చేసింది. ఇండియా అనే పేరుతో ఈ కమిటీ ఒక పత్రికను ప్రచురించేది పాలకులకి చిత్తశుద్ధి వున్నా విదేశీ పాలనలోని పాలితులికి ఏమీ ప్రయోజనం సిద్ధించదని మోతీలాల్ చెప్పిన సిద్ధాంతం మరోసారి ఋజువయింది.

ఈ కాంగ్రెస్ మహాసభలప్పుడే మోతీలాల్ చార్లెస్ బ్రాడ్‌లాఫ్ సమావేశం జరిగింది భారతీయులకు మద్దతుగా బ్రాడ్‌లాఫ్ మారడానికి ఈ సమావేశంలో మోతీలాల్ ఆయనను ప్రభావితం చేయడమే కారణమని మోతీలాల్‌కి పేరు వచ్చింది. బ్రాడ్‌లాఫ్ ఆదిలో భారతీయులను బలపరచడానికి కారణం భారతదేశానికి సంబంధించిన వాస్తవాలు ఆయనకు తెలియకపోవడమే! "ప్రోస్పరస్ బ్రిటిష్ ఇండియా" అనే పుస్తకం రాయడానికి బ్రాడ్‌లాఫ్ మిత్రుడు విలియం డిగ్ బీ సేకరిస్తున్న వివరాలు చదివితే తాను చెప్పిన వాస్తవాలు బోధపడగలవని బ్రాడ్‌లాఫ్‌కు మోతీలాల్ చెప్పారు కూడా బ్రాడ్‌లాఫ్ అంగీకరించి జీవితాంతం భారతదేశపు ప్రయోజనాల్ని బలపరుస్తూ వచ్చారు దిగువ సభలో భారతదేశానికి సంబంధించిన ప్రశ్నలలో ప్రభుత్వాన్ని తికమక పెట్టిన కొద్దిమంది బ్రిటిష్ పార్లమెంటేరియన్‌లలో బ్రాడ్‌లాఫ్ ఒకరు ఇంతకు ముందు ప్రస్తావించిన కాశ్మీర్ సమస్యను కూడా పట్టించుకునేటట్టు బ్రాడ్‌లాఫ్‌ను మోతీలాల్ ముందు ప్రస్తావించిన కశ్మీర్ సమస్యను కూడా పట్టించుకొనేటట్టు బ్రాడ్‌లాఫ్‌ను మోతీలాల్ ఒప్పించారు. అందుకు ఆయిన చాలా పట్టుదలతో వ్యవహరించవలసి వచ్చింది ఒక ఉగ్రవాదిగా బ్రాడ్‌లాఫ్ ఒక భూస్వామ్య రాజును ఎట్టి పరిస్థితులలోను సమర్థించడానికి అనుకూలంగా లేరు. ఆదిలో ఆ వ్యవహారంలో తలదూర్చడానికి ఆయన నిరాకరిస్తూ పదవీచ్యుతి పొందిన కాశ్మీర్ మహారాజా సంబంధిత పత్రాలను నేరుగా తనచేతిలో వుంచడానికిఇష్టపడడని సందేహంవెలిబుచ్చాడు. ఆరాష్ట్ర ప్రజలు తమ రాష్ట్ర సమగ్రతను కాపాడుకోదలచారని, అందుచేత సహాయానికి అర్థించినది ఆ రాష్ట్ర ప్రజలే తప్ప మహారాజా కాదని మోతీలాల్ ఆయనకు నచ్చచెప్పి ఒప్పించారు. ఈ ఆఖరి సంవాదం తరువాత బ్రాడ్‌లాఫ్ తుది నిర్ణయానికి వచ్చారు. బ్రిటన్ పార్లమెంటు దిగువ సభలో బ్రాడ్‌లాఫ్ తీర్మానాన్ని టోరీ మెజారిటీ ఓడించినప్పటికీ కాశ్మీర్ మహారాజా తిరిగి పదవిలోనికి రావడానికి అది దోహదపడింది.

# 7. మలిమార్పు

పెళ్ళి అయి బాలికలు దాంపత్య సుఖానికి ఒప్పుకొనే వయఃపరిమితి 10 ఏండ్ల నుంచి 12 ఏండ్లకు పెంచటానికి 1891లో ప్రభుత్వం చేసిన ప్రతిపాదన తీవ్ర సంచలనాన్ని రేకెత్తించింది. ఒక వివాహిత యువకుడు ఇంకా పుష్పవతికాని పిన్న వయసు గల తన భార్యతో దాంపత్యాన్ని నెరపబోగా ఆ బాలిక తీవ్రమైన రక్తస్రావానికి గురిఅయి మరణించడం, నిందితుడైన భర్తకు శిక్షపడటం జరిగింది. ఈ సంఘటన దృష్ట్యా ప్రభుత్వం పై ప్రతిపాదన చేసింది. అమృతబజార్ పత్రిక కూడా సనాతన వాదులతో చేరి ఈ బిల్లును నిరసించింది. అయితే చిన్నపాటి సంఘసంస్కరణలను కూడా సహించేతత్వం లేకకాదు ఈ విషయంలో వారి వాదం ఇలా ఉంది; యూరోపియన్ ప్రత్యేక హక్కులను తొలగించనప్పుడు (ఇల్‌బర్ట్ బిల్లు ఓటమి ఉదాహరణ) ప్రభుత్వ చర్యద్వారా భారతీయులపై ఎందుకు ఆంక్షలు విధించాలి? ప్రజల అభిప్రాయాలు అనుకూలిస్తే తప్పై అటు వంటి చర్య తీసుకోకూడదు. ప్రజలే కోరే పర్యంతం అటువంటి బిల్లు చేయకూడదు. రెండో కారణం - పోలీసు సంస్కరణ ప్రతిపాదనలోని కొన్ని తీవ్రమైన అంశాల నుంచి ప్రజల దృష్టిని మరల్చేందుకు ఈ బిల్లు ఒక ప్రయత్నమని వారు సందేహించారు. మూడో కారణం ఈ బిల్లు పట్ల జనబాహుళ్యం చాలా తీవ్రంగా వ్యతిరేకత వ్యక్తం చేసినందువల్ల ఈ అంశం మీద బహిరంగ సభలు, ప్రదర్శనలు నిర్వహించడం ద్వారా అప్పుడే మొదలైన జాతీయవాద రాజకీయోద్యమాన్ని ఉధృతం చేయవచ్చు. పత్రిక సూచనల మేరకు ఈ అంశంపై భారీఎత్తున బహిరంగ సభలు జరిగాయి. ఏది ఏమైనప్పటికీ ఈ బిల్లు చట్టంగా రూపొందింది.

జనబాహుళ్యాభిప్రాయాన్ని ఎంతమాత్రం ఖాతరు చేయని ప్రభుత్వ వైఖరి పట్ల ఆందోళన చెందే బెంగాలీ నాయకులు దైనందిన సమస్యలపై ప్రజాభిప్రాయానికి వేదికగా దినపత్రిక ప్రారంభించాలన్న ఒక సూచనకు అనుకూలత కనబరచారు.

"హిందూ పేట్రియట్" అనే పత్రిక ఈ సూచన చేసింది. "అమృతబజార్" వార పత్రికను దినపత్రికగా మార్చాలని ఘోష్ సోదరులపై తీవ్ర ఒత్తిడి వచ్చింది. కాని ఆ తరుణంలో ఘోష్ సోదరులు ఆర్థికంగా అంత హెచ్చరికగా లేరు. నోటికి చేయి అందితే చాలన్న స్థితి దినపత్రిక నడపడానికి ఎక్కువగా ఖర్చు చేయడానికి వారు తటపటాయించారు. కాని ప్రజల నుంచి విజ్ఞప్తులు పెరిగిపోయాయి. మిత్రులు, అభిమానులు కూడ బలవంతపెట్టారు పత్రికను దిన పత్రికగా మార్చకపోతే మా బ్రతుకు దుఃఖమయం చేసుకుంటాం అని కొందరు బెదిరించారు కూడా. ఆఖరుకు ఘోష్ సోదరులు ఒప్పుకున్నారు. తమ వద్ద ప్రింటింగ్ సరంజామా తగినంత లేనప్పటికీకూడా రంగంలోకి దిగారు." (పి.దత్) అలా, 1891 ఫిబ్రవరి 19న "అమృతబజార్" ఆంగ్ల దినపత్రిక రూపంలో ప్రత్యక్షమైంది. ప్రజామద్దతు అపారం కాగా వాళ్లు కార్యరంగంలో మరింతగా నడుం కట్టారు. పత్రికని దినపత్రికగా మార్పిడి చేయడం, ప్రజాందోళన ఈ రెండూ మోతీలాల్ మనస్సులో బాగా ముద్ర వేశాయి. రాజకీయ ఉద్యమంతో సంఘసంస్కరణలను ముడి పెట్టాల్సిన అవసరాన్ని లోతుగా గుర్తించారు. అనంతర దశాబ్దంలో శ్రీ బాలగంగాధర తిలక్, ఆ తరువాత 1920 ప్రాంతంలో మహాత్మాగాంధీ రాజకీయ ఉద్యమంలో సంస్కరణ ఆవశ్యకత బాగా ప్రచారం చేశారు.

ఎన్నికల ద్వారా ప్రాతినిధ్యం కల్పన సూత్రానికి సావకాశం కల్పించబడిన రంగం మునిసిపాలిటీలు ఒక్కటే. బెంగాల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కి ప్రతినిధిని పంపే అధికారం 1892 చట్టం క్రింద కలకత్తా మునిసిపాలిటీ ఒక్కదానికే ఉంది. అదే సంవత్సరం కలకత్తా మునిసిపల్ ఎన్నికల్లో పోటీ చేయాలని మోతీలాల్ నిర్ణయించుకున్నారు. అమృతబజార్ పత్రిక సంపాదకుని అభ్యర్థిత్వాన్ని విస్తృతంగా ప్రజలు, పత్రికలు బలపరిచాయి. కలకత్తా ఉత్తర భాగాన ఆయన పోటీ చేసిన 1వ నెం.వార్డు ప్రత్యేకంగా భారతీయులు నివసించే ప్రాంతం. ఈ ప్రాంతంలో ఉన్నత కాయస్థ కుటుంబాలు ఎక్కువ. ఏ లోటూలేని ఉన్నత మధ్యతరగతి ఓటర్లపై ఈ ఉన్నత కాయస్థ కుటుంబాల ప్రభావం అధికం. మోతీలాల్ అభ్యర్థిత్వానికి పత్రికల నుంచి గట్టి మద్దతు లభించగా, ఆయన ప్రత్యర్థులు పశుపతినాథ బసు, భూపేంద్రనాథ్ బసు సంపన్నులు. తదనంతరం భూపేంద్రనాథ్ ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడయ్యారు. పశుపతినాథ్ జమీందార్ కాగా, భూపేంద్రనాథ్

సొలిసిటర్ మోతీలాల్ ఆ ప్రాంతానికి క్రొత్తగా వచ్చినవాడు, కనీసం సొంత ఇల్లయినా లేనివాడు. ఆయన ప్రత్యర్థులలో జమీందార్ పశుపతినాథ్ బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్‌లో ప్రముఖుడు. భూపేంద్రనాథ్ ప్రముఖ మితవాద రాజకీయవాది. ప్రతిష్ఠాకరమైన పోటీ జరిగింది. అభ్యర్థుల పూర్వాపరాలకు ప్రాముఖ్యత ఇవ్వబడింది. ప్రత్యర్థులు ఓటర్లకు ప్రయోజనాలు చేకూరుస్తామని చాలా వాగ్దానాలు చేశారు. స్థానికంగా గల ఉన్నత కుటుంబికులతో మైత్రీ సంబంధాలను ఓటర్లకు కలిగించారు. కాగా మోతీలాల్ ఇచ్చిన వాగ్దానం ఒక్కటే. చేతనైనంత సమాజసేవ చేస్తానని. అందువల్ల మోతీలాల్ ఓడిపోయారు. స్టూడెంట్స్ అసోసియేషన్ సమావేశంలో ఓ మిత్రుడు పలికినట్లు "మోతీలాల్ ఎందుకు ఓడిపోయారంటే ఓటర్లకు ఆయన విలాసవంతమైన విందు భోజనాలు అమర్చలేదు. డబ్బు దస్కాలు గుప్పించి ఓట్లు కొనే స్థితికి దిగజారలేదు అమృతబజార్ పత్రిక శక్తివంతమైన భూమిక వహించి బెంగాల్ ప్రజలకు తమ స్వంత వ్యక్తిని కమీషనర్‌గా ఎన్నుకొనే హక్కు కల్పించింది. చివరకు అది కూడ ఆయన ఓటమికి కారణం." ఈ ఎన్నికల్లో ఎదురైన అనుభవం దృష్ట్యా మోతీలాల్‌కు ఎలక్షన్లలో నిలబడాలన్న కోరిక పూర్తిగా అణిగి పోయింది అని చెప్పవచ్చు. అయితే కలకత్తాలో ప్రముఖుల మధ్య ప్రధానంగా బ్రహ్మసమాజ వాదులు, మితవాదుల మధ్య గల వివాదాలు ప్రభుత్వం కొత్తగా చేసిన దాంపత్య అంగీకార వయఃపరిమిత చట్టాలపై భేదాభిప్రాయాలు చాలా తీవ్ర స్థాయికి చేరుకున్నాయి. బ్రాహ్మోవాదం, బ్రాహ్మోవాదుల గురించిన దీర్ఘకాలపు ప్రచారానికి ఈ వివాదాలు తోడ్పడ్డాయి. మధ్యేమార్గాన్ని అవలంబిస్తూ వచ్చిన హితవాద పత్రిక సయితం బ్రాహ్మలపై రాతమూలకమైన దాడి సాగించటానికి అలవాటు పడింది. అటువంటి ఒకానొక రచనలో ఆ పత్రిక ఒక ప్రముఖ బ్రాహ్మోవాది భార్యపై దారుణమైన అభియోగాలు గుప్పించడంతో ఆ బ్రాహ్మోవాది పరువునష్టం దావా వేశారు. ఆ తరుణంలో ప్రావిన్షియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడైన సురేంద్రనాథ్ బెనర్జీ మోతీలాల్‌ఘోష్ ఒక డ్రయినేజీ బిల్లు పన్నుల ప్రతిపాదనపై విభేదిస్తూ ఉన్నారు. మోతీలాల్ అప్రతిష్ఠపాలైన వనిత తరపున నిలబడగా, సురేంద్రనాథ్ హితవాది సంపాదకుడు కాళీప్రసన్న కావ్య విశారదను బలపరిచారు. ఆ ఎడిటర్ సురేంద్రనాథ్ నీడలో ఉన్న వ్యక్తి. అయితే ఈ కేసు కోర్టు కెక్కడాన్ని

మోతీలాల్ సమర్థించలేదు. కాళీప్రసన్న కావ్యవిశారద క్షమాపణ చెప్పటం ద్వారా రాజీకి ఆయన సూచించారు. కావ్య విశారద క్షమాపణ ఇవ్వనన్నారు కోర్టులో కేసుపై విచారణ సాగి కాళీప్రసన్న కావ్యవిశారద నేరస్థుడుగా నిర్ధారణ అయింది దీనితో మోతీలాల్‌పై కాళీ ప్రసన్న కావ్య విశారద కక్ష పెంచుకున్నారు. జైలు నుంచి విడుదల కాగానే తన పత్రికలో మోతీలాల్‌పై వ్యతిరేక ప్రచారం మొదలుపెట్టారు. ఆయనది చాలా పదునైన కలం. అయితే విమర్శించే ముందు నిజానిజాలు విచారించే అలవాటు లేదు. పైగా ప్రైవేటు వ్యక్తులను విమర్శించడంలో చట్టపరమైన పరిమితులు పాటించేవారు కాదు. ఆఖరుకు 1889 లో ఆయనపై పరువు నష్టం దావా వేయాలని ఘోష్ సోదరులు నిర్ణయించారు ప్రతిగా కావ్య విశారద కూడా ఘోష్ సోదరులపై పరువు నష్టం దావా వేశాడు. కావ్య విశారద కేసు హైకోర్టు కెక్కింది. క్షమాపణ చెప్పడానికి ఆయన బలవంతంగా సంసిద్ధత ప్రకటించడం, భూపేంద్రనాథ్ బసు వత్తిడిపై అయిష్టంగానే మోతీలాల్ దానిని సమ్మతించడం జరిగింది. బసుతో ఆయనకు అప్పుడు సన్నిహిత మైత్రి ఉంది. 1901 లో కాన్పూరు వద్ద వలస కూలీల యూరోపియన్ అధికారి హోఫ్ "అప్రతిష్ఠాకరమైన దుష్ప్రచారంతో కూడిన విధంగా" రాసినందుకు అమృతబజార్ పత్రిక సంపాదకుడిగా మోతీలాల్‌పై దావా వచ్చింది. కావ్య విశారద వెంటనే హోఫ్‌కు మద్దతుగా రంగంలోకి దిగారు అభిశంసనకు గురి అయి పత్రిక ఎడిటర్ మోతీలాల్ అని రుజువు చేయడానికి కావ్య విశారద హుటాహుటిన కలకత్తా నుంచి కాన్పూరుకు తరలి వెళ్ళారు. అయితే ఆయన తెచ్చిన సాక్ష్యాధారాలు కోర్టు స్వీకరించలేదు. ఆ అవసరం కూడా లేదు. ఎందుకంటే - మోతీలాల్ తమ పత్రిక సంపాదకీయ వ్యాఖ్యలో ప్రస్తావించిన అంశాలకు తనదే బాధ్యతని స్వయంగా అంగీకరించారు. ఈ కేసు ఉత్పన్నం కావడానికి పూర్వాపరాలు; హోఫ్‌పై అలహాబాద్‌లో ఒక కేసులో విచారణ సాగి ఆయన నిర్దోషిగా విడుదల అయ్యారు. ఒక మార్వాడీ స్త్రీని అక్రమంగా నిర్బంధించి ఆమె నగా నట్రా దోచుకొన్నట్టు హోఫ్‌పై ఆరోపణ దాఖలయింది. ఈ కేసులో 9మంది సభ్యుల న్యాయపీఠం హోఫ్‌ను విడుదల చేస్తూ మెజారిటీ తీర్పు యిచ్చింది. జ్యూరీలో ఆరుగురు సభ్యులు అతనిని నిర్దోషిగా ప్రకటించగా, ముగ్గురు సభ్యులు అతను దోషి అని తేల్చారు. స్వయంగా న్యాయమూర్తి కూడా మైనారిటీ తీర్పులో ఏకీభవించారు. జ్యూరీ సభ్యులు,

న్యాయమూర్తి అందరూ యూరోపియనులే నిందితుడు యూరోపియనే. ఈ కేసు మళ్ళీ విచారించాలని న్యాయమూర్తి ఆదేశించలేదు. "వేరే జ్యూరీలో కూడా అందరూ యూరోపియనులే ఉండాలి కనుక పునర్విచారణ వల్ల ఫలితం లేదు. అందుకే పునర్విచారణకు ఆదేశించడం లేదు" అని న్యాయమూర్తే స్వయంగా ప్రకటించారు. ఈ ఉదంతంపై పత్రిక వ్యాఖ్యానిస్తూ "గౌరవనీయ న్యాయమూర్తి ఏమని సెలవిచ్చారంటే నిందితుడు యూరోపియన్ అయినప్పుడు కేసు విచారించటానికి అంతా యూరోపియన్‌లతో ఏర్పడే జ్యూరీ అతనిని ఎట్టి పరిస్థితులలోను శిక్షించదు కనుక పునర్విచారణ అనవసరం అన్నారు." అయితే ఈ కేసులో హాప్‌పై హేయమైన క్రిమినల్ ఆరోపణ లేనందువల్ల పొరపాటున ఈ వార్త ప్రచురించడం ద్వారా హాప్‌ను బాధించినందుకు పత్రిక విచారం ప్రకటించింది. హాప్ సంతృప్తి చెందక మోతీలాల్ పైన, ముద్రాపకునిపైన పరువు నష్టం దావా వేశాడు. పత్రికలో ఈ వార్త అచ్చయినపుడు ఊళ్ళోలేనని, కోర్టుకు మోతీలాల్ రుజువులు చూపుతూ నివేదించుకొన్నారు. ఇదే ఆరోపణపై "ది బెంగాలీ పత్రిక" ఎడిటర్ సురేంద్రనాథ్ బెనర్జీని కూడా ప్రాసిక్యూట్ చేశారు.

ఆయన కూడా అదే ఎలిబీ కోర్టుకు నివేదించగా, ఆయన ఎలిబీని అంగీకరించి మోతీలాల్ ఎలిబీని కోర్టు ఆయనకు 1000 రూ॥లు జుల్మానా విధించింది. మోతీలాల్ సెషన్స్ కోర్టుకు అప్పీలు చేసుకొని నిర్దోషిగా విడుదలయ్యారు. దిగువ కోర్టు ఇచ్చిన తీర్పును, నిందితుని పట్ల ప్రవర్తించిన తీరును మొత్తం పత్రికాలోకం ఘాటైన విమర్శలతో తీవ్రంగా ఖండించింది. "ది స్టేట్స్ మెన్" పత్రిక నిశితంగా విమర్శిస్తూ "జాయింట్ మేజిస్ట్రేట్ తనకు ఎదురులేదన్న రీతిలో యిష్టానుసారంగా వాడిన పదజాలం ప్రసక్తి అటుంచితే, ఆయన కార్యకారణ విచారణ చాలా గజిబిజిగా వుండి, న్యాయశాస్త్రంలో ఆయన సామర్థ్యం ఏపాటిదన్న అనుమానాలు రేకెత్తిస్తోంది." అని వ్యాఖ్యానించింది జ్యూరీ పద్ధతి విచారణను మోతీలాల్ గట్టిగా సమర్థిస్తారు. అయితే జాతి, వర్ణ, విచక్షతలతో నిందితుడు యూరోపియన్ అయినప్పుడు పూర్తిగా నిందితుణ్ణే సమర్థించే ఏకపక్ష జాత్యహంకార జ్యూరీలను ఆయనెన్నడూ సమర్థించలేదు. భారత జాతీయతా వాదం తరువాత శతాబ్దపు ప్రాంగణాన రూపుదాల్చడానికి దోహద పడ్డ అనేక అంశాలలో హాప్ కేసు ఒకటి.

# 8. రాజకీయ దక్షత

**కాం**గ్రెసులో చేరటానికి ఏ ఏ అంశాలు ప్రేరణ కలిగించాయో మోతీలాల్ ముందు ముచ్చటించుకున్నారు.విద్యావంతుల్ని గాఢంగా ప్రభావితం చేస్తూ వచ్చిన సురేంద్రనాథ్‌తో పాటు మోతీలాల్ వివిధ కోణాలనుంచి జాతిని జాగృతం చేయడానికి కృషి చేశారు. ఈ అంశంలో వివిధ దృక్కోణాలకు చెందిన భిన్న స్వరాలు ఉద్యమంతో పెరుగుతూ వచ్చి 1906లో స్పష్టమైన దశకు చేరుకొన్నా 1888లోనే అవి మొలకెత్తాయని చెప్పాలి. హితవాదులు ప్రజల కొరకు ప్రజలు నెరపే పర్యవేక్షణలో దేశం పాలనాధికారాన్ని ఇంగ్లీషు వారితో సమానంగా పంచుకోవాలని విశ్వసిస్తూ రాగా, విదేశీయుల ప్రమేయం లేకుండా ఎన్నికైన ప్రతినిధులతో ఏర్పడే పార్లమెంటు ద్వారా ప్రజలే ప్రభుత్వాన్ని నడిపించే పాలనా వ్యవస్థను ఉగ్రవాదులు కోరుతూ వచ్చారు. వీరితో మితవాదులకు చుక్కెదురు. వేరే మాటల్లో చెప్పాలంటే మితవాదుల విశ్వాసం సంపన్నులు, మేధావుల స్వార్థ ప్రయోజనాలకు అనువుగా ఉంది. ఉగ్రవాదుల అభిప్రాయం సామాన్యుల ప్రయోజనాలను పరిరక్షించేదిగా వుంది. లక్ష్య సాధనకు కావలసిన నిజాయితీ, చిత్తశుద్ధి విషయంలో ఒకదాని కొకటి దీటైనవే అనడంలో సందేహం లేదు. బెంగాల్‌లో మితవాదుల శిబిరానికి సురేంద్రనాథ్, ఉగ్రవాదుల శిబిరానికి మోతీలాల్ సారథులు నాటి సమకాలీన అంశాలన్నింటా వారి భిన్న స్వరాలు తరచూ వినబడుతూ ఉండేవి.

మహారాష్ట్రలో కూడా ఇదే విధమైన భేదాభిప్రాయాలు కానవచ్చేవి. శిశిర్‌కుమార్ ఘోష్ శిష్యుడనని సవినయంగా చెప్పుకున్న బాలగంగాధర తిలక్ ఉగ్రవాదుల అభిప్రాయానికి సారథ్యం వహించారు స్థూలదృష్టితో చూస్తే అపారమైన మేధాసంపత్తి కలిగి వున్నప్పటికి కార్యరంగంలో అంతగా ఉత్సుకత లేని మితవాద నాయకులు గోపాలకృష్ణ గోఖలేతో తిలక్ విభేదించారు. శ్రీ

అరబిందో, బిపిన్ చంద్రపాల్, లాలా లజపతిరాయ్, సర్దార్ అజిత్‌సింగ్ తదితరుల చేరికతో ఉగ్రవాద శిబిరంలో కార్యదక్షత లోపం తొలగిపోయి, ఆశయాత్మకమైన నిర్దుష్ట పంథా ఏర్పడింది. బెంగాల్‌లో ప్రావిన్షియల్ పొలిటికల్ కాన్ఫరెన్సులు (రాష్ట్రస్థాయి రాజకీయ మహాసభలు) ఏర్పాటు నిర్ణయానికి కారణభూతమైన అంశాలు ముందే చర్చించుకున్నాం. అట్టి మొదటి మహాసభ 1888లో సురేంద్రనాథ్ తిరుగులేని నాయకత్వానగల ఇండియన్ అసోసియేషన్ ఆధ్వర్యాన కలకత్తాలో జరిగింది. ఆ సభ బెంగాల్ 'కాంగ్రెస్ శాఖ' నిర్వహించింది మరింత విస్తృతంగా ప్రజాభిప్రాయానికి ప్రాతినిధ్యం కల్పించాలన్న లక్ష్యంతో జిల్లాలు, పట్టణాలలోను కూడా ఈ సభను జరపాలని నిర్ణయించారు. 1895 నుంచి వివిధ పట్టణాలలో ప్రత్యేకంగా నెలకొల్పిన పందిరి క్రింద జరిగిన సభ ఆఖరి రోజున ఆరు నిమిషాల పాటు బెంగాల్ అంతటా తీవ్రమైన భూకంపం సంభవించి మొత్తం పట్టణం అపార నష్టానికి గురి అయింది. కాని మోతీలాల్ సభ గురించి వ్రాస్తూ, "భూకంపం సంభవించిన అర్థగంట తరువాత, ఆందోళన పూర్తిగా సద్దు మణగకుండానే, ప్రతినిధులంతా మహాసభలో మిగిలివున్న కార్యక్రమం పూర్తిచేయడానికి తిరిగి తమ తమ స్థానాల్లో కూర్చున్నారు" అని పేర్కొన్నారు

1896వ సంవత్సరం పశ్చిమ భారతదేశంలో తీవ్రమైన కరువుకాటకాలు సంభవించి ప్లేగువ్యాధి ప్రబలింది తిలక్ నిర్విరామంగా కరువు, వైద్య సహాయ కార్యక్రమాల్లో పాల్గొన్నాడు ప్రభుత్వం చేపట్టిన ఈ సహాయ కార్యక్రమాలలో మరుకుగా పాల్గొంటూనే, శివాజీ ఉత్సవం నిర్వహించారు ప్రభుత్వం చేపట్టిన ప్లేగు నివారణ చర్యలు బ్రిటిష్ సైన్యం పర్యవేక్షణలో చాలా దుందుడుకుగా, మొరటుగా అమలు కావడంతో 1899లో చేప్కార్ అనే ఇద్దరు మరాఠీ యువకులు కెప్టెన్ రాండ్, లెఫ్టినెంట్ ఆయేర్స్ట్ అనే ఇద్దరు సైనికాధికారుల్ని హత్యచేశారు. నేరస్థులపై చాలా వేగంగా విచారణ సాగించి ఉరిశిక్ష అమలు చేశారు భారతీయులలో ఈ విచారణ పట్ల దిగ్భ్రమ, తీవ్ర ఆగ్రహావేశాలు చోటు చేసుకున్నాయి. ఆ ఇద్దరి యువకుల ధైర్య సాహసాలను ప్రశంసిస్తూ తిలక్ తన "కేసరి" పత్రికలో పరంపరగా వ్యాసాలు రాశారు. దౌర్జన్యాన్ని ప్రేరేపించే రాతలు రాసినందుకు బొంబాయి ప్రభుత్వం తిలక్‌ను ప్రాసిక్యూట్ చేసింది ఈ కేసులో తిలక్ తరపున వాదించటానికి ప్రముఖ న్యాయవాది ఆర్డర్ పఫ్ అనే ప్రముఖ బారిష్టర్‌ను బెంగాల్

నుంచి పంపారు. ఆర్డర్ ఏఫ్‌కు బొంబాయి న్యాయవాది దేవర్ సహాయకుడుగా వ్యవహరించారు. తొమ్మిదిమంది సభ్యుల జ్యూరీలో ఆరుగురు యూరోపియన్ న్యాయమూర్తులు ఆయనను దోషిగా నిర్ణయించి 18 నెలల జైలుశిక్ష విధించారు. తిరిగి అప్పీలు చేసుకొనే వీలు కల్పించలేదు. తిలక్ మిత్రులు కొందరు క్షమాపణ చెప్పి శిక్ష తప్పించుకోవలసిందిగా సూచించారు. అమృతబజార్ పత్రిక ఆ సలహా ఖండించింది. తిలక్ క్షమాపణలు చెప్పరాదని అభిప్రాయపడింది.

"ఎందుకంటే మొదటి కారణం ఆయన రాసిన దాంట్లో రెచ్చగొట్టే ధోరణి ఏమీ లేదు. రెండవది రాజకీయాల్లో తలదూర్చిన వాళ్ళు కష్టనష్టాలకు తలక్రిందులై పోకూడదు ... సూక్ష్మంలో చెప్పాలంటే మహారాష్ట్రలోనే ఉండటం కోసం తనని తానే అవమానించుకునే స్థితికి దిగజారడం కంటే ఆయన అండమాన్‌లో వుండటమే నయం."

రాజీ పరిష్కార ప్రతిపాదన ఒకటి తిలక్‌కు అందినపుడు ఆయన చాలా బాధపడ్డారు. ప్రభుత్వంతో పోరాడటం ద్వారా ఆయన సాహసం లోకానికి రుజువవుతుంది గదా అని ఈ సలహా ఇవ్వటం లేదు. సొంత భద్రత గురించి ఆలోచించి లొంగిపోయానన్న అపవాదు నెత్తిన వేసుకోవడానికి ఆయన సిద్ధంగా లేరు. మోతీలాల్‌కు తిలక్ రాసిన లేఖ ఈ మొత్తం వ్యవహారానికి స్పష్టమైన ఆకృతి యిస్తూ ఇలా సాగింది.

"తప్పు చేశానని ఒప్పుకోవడం వంటిదేదో నేను చేయాలని ప్రత్యర్థి వర్గం ఆశిస్తోంది. అందుకు నేను సిద్ధంగా లేను. ప్రజల మధ్య నా స్థానం నా ప్రవర్తన మీద ఆధారపడి వుంటుంది. ఈ ప్రాసిక్యూషన్ వ్యవహారంలో వాళ్ళకు నేను తలవొగ్గితే నా హృదయపు అంతరాంతరాళాల్లో నా పాలిట మహారాష్ట్రయే అండమానై నన్ను శిక్షిస్తుందని నాకు తెలుసు - ఇప్పుడు జ్యూరీ ముందున్న నా కేసు చాలా బలహీనమైన కేసే అని కూడా నాకు తెలుసు-

పూనా నాయకుల్ని అప్రతిష్టపాలు చేయడమే వాళ్ళ లక్ష్యం ...ఒక విషయం గుర్తుంచుకోవాలి, మనమందరం ప్రజలకు సేవచేసే వాళ్లం. చాలా కీలకమైన తరుణంలో మనం చాలా దయనీయంగా మన ధైర్యాన్ని కోల్పోతే, మనం వాళ్లని మోసం చేసినట్లే. వాళ్లెంతో అసంతృప్తికి లోనవుతారు. అదంతా అటుంచుదాం. నిజాయితీపరుడుగా, గౌరవనీయ వ్యక్తిగా నేను చేయని నేరాన్ని చేసినట్లు ఎలా

ఒప్పుకుంటాను? ఒకవేళ ఈ కేసులో నాకు శిక్ష పడితే నా దేశప్రజల సానుభూతి నా కష్టకాలంలో నాకు అండగా నిలుస్తుంది."

కాని తిలక్‌కు విదేశాల్లో కూడా అధికారం గల మిత్రులు అనేకులున్నారు. తిలక్ ఏడాదిపాటు జైలుశిక్ష అనుభవించిన తరువాత ప్రొఫెసర్ మాక్స్ ముల్లర్, సర్ విలియం హంటర్ జోక్యంతో విడుదలయ్యారు. తిలక్ ఊహలు నిజమయ్యాయి. ఆయనను మళ్లీ అవినీతి, కోర్టును తప్పుదోవ పట్టించటానికి ప్రయత్నించడం, ఫోర్జరీలాంటి కేసులు బనాయించారు కేసు విచారణ చాలా కాలం సాగి వీగిపోయింది. తిలక్‌పై సాగిన ఈ కేసు దృష్ట్యా 1897 లో తిరుగుబాటును పురిగొల్పే కార్యకలాపాల చట్టం నిబంధనలు మరింత కట్టుదిట్టం చేశారు. ప్రజాభిప్రాయం తీవ్రంగా వ్యతిరేకించినప్పటికీ లక్ష్యపెట్టకుండానే సెక్షన్(124 ఎ)ను తిరిగి నిర్వచించడం ద్వారా, సెక్షన్ 153 (ఎ)లో అదనంగా మరో సెక్షన్ని పొందుపరచడం ద్వారా సెక్షన్ 505లో సవరణలు ప్రవేశపెట్టడం ద్వారా చట్టాన్ని కట్టుదిట్టం చేశారు. లెఫ్టినెంట్ గవర్నరు మెకంజీ దాపరికం లేకుండా ఒక విషయం చెప్పారు. "స్వీయ రక్షణకు" ఈ చర్య అవసరమైందన్నారు "స్వీయరక్షణ ఏ ప్రభుత్వానికైనా, ప్రధానంగా అది విదేశీ ప్రభుత్వము అయినప్పుడు తప్పనిసరి విధి" అని పేర్కొన్నారు. లండన్ నుంచి వెలువడే "ది డైలీ క్రానికల్" పత్రికలో ఈ తిరుగుబాటు కార్యకలాపాల చట్టం తయారీపై లిబరల్ పార్టీ వ్యాఖ్య ప్రభుత్వ విధానాలపై చాలా చక్కని ఎత్తిపొడుపు: "భారత దేశంలో 'తిరుగుబాటు ప్రేరేపణ' పేరిట జరుగుతున్న విచారణలలో ప్రధానంగా చూడవలసిన దృశ్యం ఒకటి ఉంది. అది "అయిష్టతకు" జస్టిస్ స్ట్రాచే యిచ్చిన 'క్రొత్త నిర్వచనం' ప్రభుత్వం చేసిన తప్పును గట్టిగా నిరసించిన సందర్భాలలో కూడా 'అయిష్టతను' తిరుగుబాటు ప్రేరేపణగా పరిగణించాలని ఆయన నిర్వచించారు. చట్టానికి అటువంటి వ్యాఖ్యానాన్ని ఇంగ్లండ్ అయితే ఎంతమాత్రమూ సహించదు అని మేము గట్టిగా చెప్పగలం. భారతదేశంలో కూడా ఈ వక్రభాష్యాన్ని తొందరలో ఉపసంహరించుకో పోతే తన పొరపాటుకు ప్రభుత్వం దుఃఖించవలసివస్తుంది."

ఈ రాక్షస చట్టం కూడా సరిపోలేదు. బ్రిటిష్ ప్రభుత్వానికి అవిధేయులుగా వున్న భారతీయ రాజులని లొంగదీయడానికి 1818లో రెగ్యులేషన్ 3 పేరిట జారీ చేసిన ఆర్డినెన్సుని ప్రభుత్వ 'ఆయుధాగారం" నుంచి వెలికితీసి బూజు దులిపి

తిరుగుబాటును ప్రేరేపించే ఉద్యమంపై ప్రయోగించ పూనుకున్నారు. 1897 జూలై 20న చపేకార్ బ్రాహ్మణ యువకులైన ఇద్దరు నాతూ సోదర్లను ఈ రెగ్యులేషన్ క్రింద అరెస్టు చేసి "విచారణ లేకుండా నిర్బంధంలో ఉంచారు. పార్లమెంటులో ఈ విషయంపై వచ్చిన ప్రశ్నకు బ్రిటన్ విదేశాంగమంత్రి జవాబిస్తూ వారిపై క్రిమినల్ అభియోగాన్ని చేయడానికి తగినంత సాక్ష్యాధారాలు లేవని వెల్లడించారు. మోతీలాల్ ఈ ఉదంతంపై రాస్తూ "నాతూ సోదరులను కెప్టెన్‌రాండ్ హత్యతో సంబంధం ఉన్న వ్యక్తులుగా చూపి ముందుగా అరెస్టు చేశారు. దామోదర్ చపేకర్ వారిని విడిపించుకు వెళ్ళడానికి ముందుకు వచ్చినపుడు మరో కారణం చూపారు. ఆ సోదరులలో ఒకరు ట్రిక్కులు పన్నాడన్న కారణంపై వారిని విడుదల చేయబోమని సాకు చెప్పారు. వారు నేరం చేసినట్టు రుజువైందని ఇప్పుడు మనకు చెబుతున్నారు. ఆ నేరం స్వరూప స్వభావాలు ఏమిటో లార్డ్ జార్జ్ హమిల్టన్ తానే చెప్పలేకపోతున్నారు." రాబోవు శతాబ్దంలో ప్రజలకు సారథ్యం వహించిన వారిని తిరుగుబాటుదారుల నాయకులను కారాగారంలో పెట్టడానికి ఈ చట్టమే పెద్ద ఆయుధంగా మారింది. పూర్వాపరాలు ఆలోచిస్తే ప్రభుత్వానికి ఒక అనుమానం తోచినట్లు కనబడుతోంది. మహారాష్ట్రలో బ్రిటిష్ ప్రభుత్వాన్ని పడగొట్టడానికి అజ్ఞాత ఉద్యమం ఒకటి బయలుదేరి బాగా బలం పుంజుకొన్నట్లు, పైకి చట్టరీత్యా దాఖలాలు లేకపోయినా బ్రిటిష్ ప్రభుత్వం అనుమానించింది నిజానికి మహారాష్ట్రలో అటువంటి విప్లవకారుల ముఠా ఏర్పడింది. దేశ ప్రయోజనాల కోసం శత్రు సంహారం హర్షణీయం అని బోధించేది. ఆ సందేశాన్ని బలపరిచే గీతా శ్లోకాలను, బంకింగ్‌చంద్ర, తిలక్ తదితరుల నోటి మీదుగా విని ప్రభావితులైనవారు అందులో చేరారు. బరోడాలో ప్రొఫెసర్‌గా ఉన్న అరవిందఘోష్ కూడా తిలక్‌తో సంబంధాలు ఒక ప్రక్క ఈ విప్లవకారుల ముఠాతో సంబంధాలు మరి ఒక ప్రక్క బలపడుతూ వచ్చాయి. 1902 ప్రాంతంలో బెంగాలీ విప్లవకారుల ముఠాలను కార్యరంగంలోకి దించడంలో అరవిందఘోష్ పాత్ర అందరికీ తెలిసిందే. నాతూ సోదరుల నిర్బంధం జాతీయవాదాన్ని ఇరువైపులా పదునెక్కించిన ఒక తుది అంకం. ప్రభుత్వపు అణచివేత చర్యలు తీవ్రం కావడంతో ఉగ్రవాద జాతీయోద్యమం విస్తరించింది.

ఈ కొత్త పరిణామం తిలక్ నోటిమీదుగా మోతీలాల్‌కి తెలిసే వుండాలి. అదీకాక ఇటలీ ఐరిష్ విప్లవకారుల కార్యకలాపాలు బెంగాల్‌లో అప్పుడు ప్రముఖంగా చర్చకు వస్తూ వుండేవి. అందువల్ల ఉత్పన్నమయిన ధోరణులు కూడా తిలక్‌కు సుపరిచితాలే. ఆయన వైఖరిని సోదరుడు శిశిర్‌కుమార్ ఒక రకంగా మలచాడు. "అణచివేత అనేది ఒక రకంగా దివ్య ఔషధం, అది మంచి మార్పుకి సోపానం," అని శిశిర్‌కుమార్ వ్యాఖ్యానించేవాడు " ఇంగ్లాండులో గొప్ప విప్లవాన్ని తెచ్చినది ఈ అణచివేత చర్యలే.. " అన్నారాయన. (కాలో)గా మోతీలాల్ 1898 కలకత్తా మున్సిపల్ బిల్లుపై బయలుదేరిన తీవ్ర ఆందోళన పట్ల ఆకర్షితులు అయినారు 1872నుంచి కార్యనిర్వాహక అధికారాలు నెరపుతున్న ఎలెక్టెడ్ కమీషనర్ అధికారాలు హరించడానికి ఈ బిల్లు ప్రతిపాదించబడింది. కమీషనర్లపై 13 మంది సభ్యుల వర్కింగ్ కమిటీ ఏర్పాటుకు బిల్లునుద్దేశించాలి. చైర్మన్ మరి 12మంది సభ్యులను ఈ కమిటీకి ఎన్నుకొనడం నామినేట్ చేయడం సాగిస్తారు కలకత్తాలో మూడు ప్రధాన రంగాలైన అధికారులు, వ్యాపారులు, పౌరులకు ప్రాతినిధ్యం కల్పిస్తారు స్వజాతీయులే మునిసిపాలిటీని చాలా చాకచక్యంగా నడపటంతోను, భారతీయులు రాజకీయ స్థాయిలో తమకు ఎక్కువ ప్రాతినిధ్యం కావాలని చాలా ప్రమాదకరమైన స్థాయిలో కోరుతుండడంతోను కలవరపడిన బ్రిటీష్ వ్యాపారవర్గం ప్రభుత్వాధికారుల అండదండలతో ఈ బిల్లు రూపొందేలా చేసిందనడంలో సందేహం లేదు అదే ఏడాది వైస్రాయిగా వచ్చిన లార్డ్ కర్జన్ బ్రిటీష్ వారి ప్రయోజనాలను ప్రోత్సహించాడు ఆయనపర్యవేక్షణ క్రింద ఈ బిల్లు మునిసిపాలిటీలో ఎన్నికలద్వారా భర్తీ అయ్యే భాగాన్ని కుదించి దాని అధికారాలు బ్రిటీష్ మెజారిటీ వర్గంతో కూడిన కమిటీకి బదిలీ చేసింది. ఈ మార్పు అంతా స్థానిక పాలనను మెరుగుపరచడానికే అన్నారు.

ఈ బిల్లు వల్ల కలకత్తా అట్టుడికిపోయింది. ప్రజావెల్లువ అనదగ్గ బహిరంగ సభలు జరిగాయి. సభల నిర్వాహకులలో మోతీలాల్ ఒకరు. అయితే ఆయనకు సభ బిడియం మెండు. అందుకే తన భూమిక ప్రధానంగా నేపథ్యానికే పరిమితం చేశారు. 1889లో జరిగిన ఒక సభకి మాత్రం ఆయన అధ్యక్షత వహించక తప్పలేదు. ఈ బిల్లులోని అంతరార్థాలను విప్పి చెబుతూ ప్రసంగించారు. కలకత్తా పన్ను చెల్లింపుదారులను ఉద్దేశిస్తూ తన పత్రికలో ఆయన ఇలా ఉద్ఘాటించారు.

ఈ బిల్లు తమ స్థితిని మరింత దిగజార్చేదిగా కలకత్తా పౌరులు భావిస్తే దానిని మరో దృష్టితో చూడరాదు. నిర్ద్వంద్వంగా ఖండించాలి. ప్రభుత్వానికి తమకాబిల్లు వద్దని గౌరవనీయమైన పదజాలంలోనే ఖచ్చితంగా చెప్పాలి. ప్రభుత్వం వింటే సరేసరి. వినని పక్షంలో ప్రహసన ప్రాయమైన ఎన్నికల వ్యవస్థను పూర్తిగా రద్దుచేసి, కలకత్తా మునిసిపల్ యంత్రాంగాన్ని ప్రభుత్వ విభాగంగా మార్చేయవలసినదని కోరడం ఉత్తమం."

ప్రజా నిరసనను పెడచెవిని పెట్టి 1899లో బిల్లును చట్టంగా చేశారు. కలకత్తా నగరానికి స్వయం ప్రతిపత్తిగల మునిసిపల్ కార్పొరేషన్ ఏర్పడడానికి ఆ తరువాత 24 ఏళ్ళు పట్టింది.

బెంగాల్‌లో రెండవ మహానగరంలోని ఢాకా మునిసిపాలిటీ నుంచి రాష్ట్ర విధాన పరిషత్తుకు ప్రతినిధిని ఎన్నుకొనే హక్కును తొలగించటం మరో పెద్ద వివాదమైంది. ఈ విషయంలో కూడా మోతీలాల్, సురేంద్రనాథ్‌ల మధ్య భేదాభిప్రాయాలు వెల్లడయ్యాయి. ఈ చర్యను మోతీలాల్ వ్యతిరేకించగా సురేంద్రనాథ్ బలపరిచారు. దురదృష్టవశాత్తు ఈ వివాదం వ్యక్తిగత విమర్శల రూపంలోనికి మారింది. కౌన్సిల్‌కి ఎన్నికయ్యే ఉద్దేశ్యాలు పెట్టుకుని ఢాకా ప్రయోజనాలకు మోతీలాల్ వకాల్తా పుచ్చుకున్నారని ఆయనపై ఆరోపణ వచ్చింది. ఇరువురు మద్దతుదారులు వారి నాయకుని వీరు, వీరి నాయకుని వారు విమర్శించడం ప్రారంభమైంది బెంగాలీ పత్రికలలో వ్యక్తిగత దూషణ భూషణల రూపంలో ఈ అంశంపై అవాంఛనీయ జర్నలిజం కొన్నాళ్లు సాగింది. సురేంద్రనాథ్ చివరికి పరువు నష్టం దావా వేస్తానని హెచ్చరిస్తూ మోతీలాల్‌కు లాయర్ నోటీస్ పంపించారు. క్షమాపణ చెప్పకపోగా మోతీలాల్ తన సంపాదకీయ వ్యాఖ్యలో యిలా రాశారు.

"ఈ ఏడాదంతా ప్రతీవారం ఒక పత్రిక మనపై విషం కక్కుతూ వచ్చింది. ఈ పత్రిక ఎడిటరు బాబూ సురేంద్రనాథ్‌ను ఆయన పత్రికను బలపరిచే వ్యక్తిది. (కావ్య విశారద) 'గాజు ఇండ్లలో నివసించేవాళ్లు యితరుల మీద రాయి విసరకూడదు' అనేది ఇంగ్లీషు సామెత. మనకి అంతకంటె పదునైన స్పష్టమైన సామెత ఒకటుంది. 'ఎవరు త్రవ్వుకున్న గోతిలో వారే పడతారు.' అనేది.

ఇరువురు నాయకుల అనుయాయుల వర్గాలు పరిష్కారానికి చురుకుగా పనిచేశాయి. బెంగాలీలో హేయమైన ఈ పరస్పర దూషణకి ఒక ప్రకటన స్వస్తి

వాక్యం పలికింది. మోతీలాల్, సురేంద్రనాథ్ మధ్య అన్ని విభేదాలు తొలగిపోయాయని బెంగాలీలో ప్రకటించారు. అయితే మోతీలాల్ పై సురేంద్రనాథ్ వద్దంటున్నా సురేంద్రనాథ్ అనుయాయులు విడువకుండా దుష్ప్రచారం కొనసాగించడంతో ప్రజలు ఈ సయోధ్య తాత్కాలికమే అని చెప్పుకున్నారు. అయితే లార్డ్ కర్జన్ విధానాలు, చర్యలకు ఐక్యప్రతిఘటన ఇవ్వడం కోసం వారిద్దరి మధ్య సయోధ్య చారిత్రక అవసరమైంది.

# 9. జాగృతికి హేతువైన కర్జన్

అది 1899వ సం॥ము. భారతదేశంలో బ్రిటన్ సామ్రాజ్యం పతాక స్థాయికి చేరుకున్న తరుణం. వైస్రాయి గవర్నర్ జనరల్‌గా లార్డ్ కర్జన్ వచ్చారు. 1905లో ఆయన తిరిగి వెళ్ళేసరికి దేశంలో బ్రిటిష్ సామ్రాజ్యం బీటలు వారటం ప్రారంభించింది. ఆయన మనసా వాచా కర్మణా పక్కా సామ్రాజ్యవాది. దేహికంగానూ, నైతికంగానూ బ్రిటిష్ జాతి ఆధిక్యత తిరుగులేనిదని ఆయన విశ్వాసం. "భారతదేశాన్ని కోల్పోతే తమ దేశం తృతీయ ప్రపంచదేశంగా అధః పాతాళానికి పోతుంది." కనుక భారత దేశాన్ని ఉక్కుపిడికిలిలో బిగించడం అవసరమని ఆయన భావించారు. తదనుగుణంగా మొరటుగా వ్యవహరించారు. భారతీయుల స్వభావాన్ని అర్థం చేసుకోవడంలో విఫలమయ్యారు. విద్యావంతులైన బెంగాలీల పట్ల అక్కసు పెంచుకున్నారు. బ్రిటిష్ సామ్రాజ్య ప్రయోజనాలకు హానికరం కాగలదన్న భయంతో పాలనా యంత్రాంగంలో స్వదేశీయుల భాగం పూర్తిగా రద్దు చేయడానికి నిశ్చయించారు. 1905లో భారతదేశం నుంచి ఆయన నిష్క్రమణను మోతీలాల్ అభివర్ణిస్తూ "యువకుడు, డాబుసరి వేషధారి, సుశిక్షణ లేకుండానే అంతులేని అధికారాలు చేత ధరించినవాడు లార్డ్ కర్జన్, భారత దేశంపై అలుముకున్న పెద్ద మేఘం. ఒక రాకెట్‌లా పైకి ఎగసి చివరికి ఒక జిలుగు వలె కూలిపోయాడు."

అనూహ్యం కాదుగాని కర్జన్‌కి పత్రికకీ మధ్య ఆరంభంలోనే చుక్కెదురైంది. కలకత్తా మునిసిపాలిటీని డొల్ల చేసిన తరువాత ఆయన కలకత్తా యూనివర్శిటీ మీద పడ్డాడు. "తాము సాధించేది ఏమిటో తమకే తెలియని కొందరి స్వదేశీ న్యాయవాదుల చేతుల్లో కలకత్తా యూనివర్శిటీ ఇరుక్కుంది. విద్యాసంబంధమైన విషయాలను కూడా రాజకీయ దృక్కోణం నుంచి తప్ప చూడలేని ఈ కూటమి బారినుంచి యూనివర్శిటీని విముక్తం చేయాలంటూ 1902లో

బ్రిటిష్ మెజారిటీ యూనివర్శిటీ కమీషన్‌ను ఆయన నియమించారు. కలకత్తా, బాంబే, మద్రాస్ ప్రెసిడెన్సీ యూనివర్శిటీలపై అధికారుల అజమాయిషీని కఠినతరం చేసే తన పథకాన్ని కమీషన్‌లోని బ్రిటిష్ మెజారిటీ వర్గం ద్వారా అమలుపరచడం ప్రారంభించాడు. సెకండరీ విద్యా వ్యవస్థలో కూడా జాతీయ వాదపు పునాదులను పెకిలించివేయడానికి నడుం కట్టాడు - ఇదంతా ప్రజల నిరసనలను పెడ చెవిని పెట్టి మొండిగా సాగించాడు. ఈ చర్యలపై పత్రికల్లో వచ్చిన వ్యాఖ్యలు ముఖ్యంగా అమృతబజార్‌పత్రికలో మోతీలాల్ రాసిన విమర్శలు చాలా ఘాటుగా ఉండడమేకాక వాటిలో ఏమాత్రం మర్యాద ధ్వనించక పోవడం కర్జన్‌ను చిరచిరలాడించి, మోతీలాల్, కర్జన్‌ల మధ్య వైషమ్యం ఒక చిత్రమైన స్థాయికి చేరుకుంది. కర్జన్‌ను కలుసుకోవడానికి మోతీలాల్ వెళ్ళినపుడు ఆయనగారు మొహం చూపించలేదు. ఇద్దరూ వేర్వేరు గదుల్లో కూర్చున్నారు. చీటీల మార్పిడి సంభాషణ జరిగింది. కర్జన్ దొరగారి ప్రైవేటు సెక్రటరీ మోతీలాల్ -కర్జన్ మధ్య ఆ గది నుంచి ఈ గదికి, ఈ గది నుంచి ఆ గదికి చీటీలు మోస్తూ తిరిగాడు. ఈ సంఘటనపై మోతీలాల్ వ్రాస్తూ : "కర్జన్ ప్రభువుగారు ఎంత ఉన్నతులంటే నా లాంటి సామాన్యునితో చర్చించడం న్యూనతగా భావించారు" అని పేర్కొన్నారు.

మోతీలాల్‌తో వాగ్వివాదానికి వైస్రాయి ఎప్పుడు దిగినా ఆయనకు ప్రత్యర్థి నుంచి ఘాటైన విమర్శే ఎదురయ్యేది. 1902 ఫిబ్రవరిలో కలకత్తా యూనివర్శిటీ స్నాతకోత్సవంలో వైస్రాయ్ లార్డ్ కర్జన్ ప్రభువు చాన్సలర్ హోదాలో ఇచ్చిన ప్రసంగంలో "జాతీయవాద పత్రికలు" చెప్పేది నమ్మి పాడై పోవద్దని పట్టభద్రులకు హితవు చెప్పారు. ఆ పత్రికలు అవిశ్వాసనీయమైన అతిశయోక్తులతో ప్రభుత్వానికి దురుద్దేశాలు అంటగడుతూ మొరటు భాషతో కూడిన రాతలు రాస్తున్నాయని విమర్శించారు. ఈ విమర్శని సవాలుగా తీసుకుని మోతీలాల్ "ఒక వైస్రాయ్ చేయదగ్గవి, చేయకూడనివి ఏమిటి?" అనే శీర్షికతో తన పత్రికలో సంపాదకీయం రాశారు : "ఎడ్వర్డ్ చక్రవర్తి ప్రతినిధిగా భారతదేశపు వైస్రాయి కర్జన్ ప్రభువుకు నాలుగు కళ్లు అవసరం. రెండు కళ్లు ముందుండాలి. రెండు వెనకుండాలి. కళ్ళ విషయానికి వస్తే వైస్రాయి, అతనెవరైనా సరే, కళ్ళజోడు వాడకూడదు. అతనికి పచ్చకామెర్ల వ్యాధి వుంటే దాన్ని జయించటానికి ప్రయత్నించాలి. పచ్చకామెర్ల వ్యాధి వున్నవాడికి వైస్రాయ్ సింహాసనం ఎక్కే అర్హత లేదు. ప్రత్యర్థుల విమర్శ

అది ఎంత చేదు విమర్శ అయినా వ్యక్తిగత వ్యాఖ్యలతో కూడిన దాడియైనా, వ్యంగ్యమైనా, తిట్టు అయినా అది ఎవరినో హత్య చేయడం వంటిది కాదు. ఎన్నికైన ప్రతినిధులతో కూడిన ప్రభుత్వ యంత్రాంగం లేని విదేశీ జాతి పాలనలో ముఖ్యనేత అయిన కర్జన్ ప్రభువు ఇటువంటి విమర్శలకు ఉల్లాసంగా స్వాగతం చెప్పాలే తప్ప ఏదో ఒక విధంగా అణచివేయడానికి ప్రయత్నించకూడదు."

మోతీలాల్ విందలు కర్జన్ ప్రభువుని ములుకుల్లా గుచ్చినా ఆయన అవసరానికి తనను తాను కూడగట్టుకున్నాడు. దేశంలో బ్రిటిష్ సామ్రాజ్యానికి పతనావస్థ ప్రారంభమైనందున ఆ తరుణంలో ఆయన తన హయాంలో కెల్ల తీవ్రమైన రాజకీయ కర్తవ్య దీక్షలో మునిగియున్నాడు. దాన్ని గురించి చర్చించుకునే ముందు మోతీలాల్, కర్జన్ మధ్య సాగిన మరో పరస్పర విమర్శ ఉదంతం ఇక్కడ వివరించాలి. 1905లో కలకత్తా యూనివర్శిటీ స్నాతకోత్సవ సభలో కర్జన్ వ్యాఖ్య "ప్రపంచంలో సమున్నతమైన సత్యసంధత పాశ్చాత్య ప్రపంచపు నైతిక సూత్రాల్లోనే కనిపిస్తుందని నేనంటాను. సత్యానికి సమున్నతమైన గౌరవం ప్రాగ్దేశాలలో లభించడానికి చాలా ముందే పాశ్చాత్య నైతిక సూత్రాలలో సత్యసంధతకు చాలా ఉన్నతమైన స్థానం కేటాయించారు. నిజమైనా, అబద్ధమైనా పొగడ్తలు చేయకూడదు. పొగడ్త నిజమైతే ఫరవాలేదు. కాని సత్యదూరమైతే కుయుక్తమవుతుంది." పాశ్చాత్యులైన బ్రిటిషర్లతో పోలిస్తే ప్రాగ్దేశస్థులైన భారతీయులు అబద్ధాలకోర్లు అని కర్జన్ భావన. కర్జన్ చేసిన ఈ అవమాన పూరితమైన వ్యాఖ్య సత్యసంధత గురించి ఆయన చేసిన బోధనపట్ల దేశమంతా భారతీయుల్లో తీవ్రాగ్రహం పెల్లుబికింది. ఈ శుద్ధ అబద్ధాన్ని తిప్పి కొట్టాలని మోతీలాల్ నిశ్చయించుకున్నారు. "ప్రాక్ప్రపంచపు సమస్యలు" అనే తన గ్రంథంలో కర్జన్ ప్రభువే ఉటంకించిన ఒక ఉదంతాన్ని ఎత్తిచూపి మా బాగా కర్జన్ ముఖం మాడ్చారు. కొరియాలో బ్రిటిష్ దూతగా ఉండటానికి తాను ఒక అబద్ధం చెప్పినట్లు ఆ పుస్తకంలో కర్జన్ స్వయంగా వ్రాశారు.

'నేను కొరియా రాజును కలుసుకోవడానికి ముందే ఆ దేశపు విదేశాంగ శాఖ అధ్యక్షుని కలుసుకున్నాను. ఆయన వేసిన కొన్ని ప్రశ్నలు, నేనిచ్చిన కొన్ని సమాధానాలు ఇంకా నాకు గుర్తువున్నాయి. అప్పుడు నా వయస్సు 33 ఏళ్ళు. కానీ ఆ వయసువారికి కొరియాలో ఏమీ గౌరవం లేదు. కనుక ఆ వాస్తవం నేను

చెప్పకూడదని నన్ను ప్రత్యేకంగా హెచ్చరించబట్టి నీ వయస్సు ఎంత అని ఆయన అడిగినప్పుడు తటపటాయించకుండా నలభై (40) అని చెప్పాను. "కానీ అంత వయస్సు వున్నట్టు లేదే" అని ఆయన సందేహం వెలిబుచ్చారు. హిజ్ మెజిస్టీ (బ్రిటిష్ చక్రవర్తి) మిలియన్లలో గత నెలరోజులుగా ఆహ్లాదకరమైన వాతావరణంలో వుంటూ వచ్చాను. అదే కారణం," అని బదులిచ్చాను. 'నీవు బ్రిటిష్ రాణి దగ్గిర బంధువనుకుంటాను" అని ఆయన అన్నారు. కాదన్నాను వెంటనే. అయితే ఆయన ముఖంలో అసంతృప్తి పసిగట్టి, "నా కింకా పెళ్ళి కాలేదు" అని యుక్తిగా ఒక సూచనను ధ్వనింపజేసి ఆ వృద్ధుని అభిమానం పూర్తిగా సంపాదించాను.

ఆ విధంగా కర్జన్ సత్యసంధతిని లోకానికి వెల్లడి చేశాడు. మోతీలాల్, తన గ్రంథం ద్వితీయ ముద్రణలో ఈ ఉపాఖ్యానాన్ని తొలగించి కర్జన్ ప్రభుత్వపు జాగ్రత్త పడ్డాడు గాని, కుదింపులు లేని తొలి ముద్రణ ప్రతిని మోతీలాల్ సంపాదించి, ఈ ఉదంతాన్ని సంగ్రహించారు. కర్జన్ స్వయంగా రాసుకున్న విషయం మోతీలాల్ ద్వారా వెల్లడి అయి ఆయనకు గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్టయింది. కానీ భారతీయులు మాత్రం 'కర్జన్ దెబ్బకు దెబ్బ తిన్నందుకు చాలా సంతోషించారు. కర్జన్ ప్రభుత్వపు అబద్ధాన్ని వెల్లడి చేసి గొప్ప 'స్కూప్' ప్రచురించినందుకు అమృతబజార్ పత్రికని ఇంగ్లాండులో పత్రికలు విశ్లేషించి ప్రశంసించాయి. 'ది వీక్లీ టైమ్స్' అనే పత్రిక ఈ అంశంపై వ్యాఖ్యానిస్తూ "బహుశా సత్యసంధత అనేది కర్జన్ ప్రభువుకు ఆయన భార్య నిర్వాహకంలో ఆమె ద్వారా తదనంతర జీవితంలో అలవడింది కావచ్చును. సత్యసంధత ప్రధానంగా యాంకీలక్షణం అని వ్రాసింది. (అమెరికన్ సంపన్న వారసురాలిని కర్జన్ పెళ్ళాడాడు.) చాలా సంపన్న జీవనం సాగించే కర్జన్ భారతీయ సంపన్నులను ముఖ్యంగా బ్రిటిష్ జీవనసరళి అనుసరించేవారిని చిన్నచూపు చూస్తూ "కాంగ్రెస్ పునాదులు కదులుతున్నాయి. భారతదేశంలో ఉండగానే దాని సర్వనాశనం ప్రశాంతంగా సాగిపోవడానికి తోడ్పడాలన్నది నా ముఖ్య ఆశయం" అని 1900 లోనే ప్రకటించి వున్నారు. ఆయన అభిప్రాయం తప్పు అని తరువాత రుజువయింది. కాంగ్రెస్ నశించడం లేదు సరి కదా అది కోష్ఠ దశ నుంచి బయటపడి రెక్కలు తొడుగుతోంది.

బ్రిటిష్ సామ్రాజ్యం అజేయమన్నదన్న వాదనలో గాని బ్రిటిష్ పాలకుల

హామీలు, దీవెనలలో గాని నమ్మకంలేని ప్రజా సమూహాలు కాంగ్రెస్ నుంచి ముందుకు రావడం మొదలైంది. లక్ష్యాలలో ఏ ఒక్కటీ సాధించలేకపోయినా కాంగ్రెస్ మీద వీరి ఆశలు తొలగి రాజ్యాంగపరమైన సాధనాలు విముక్తి కలిగించజాలవని త్వరగా గుర్తించారు. బ్రిటిషర్లు తమ స్వార్థ ప్రయోజనాలకోసమే భారతీయుల్ని గుప్పెట్లో పెట్టుకున్నారని అందుచేత ప్రజా ఉద్యమం ద్వారా, ప్రత్యక్ష చర్య ద్వారా, తిరుగుబాటు ద్వారా ఆఖరుకు హింసావాదం ద్వారా, బలప్రయోగంతో సాధించుకున్నది మినహా వారు దేనినీ విశ్వసించుకోలేదు. కాంగ్రెస్ మీద ఆధిపత్యం చెలాయిస్తున్న మితవాదుల్ని పిరికి వాళ్లని నిందించారు. దేశాన్ని ఐరోపా సంస్కృతిలోకి మళ్ళిస్తున్నారని, బ్రిటిష్ దొరలని ప్రాధేయపడే మార్గాలు అవలంబిస్తున్నారని కాంగ్రెస్‌లోని మితవాదుల్ని వీరు ఖండించారు. వీరిది ఉగ్రవాదం, ఉగ్ర జాతీయవాదం పాండే రచించిన "ది బ్రేక్ అప్ ఆఫ్ బ్రిటీష్ ఇండియా." 1901లో కలకత్తాలో కాంగ్రెస్ సదస్సు జరిగినప్పుడు ఇలువంటి ఉగ్రవాదుల వర్గం ఒకటి ఏర్పడుతుందని ఎవ్వరూ ఊహించలేదు. వలస వచ్చిన భారతీయులకు పౌర హక్కుల కోసం దక్షిణాఫ్రికాలో శాంతియుత ప్రతిఘటనా ఉద్యమాన్ని నిర్వహిస్తున్న గాంధీజీ ఈ సదస్సుకు హాజరయ్యారు. ఉద్యమంపట్ల భారతీయ నాయకుల మద్దతు సంపాదించడం కోసరం ఆయన భారతదేశానికి వచ్చి ఈ సదస్సు ప్రారంభించారు. తిలక్‌ని మోతీలాల్‌ని ప్రతినిధుల శిబిరంలో ఆయన తొలిసారి కలుసుకున్నారు. తిలక్‌గారి గదిలో వారు మాట్లాడుకున్నారు. గాంధీజీ ఆత్మకథలో ఓ చోట వ్రాస్తూ "ఆనాడు నన్ను కలుసుకున్న లెక్ఖ లేనంత మందిలో ఈ నాటికీ నాకు గుర్తున్న వ్యక్తి ఒక్కరే. అమృతబజార్ పత్రిక సంపాదకుడైన, బాబూ మోతీలాల్ ఘోష్, పాలకులైన బ్రిటిష్‌జాతి గురించి వారు విమర్శలు గుప్పిస్తూ పగలబడి నవ్వుతూ ముచ్చటించుకొనడం నాకు ఇప్పటికీ గుర్తుంది." అని అన్నారు. గాంధీజీ రూపొందించిన తీర్మానం సమావేశం ముగింపు తరుణంలో చర్చ ఏమీ లేకుండా ఆమోదముద్ర పొందింది. "ఆ తీర్మానాన్ని అర్థంచేసుకొనడానికి ఒకడూ ప్రయత్నించలేదు. అంతా సభ ఎప్పుడవుతుందా పోదామనే ధోరణిలో ఉన్నారు. తీర్మానాన్ని గోఖలేగారు చూశారు కనుక తక్కినవాళ్ళు ఎవరూ చూడఖర్లేదని అర్థంచేసుకోనక్కర్లేదని భావించారు!", అని గాంధీ వ్రాశారు. మూడు రోజుల కాంగ్రెస్ మేలా ఆ రకంగా ముగిసింది/ గాంధీ,

మోతీలాల్ మధ్య ముఖాముఖీ చర్చ ఆ ఒక్కసారితో ఆగిపోలేదు. దక్షిణాఫ్రికాలో భారతీయులకు సేవ చేసినందుకు గాను కలకత్తాలో 1915లో గాంధీజీకి పౌర సన్మానం జరిగినప్పుడు మోతీలాల్ అధ్యక్షత వహించడం ఆ రకంగా రెండవసారి వారిద్దరూ కలుసుకోవడం తటస్థించింది. ఆ సభలో మోతీలాల్ మాట్లాడుతూ దక్షిణాఫ్రికాలో గాంధీజీ సేవలను కొనియాడారు. భారతదేశంలో పోరాట కృషిని కూడా ఆయన మెచ్చుకున్నారు. అయితే గాంధీజీ మితవాది, మోతీలాల్ తిరుగులేని తీవ్రవాది కావడంతో వారిద్దరి మధ్యన అసలైన సమావేశమనేదేదీ జరుగలేదు. తదనంతరం కూడా వారు ఒకరికొకరు తటస్థపడుతూనే వున్నారు. అయితే 1920లో ప్రజల అహింసాయుత ఉద్యమానికి నాయకుడైన పర్యంతం అభిప్రాయాలు విప్పిచెప్పుకునే సమావేశం ఇద్దరిమధ్యా జరగలేదు. కర్జన్ ప్రభువు "అవిరళకృషి" గురించి తిరిగి వెనక్కి వెళ్లి చర్చించుకోవాలి. ఉత్తర బెంగాల్‌లోని అస్సామ్‌లోను, పశ్చిమ బెంగాల్‌లోని బీహార్, ఒరిస్సా లోను కలిపివేస్తూ రాష్ట్రాల పునర్విభజనకు ఉద్దేశించిన అస్పష్టమైన పాత పథకం ఒకదాన్ని బైటకు లాగి, బూజు దులిపి, తుది మెరుగులు దిద్ది స్పష్టమైన ఆకృతి కల్పించాడు జె.హెచ్.గ్రూప్ ఫీల్డ్. స్లేవ్ రాసిన "యూనిట్స్ ఆఫ్ 1904" గ్రంథం ఉటంకిస్తూ ఇలా అన్నారు. కొత్తగా ఏర్పడిన తూర్పు రాష్ట్రాలలో ముస్లిమ్‌లకు, పశ్చిమ రాష్ట్రాలలో బీహారీలకు, ఒరియాలకు మెజారిటీ స్థానం ఇవ్వడంలో ఉద్దేశం జాతీయ దృక్పథాన్ని చీల్చే ధోరణులను ప్రోత్సహించడమే. తద్వారా గ్రామాలు, జిల్లాల ప్రజల అభిప్రాయంపై కలకత్తాలోని బెంగాలీ 'భద్రాలోక్' రాజకీయ కూటముల ప్రభావాన్ని తొలగించడం కూడా మరో ఉద్దేశం. ఇతర స్థానిక వర్గాలను అనుకూలంగా మళ్ళించుకోవడానికి భద్రాలోక్‌ల ప్రయత్నాలను దెబ్బతీయడం కూడా ఇంకొక ఉద్దేశం.(ఎ రెట్ కాన్ట్రక్ట్ ఇన్ ఎ ప్లూరల్ సొసైటీ పేరిట గ్రూమ్ ఫీల్డ్ వ్రాసిన గ్రంథంలోనిది) ఈ రాష్ట్రాల విభజన 1905 అక్టోబరు 16న అధికారయుతంగా ప్రకటించినప్పటికీ 1903లోనే ఆ ప్రతిపాదన అందరికీ తెలిసింది. ఈ ప్రతిపాదన కార్యరూపం ధరించకుండా చేయడానికి సురేంద్రనాథ్ బెనర్జీ బహిరంగ సభలు, పత్రికల్లో ప్రచారం సాగించినా ఆ వ్యూహం ఫలించలేదు. ఉగ్రవాదులు క్రొత్త ప్రతిఘటన వ్యూహంతో క్రొత్త నాయకత్వంతో ముందుకివచ్చారు. అదే భారత జాతీయవాదం భవిష్యత్కార్యాచరణకు ప్రాతిపదిక అయింది. మాతృభూమిని తల్లిగా భావిస్తూ దేశ

క్షేమానికి అంకితమై పనిచేయాలన్న క్రొత్త జాతీయవాద స్ఫూర్తి మొలకెత్తింది. దానిని ప్రజా జీవన రంగంలోని ఇతర మతాల అభిప్రాయాలతో ఏకీభవించని (హిందూ తత్వంతో కూడిన) మానవతా దృక్పథం అనవచ్చు. భారతీయ సాంస్కృతిక విలువలను అనుసరించాలనీ, పాశ్చాత్య విలువలను త్యజించాలనీ అది పిలుపు నిచ్చింది. కోర్టులు స్కూళ్ల వంటి ప్రభుత్వ సంస్థలను, బ్రిటిష్ వస్తువులను, పరిత్యజించి భారతీయ తయారీ వస్త్రాలు, వస్తువులను వాడుతూ ప్రభుత్వానికి శాంతియుతంగా ప్రతిఘటన యివ్వాలన్న జిజ్ఞాసను క్రొత్త జాతీయ దృక్పథం రేకెత్తించింది బెంగాల్‌లో. ఈ క్రొత్త దృక్పథాన్ని పాదుగొల్పిన నిపుణులు మోతీలాల్‌ఘోష్, బిపిన్‌చంద్రపాల్, అశ్వనీకుమార్‌దత్తా, అరబిందఘోష్. మహారాష్ట్రలో తిలక్, పంజాబ్‌లో లాలాలజపతిరాయ్, మద్రాసులో చిదంబరం పిళ్లై, సుబ్రహ్మణ్యభారతి, నీలకంఠ బ్రహ్మచారి, ఈ క్రొత్త జాతీయివాద వ్యాప్తికి సారథులు. క్రొత్తజాతీయవాదానికి కావలసిన తాత్విక ప్రాతిపదికను అందించినవాడు రవీంద్రనాథ్‌టాగూర్. అరవిందఘోష్ రాజకీయ మార్పిడికి శాంతియుత ప్రతిఘటనా మార్గాన్ని అవలంబించాలన్న సిద్ధాంతాన్ని 1907 లో అరవిందఘోష్ ఈ విధంగా సూత్రీకరించాడు:

"జాతి జీవనరంగానికి సంబంధించి అన్ని శాఖలను ముందుకు నడిపించడానికి ఒక కేంద్ర సాధికారిక సంస్థను నడపడంతో బాటు, అధికారుల ధాష్టీకాన్ని అణచడానికి, విదేశీ ఆధిపత్యాన్ని ఒక్కసారిగా కాకపోయినా క్రమేణా తొలగించడానికి మనం ఆత్మరక్షణా యుద్ధం ప్రారంభించాలి.... ఒక జాతిగా మన తక్షణ సమస్య మనం మేధావులుగా ఎలా రూపొందించాలి, సంపదలు ఎలా గడించాలి, విజ్ఞానాన్ని ఎలా పెంపొందించుకోవాలి అన్నది కాదు; జాతికి అనివార్యమైన మృత్యు ముఖాలను ఎలా తొలగించాలి , తెల్ల దొరలనుంచి ముంచుకొస్తున్న ప్రమాదాన్ని ఎలా తొలగించాలి, మన స్థైర్యాన్ని, స్థిరత్వాన్ని ఎలా పెంపొందించుకోవాలి.....ఎలా మనుగడ సాగించాలి ఇవే మన తక్షణ సమస్యలు...శాంతియుత మార్గంలో మన చట్టాన్ని, పాలనా యంత్రాంగాన్ని, ఉల్లంఘిస్తాం, అందుకు చట్టపరమైన శిక్షలు విధించినప్పుడు శిరసావహిస్తాం..."

ఆ తరువాత పదిహేను ఏళ్లకు గాంధేయ ఉద్యమం బయలు దేరటానికి ఈ సూత్రీకరణ తొలి మెట్టు. బెంగాల్‌లో ఈ కొత్త జాతీయవాదం ధక్కా మొక్కీలు

ఎదుర్కొంది. "ఆత్మరక్షణ కోసం ప్రతిఘటన" అనే పద ప్రయోగానికి రెండు అర్థాలున్నాయ్. ఏ పవిత్ర యజ్ఞాన్ని పూర్తి చేయడానికి రాక్షసుల నుంచి వచ్చే అడ్డంకుల్ని ఎదుర్కొనే నిమిత్తం సాయుధ యోధులైన క్షత్రియ దళాలను నియుక్తం చేయడం అనే సామ్యాన్ని ఇక్కడకు తెచ్చారు. ఇందులో దాపరికం ఏదీ లేదు : దీని అర్థం దేశంలోని అన్ని ప్రాంతాలకు శాఖోపశాఖలుగా విస్తరించిన అజ్ఞాత విప్లవోద్యమం ప్రస్తావనే ఇది.

రాష్ట్రాల పునర్విభజన పరిష్కారమై పోయినట్లు పైకి కనబడినా ఆరేళ్ళ తరువాత అది అపరిష్కృత వాస్తవంగా తేలింది. తిరిగి సంయుక్త బెంగాల్ ఏర్పడింది. బ్రిటిష్ ప్రభుత్వం ఏది ఏమైనా సరే ముస్లిమ్‌లను హిందూ వ్యతిరేకులుగా తయారు చేయడానికి హిందువులను ద్వేషించే తత్వం వారిలో మొలకెత్తించడానికి నడుం కట్టింది. భిన్న వర్గాల మధ్య వైషమ్యాలు లేవనెత్తింది. ప్రజా ప్రాతినిధ్య ప్రభుత్వం కోసరం ఉగ్రవాదులు చేస్తున్న డిమాండ్ పట్ల హిందూ సంపన్న వర్గాలతో పోటీ పడుతున్న ముస్లిమ్ సంపన్న వర్గం విముఖత పెంచుకుంది

ప్రభుత్వం బెంగాల్ గ్రామీణ ప్రజల్లో అత్యధికసంఖ్యాకులైన పేదముస్లిమ్ రైతులను హిందువులకు వ్యతిరేకంగా ఉద్యమించడానికి ప్రేరేపించారు. అయితే అశ్వని కుమార్‌దత్త సారధ్యాన ప్రభుత్వ సంస్థల బహిష్కరణోద్యమం రూపుదిద్దుకుంటున్న బరిసాల్ జిల్లాలో ముస్లిమ్‌లే అధిక సంఖ్యాకులైనప్పటికీ మత కలహం ఒక్కటి కూడా జరగలేదు

సంస్కృతీ - భాషా ప్రయుక్త రాష్ట్రాల డిమాండ్ పెరగడం కూడా మరో పరిణామం. బెంగాలీ మాట్లాడే జనాభా అంతా ఒకే ప్రాంతంగా గుర్తించడంతోబాటు హిందీ మాట్లాడేవారికి ప్రత్యేకంగా బీహార్ రాష్ట్రం ఒరిస్సా కూడా కలుపుకుని ఏర్పడింది.

భారతదేశపు రాజధాని కలకత్తానుంచి ఢిల్లీకి బదిలీ చేయబడింది. ముస్లిమ్ వేర్పాటు వాదాన్ని ప్రభుత్వం ప్రోత్సహించడంతో పరిణామాలు చాలా దూరం వెళ్ళాయి. అలీగడ్ ఆంగ్లో-ముస్లిమ్ కాలేజీ రూపంలో సయ్యద్ అహమ్మద్ మొలకెత్తించిన ఈ వేర్పాటు వాదాన్ని బెక్, మోరిసన్, ఆర్చిబోల్డ్ కలిసి తీవ్రతరం చేశారు. బ్రిటిష్ పాలనలో మహమ్మదీయులకు చేకూరే ప్రయోజనాలను

హరించేదిగా కాంగ్రెస్ పట్ల ఉన్నత ముస్లిమ్ కుటుంబాల నుంచి వచ్చిన విద్యార్థులలో శత్రుత్వ భావాన్ని ప్రేరేపించారు. బ్రిటిష్ పాలనలో కంటే కాంగ్రెస్ ముస్లిమ్ ఎగువ మధ్యతరగతి వర్గానికి తక్కువ ప్రాతినిధ్యం కలుగుతుందనే సాకు చూపి ఈ శత్రుత్వాన్ని పెంచారు. పశ్చిమ భారతదేశంలోని మహమ్మదీయ పాలకులు కాంగ్రెస్‌లో చేరడంతో పాలకులకి దుర్గ కలిగి ఆలీగడ్ కాలేజీ రూపంలో వేర్పాటు వాదాన్ని బాహాటంగా పెంచారు. ఉత్తర బెంగాల్, అస్సాం రాష్ట్రం ప్రారంభోత్సవానికి ముందు బెంగాల్ విభజన పథకం రూపశిల్పియైన కర్జన్ రాజీనామా చేయవలసి వచ్చింది. ఆయన స్థానంలో వచ్చిన లార్డ్‌మింటో ఆ పథకాన్ని కొనసాగించే బాధ్యత చేపట్టారు. విభజన ప్రతిపాదనకు వ్యతిరేకత తీవ్రమవడం, కాంగ్రెస్ ఉగ్రవాదుల వర్గం శక్తిపుంజుకొనడంతో కాంగ్రెస్ పట్ల మహమ్మదీయుల వ్యతిరేకత గట్టిపడింది. 1906లో కొందరు సంపన్న మహమ్మదీయులు ఒక ప్రతినిధి వర్గంగా ఏర్పడడం, చివరికి అదే ఏడాది డిశంబరులో ఆ ప్రతినిధి వర్గమే ముస్లింలీగ్‌గా రూపాంతరం చెందడం జరిగింది మోతీలాల్ ఈ ప్రతినిధి వర్గంపై వ్యాఖ్యానిస్తూ:-

'ఈ మొత్తం వ్యవహారం ప్రేరేపిత చర్యగా అధికారుల ఆధ్వర్యంలో సాగినదిగా కనబడుతోంది. అఖిల భారత మహమ్మదీయ ప్రతినిధి వర్గం అనేది ఒక ప్రతినిధి వర్గం కానేకాదు, అఖిల భారత స్థాయి దానికి లేదు. అంతేగాక అందులోని వారు అందరూ మహమ్మదీయులు కానేకారు. వారి తప్పిదాలను చెరిపి వేయడానికి అధికారుల చేతిలో ఇది ఒకానొక సాధనం మాత్రమే.'

(21) తూర్పు బెంగాల్‌లో క్రొత్త లెఫ్టినెంట్ గవర్నర్ సర్‌భాయ్ ఫీల్డ్ ఫుల్లేర్‌కూడా హిందువులపై మహమ్మదీయుల అల్లర్లను, దౌర్జన్యకాండను బాగా ప్రోత్సహించారు. ఆయన ఎంత బాహాటంగా, దారుణంగా వ్యవహరించారంటే ఈ అల్లర్లలో తన పాత్రకుగాను ఆయన 1906లో రాజీనామా చేయవలసి వచ్చింది. అప్పటికే జాతీయ వాదులలో ఉగ్రవాదుల వర్గం అజ్ఞాత విప్లవ సంఘాలను స్థాపించింది.

అణచివేత చర్యల ఫలితం తేటతెల్లమయిన తరువాత మితవాదుల ప్రతిష్ఠ, తమ అనుకూలురయిన మహమ్మదీయ ప్రముఖుల ప్రతిష్ఠ పతనం కావడాన్ని చూసి బ్రిటిష్ పాలకులు ఓ చిట్కా ప్రయోగించదలిచారు. కొన్ని సంస్కరణలు ప్రవేశపెట్టడమే ఆ చిట్కా. ఆవిధంగా 1909 భారతీయ సకళ్ళ చట్టం ( మోర్లే-

మింటో సంస్కరణలు) వచ్చింది. ముస్లిములను వేరే ఓటర్లుగా పరిగణించడం, భూస్వాములకు విడిగా ప్రాతినిధ్యం కల్పించడం ఈ చట్టం తెచ్చిన సంస్కరణలు. ఇతర స్థానాలకు పరోక్ష ఎన్నికలను ఈ చట్టం నిర్దేశించింది. తాము చాలా రాక్షసంగా ఈ చట్టం రూపంలో అన్యాయాన్ని రుద్దామనీ, భారతదేశపు అత్యధిక వర్గాన్ని చీల్చామనీ మోర్లే,మింటో ఇద్దరూ చాలా తొందరలోనే గుర్తించారు. కానీ, "భారతీయులనుంచి భారత సామ్రాజ్యాన్ని, రక్షించుకోవాలి, ఇందుకు సాగించే యుద్ధంలో ఏదీ అక్రమంకాదు"అని మనసుకి సరిపెట్టుకున్నారు అయితే అక్రమ స్థాయి పెరిగి పెరిగి చివరికి ఫలితం బ్రిటిష్ సామ్రాజ్యానికి వినాశకరంగా తేలింది.

ఈ సంస్కరణలను సురేంద్రనాథ్ బెనర్జీ, పండిత్ మదన్ మోహన్ మాలవీయ తీవ్రంగా ఖండించారు. వీరిద్దరు మినహా కాంగ్రెస్‌లో మితవాద వర్గం సంస్కరణలను ఖండించలేదు. కాంగ్రెస్‌పై ఆధిపత్యం గల ఈ మితవాదులు సురేంద్రనాథ్, మాలవీయ చర్యను హర్షించలేకపోయారు. నిజానికి గోఖలే, ఆయన అనుయాయులు ఈ సంస్కరణలని బలపరిచారు అక్కడ. కాంగ్రెస్‌లో అభిప్రాయ భేదాలు సంస్థను ఎలా బలహీన పరిచినదీ క్రింద సూక్ష్మంగా చర్చించడం జరిగింది.

1906లోనే కాంగ్రెస్‌లో మితవాదులకు, ఉగ్రవాదులకు మధ్య విభేదాలు రచ్చకెక్కాయి. ఒక ఘర్షణను కాంగ్రెస్ సదస్సు అధ్యక్షుడు శ్రీ దాదాభాయ్‌నౌరోజీ అడ్డుకొని నివారించగలిగాడు. అప్పుడే నౌరోజీ యునైటెడ్ కింగ్‌డమ్‌వలె, లేదా డొమీనియన్లవలె దేశానికి భారతీయుల స్వయం పాలనను, సాధించవలసిన కాంగ్రెస్ లక్ష్యాలను నిర్వచించారు సదస్సు అనంతరం వైస్రాయిని కలుసుకొనకుండా దాటవేయడం ద్వారా కూడా ఆయన కాంగ్రెస్‌లో ఘర్షణను నివారించారు. అయితే అనివార్యమైన ఈ ఘర్షణ తరువాత సంవత్సరం కాంగ్రెస్ సూరత్ సదస్సులో సంభవించింది ప్రముఖ నాయకుడు రాష్‌బిహారీ ఘోష్‌ను అధ్యక్ష స్థానానికి సదస్సులో పార్టీపై ఆధిపత్యం గల మితవాదుల వర్గం నామినేట్ చేసింది. ప్రభుత్వ ఆధ్వర్యంలో సాగుతున్న విద్యా వ్యవస్థకు పోటీగా (కలకత్తాలో ఉగ్రవాదులు నెలకొల్పిన జాతీయ కలకత్తా విద్యా వ్యవహారాల మండలికి ఆయనే అధ్యక్షుడు కావడం ఒక విశేషం.) అయితే సదస్సులో అతివాదుల వర్గం తిలక్‌నుగాని లాలా లజపతిరాయ్‌ని గాని అధ్యక్ష స్థానంలో ఉండాలని ప్రతిపాదించింది. సదస్సు ప్రారంభంలో ఈ అంశంపై పెద్ద రగడ చెలరేగింది. తిలక్ పేరును చైర్మన్

తిరస్కరించడం, అదే సమయంలో తిలక్ వేదికవైపు వెళ్లడం, ప్రేక్షకుల నుంచి వేదికపైకి ఒక చెప్పు విసురుగా వచ్చి పడడం జరిగింది. అందు మీద తీవ్ర గలాభా చెలరేగి గందరగోళం మధ్య సదస్సు అర్ధంతరంగా ముగిసింది. ఆ చెప్పు సురేంద్రనాథ్‌కు తగిలింది. అది ఎవరో ఉగ్రవాది పని అని భావించారు. ఆ చెప్పు విసిరింది ఎవరన్న విషయం మీద వేరు వేరు కథనాలున్నాయి ఎమ్. ఆర్. జయకర్ అనే మోడరేట్ నాయకుని అభిప్రాయం ప్రకారం మితవాదుల వర్గానికి చెందిన ఒక వ్యక్తి అతివాది అయిన తిలక్‌పై ఆ చెప్పును గురిపెట్టగా తరువాత సురేంద్రనాథ్‌ను ఢీకొంది

అతివాదుల శిబిరంలోని ముఖ్యులలో ఒకరైన మోతీలాల్ పార్టీలో ఇరువర్గాల మధ్య రాజీ కుదర్చడానికి మరునాడు కాంగ్రెస్ సదస్సు తిరిగి ప్రారంభించడానికి కృషి చేశారు. క్షమాపణ చెప్పవలసిందిగా తిలక్‌కు నచ్చచెప్పారు. కానీ మితవాదులు వినిపించుకొనే స్థితిలోలేరు ఈ అతివాద ఆందోళనకారులు పార్టీలో వుంటే తమ పార్టీని ప్రభుత్వం చట్టవిరుద్ధమైనదిగా ప్రకటించి నిషేధిస్తుందేమోనని మితవాదులు భయపడ్డారు కాంగ్రెస్ నుంచి వారే అతివాదులను బహిష్కరించారో లేక అతివాదులే కాంగ్రెస్‌ను బహిష్కరించారో తెలియదు కానీ 1908లో మోతీలాల్ స్వగృహంలో అతివాద వర్గం నాయకులు సమావేశమై కాంగ్రెస్‌లో తాము చేరలేకపోవడానికి కారణాలు వివరిస్తూ ఓ మానిఫెస్టో ప్రకటించారు. 1916లో గానీ అతివాదులు తిరిగి కాంగ్రెస్‌లో చేరలేదు

మనం తిరిగి బెంగాల్ అంశానికి వెళ్ళి స్వదేశీ ఉద్యమ రోజుల నాటి మోతీలాల్ పాత్రను ముచ్చటించుకుందాం :

# 10. స్వదేశీ ఉద్యమం

**బెంగాల్** విభజన ఫలితంగా కనీ వినీ ఎరుగని ఆందోళన మొదలై ఉధృతరూపం దాల్చింది. పట్టణాలు, గ్రామాలలో విద్యావంతులైన మధ్యతరగతి వర్గం సారథ్యంలో ఈ ఉద్యమం స్వదేశీ ఉద్యమ రూపం దాల్చింది. విదేశీ వస్తువుల వాడకాన్ని బహిష్కరించి స్వదేశీ వస్తువులను (ముఖ్యంగా వస్త్రాలు) మాత్రమే వాడాలన్న నినాదం వ్యాపించింది. ప్రధానంగా బ్రిటన్‌లో తయారై దేశానికి దిగుమతి అయిన వస్తువుల బహిష్కరణ ఈ ఉద్యమ లక్ష్యం. "వందేమాతరం" నినాదం దేశ ప్రజల నరనరాల్లో జీర్ణించుకుంది. ఆ నినాదం తిరుగులేని స్ఫూర్తినిచ్చింది. జాతీయవాదుల ఐక్యత ఆవశ్యకతను అంతా గుర్తించారు. విదేశీ వస్తు బహిష్కరణ ఉద్యమం వెనుక గల విస్తృత లక్ష్యాలను బాలగంగాధర తిలక్ 1906లో కలకత్తాలో జరిగిన ఒక బహిరంగ సభలో వివరిస్తూ అది ఒక రాజకీయ అస్త్రమని పేర్కొన్నారు. ఆయన ఇంకా ఏమన్నారంటే :

"శిస్తులు, పన్నులు వసూళ్లు చేయడంలోనూ, శాంతి పరిరక్షణలోనూ, బ్రిటీష్ పాలకులకు మనం సహకరించబోము. భారతీయ ద్రవ్యాన్ని, భారతీయుల రక్తాన్ని పణంగా పెట్టి దేశం అన్య ప్రాంతాలలో బ్రిటిష్ పాలకులు సాగించే యుద్ధాలకు మనం తోడ్పడబోము. న్యాయస్థానాల పాలనా నిర్వహణలో సైతం వారికి మనం చేయూత నివ్వం. మనల్ని విచారించడానికి మన స్వంత న్యాయస్థానాలు నెలకొల్పుకుంటాం. కాలం కలిసివచ్చినప్పుడు మనం అసలు పన్నులు కట్టనక్కరలేని తరుణం వస్తుంది. ఆలోచించుకోండి. సమైక్య కృషిద్వారా ఇదంతా మనం చేయగలమా? చేయగలిగితే రేపటినుంచే మనం సర్వ స్వతంత్రులం."

అంతకు ఏణ్ణార్థం ముందు, విభజన తరుణంలో మోతీలాల్ ఘోష్ చేసిన వ్యాఖ్య ఇక్కడ ఉదహరించతగ్గది :

"ఆరు కోట్ల బెంగాలీలను కర్జన్ ప్రభువు అంతులేని బాధల్లో ముంచివేశారు. ఆయన ఈ పని ఎలా చేశారో, ఆయనకే తెలియాలి. భారతీయుల డబ్బు, దస్కాలతో మేపబడుతున్న 72 వేల మంది బ్రిటిష్ సైనికుల అండ చూసుకుని ఆయన ఈ పని చేశారు. పరహస్తాల నుంచి రక్షించుకొని స్వయం పాలనలోకి తిరిగి సాధించుకోవడానికి కోల్పోయిన శక్తిని తిరిగి కూడగట్టు కోవడానికి స్వజాతి రక్తాన్ని ధారపోయని దేశం ప్రపంచంలో ఏదీ ఉండదు. అమెరికన్లు, గతంలో ఇంగ్లాండు అలా త్యాగాలు చేశాయి. అలనాడు నీల్ రైతులు ఏమని విప్లవించారు. "నీల్ విత్తనాన్ని ఈ చేతులు మళ్ళీ ముట్టవు" అన్నారు. బెంగాల్ విభజనను వ్యతిరేకించే వారంతా ఇప్పుడు అదే వరుసలో "ఈ చేతులు తిరిగి విదేశీ వస్తువును ముట్టుకోవు అని ఎలుగెత్తి చాటాలి"-

1905 అక్టోబర్ 16న విభజిత రాష్ట్రాలకు ప్రారంభోత్సవం జరిగినపుడు తమ పత్రికలో మోతీలాల్ ఇలా వ్రాశారు:

'భారతీయులు పశువుల మందలే తప్ప మానవ మాత్రులు కాదనీ పరాయి పాలకులు భావిస్తున్నట్లు ఈ చర్య వలన తేటతెల్లమయింది. బెంగాలీలకు ఈ కొరడా దెబ్బ తగలడం ఒక విధంగా మంచిదే అయింది. ఈ శిక్ష పడకపోతే బెంగాలీలు బహుశా తమ దీర్ఘ నిద్ర నుంచి, అలసత్వం నుంచి మేలుకువేవారు కాదేమో. లార్డ్ కర్జన్ హేయమైన చర్యల వలన తలెత్తిన స్వదేశీ ఉద్యమం సక్రమ రీతిలో సాగితే మృతప్రాయమైన దేశానికి తిరిగి జవసత్వాలను ప్రసాదిస్తుంది. ఈ ఉద్యమానికి ఎంతో ఋణపడివున్నాము మనం ... "

1906లో తరువాత 5వ జార్జి ప్రభువుగా వ్యవహరించిన వేల్స్ యువరాజు భారతదేశ సందర్శనకై వచ్చాడు. ఆయన కలకత్తా వచ్చినపుడు విప్లవవాద పత్రికలయిన అమృత బజార్ "ది బెంగాలీ," "ది స్టేట్స్‌మన్" (ఉగ్రవాది ఎస్.కె.రాడ్‌క్లిఫ్ సంపాదకత్వంలో వెలువడేవి) పత్రికలు ఆయన కంటపడకుండా అధికారులు కట్టుదిట్టాలు చేశారు. అయితే వేల్స్ యువరాజు ఆంతరంగిక కార్యదర్శి సర్ వాల్టర్ లారెన్స్ శ్రీ మోతీలాల్ ఘోష్‌కు పాత మిత్రుడు. అమృతబజార్ దిన పత్రిక ప్రతులు కొన్నింటిని ఆయన వేల్స్ యువరాజుకు చూపారు. తరువాత లారెన్స్ పిలువనంపగా మోతీలాల్ తన సాంప్రదాయిక దుస్తులైన ధోవతి, ఖద్దర్ చొక్కా ధరించి గవర్నమెంట్ హౌస్ వద్దకు వెళ్ళారు. "వేల్స్ యువరాజును చూడాలని

వుందా?" అన్నది ఆయన ఎదుర్కొన్న మొదటి ప్రశ్న. ముందు హాస్యానికి తనని అలా అడుగుతున్నారేమో అనుకొన్నాడు మోతీలాల్. నిజంగానే అడుగుతున్నారని గ్రహించి, ఒప్పుకోకపోతే రాచమర్యాదలకు భంగం కలిగించిన నింద మీద పడుతుందని భావించి వేల్స్ దర్శనానికి అంగీకరించారు. ఆయనను వేల్స్ యువరాజు ఎదుటకు తీసుకువెళ్ళారు. రాజుగారితో నాటి ఇంటర్వ్యూపై మోతీలాల్ చాలా కాలం అయిన తరువాత ఇలా వ్రాశారు:

"యువరాజు కరచాలనం నిమిత్తం సాదరంగా నావైపు చేయి చాచారు. అయితే అందుకు బదులుగా భవిష్యత్తులో తమను పాలించే యువరాజును గౌరవించడానికి భారతీయులు అనుసరించే పద్ధతి అది కాదని చెప్పాను. నేను వారి ముందు ముకుళిత హస్తాలతో మోకరిల్లి గద్గదిగ స్వరంతో యిలా విన్నవించుకున్నాను:- "ఏలినవారు దయతో కలిగించిన ఈ పరిచయ కార్యక్రమ మహదవకాశాన్ని అత్యంత వినమ్రుడనై నేను ఎంతో గౌరవంగా భావించుకుంటున్నాను. కృతజ్ఞతా భావంతో ఈ మహదవకాశాన్ని నేను ఎప్పుడూ గుర్తుంచుకుంటాను. ఈ నిరుపేద భారతదేశ పరిస్థితి ఎంతో దయనీయంగా వుందని చెప్పడానికి సెలవీయండి మా భవిష్య పరిపాలకులు మీరే కనుక మీ చేతులమీదుగా భారతదేశ పరిస్థితిని చక్కదిద్దవలసి వుందని విన్నవించుకుంటున్నాను. దయచేసి భారతీయులను మరువకండి. ఇంగ్లాండులోని నాలుగు కోట్ల ఆంగ్లేయులవలెనే భారతీయులను కూడా మీ స్వజనంగానే భావించుకోవలసినది. భారతీయులకు తమ పాలకుల దయాదాక్షిణ్యాలు. శ్రద్ధాసక్తులు తక్షణ అవసరం.'

యువరాజు ఆ మాటలకు కరిగిపోయినట్లు కనిపించారు . ఎంతో ఆదరణతో ఆయన నన్ను లేచి నిలబడవలసిందిగా కోరాడు. నేను అలా చేసిన తరువాత ఎంతో ఆత్మీయత ధ్వనించే స్వరంతో ఈ క్రింది మాటలను నాతో అన్నారు. ఆయన కంఠం నా హృదయపు లోతుని తాకింది.

"మిమ్మలను కలుసుకోవడం నా కెంతో తృప్తి నిచ్చింది. భారతీయులను ఎన్నడూ మరువనని మాట ఇవ్వవలసిందిగా కోరుతున్నారు. నిజంగానే నేను భారతీయులను మరువలేనని మాట యిస్తున్నాను. నా స్మృతిపథంలో ఎప్పుడూ వారు నిలిచి వుంటారు. మీ భారత ప్రజానీకం స్వాగత సత్కారాల పట్ల నేనెంత సంతృప్తి పొందానో కూడా నేను మా తండ్రిగారికి నివేదిస్తాను. భారతదేశం పట్ల

ఎంతో ఆత్మీయతా భావంతో నేను మరలి వెడుతున్నాను.*

వేల్సు యువరాజా అన్నమాట ప్రకారం తన తండ్రిగారికి నివేదించారు. భారతదేశ ప్రజలనుంచి మరింతగా విధేయతను పొందగలిగితే, వారిలో విధేయతను పాదుగొల్పితే ఆ దేశ పాలనా భారం మరింత సుళువవుతుంది అని ఆయన తండ్రిగారికి, బ్రిటిష్ ప్రజలకు వివరించారు. 1911లో ఆయన బ్రిటన్ సామ్రాజ్య పాలనా భారాన్ని చేపట్టి సింహాసనా రూఢుడైన తరువాత, బెంగాలును పునరేకీకరించాలని భారతదేశంలోని తన తరపున పాలకులకు నయబోధన చేశారని తదనంతరం తెలిసింది. 1911 డిసెంబరు 11న ఢిల్లీలోని రాజ్‌దర్బార్‌లో ఈ బెంగాల్ పునరేకీకరణ సంకల్పాన్ని ప్రకటించారు. ఇందుకు దారితీసిన యువరాజు - ఘోష్ అనుకొని ఇంటర్వ్యూ విషయాన్ని గోప్యంగా వుంచినా ఇంగ్లాండ్‌లో రాజకీయ వర్గాలలో ఆ సంఘటన అందరికీ తెలిసిపోయింది. 1910లో మోతీలాల్ ఘోష్‌ను రెగ్యులేషన్ క్రింద అరెస్టుచేసే పథకాన్ని ప్రభుత్వం ఆఖరి క్షణంలో విరమించుకోవడానికి అదే కారణం కావచ్చు విప్లవ్న కారులుగా పేర్కొన్న వ్యక్తుల జాబితాలో ఇంకా చిత్తరంజన్‌దాస్, ద మాడరన్ రివ్యూకు చెందిన రామానంద చటర్జీ కూడా ఉన్నారు.

(కలకత్తాలో మోతీలాల్ నెహ్రూ) స్వదేశీ ఉద్యమ మూల సారధులలో ఒకరుగా రూపొందారు యువకులు మాత్రం, అనుశీలన, ఆత్మోన్నతి వంటి పేర్లతో చిన్న చిన్న బృందాలుగా ఏర్పడి సమితులను రూపొందించి స్వదేశీ ఉద్యమాన్ని సాగించారు. అను శీలనకు, జిల్లాలు, పల్లె ప్రాంతాలలోని తూర్పు బెంగాల్ రాజధాని ఢాకాలోనూ కూడా శాఖలున్నాయి. బరిసల్, మైమెన్ సింగ్, స్వదేశీ బృందంచే సమితి, సుహృద్‌సమితులలో శక్తివంతమైన సంఘాలు నిర్వహించారు. పైకి ఇవన్నీ సాంస్కృతిక సంఘసేవా సంస్థలుగా కనిపించినా, స్వదేశీ ఉద్యమానికి వలంటీర్ల నమోదు, 1902లో అస్తిత్వంలోకి వచ్చిన విప్లవవాదుల ముఠాలలో సభ్యత్వం విస్తరణ వంటి కార్యక్రమాలకు ఇవి ప్రధాన కేంద్రాలుగా ఉండేవి. ఆత్మోన్నతి సమితి చాలా గుట్టుగా నడిచేది. ఎంపిక చేసిన కార్యకర్తలతో రహస్య సంస్థల గురించీ వాటి కార్యకలాపాల గురించీ మోతీలాల్ తదితర ప్రజానాయకులకు ఎంతో కొంత మాత్రమే తెలుసు. అయితే వారు అహింసాయుత పద్ధతుల్లో ప్రభుత్వానికి ప్రజలు ఉమ్మడిగా ప్రతిఘటననిస్తూ ఆర్థిక పరమైన ఆంక్షలు

విధించే కార్యక్రమాన్ని సూచిస్తూ వచ్చారు. అరవిందులు ఆయన వర్గానికి బాగా సన్నిహితులు. స్వామీ వివేకానందుని శిష్యురాలయిన సోదరి నివేదిత వంటి వారితో పూర్వ పరిచయం మూలకంగా ఈ విప్లవ సంస్థల గురించి ఇతర నాయకుల కంటె మోతీలాల్ ఘోష్‌కే ఎక్కువ తెలుసు.

స్వాతంత్ర్యం సాధించడానికి అనుసరించవలసిన తిరుగుబాటు పద్ధతుల గురించి బాహాటంగా చర్చించే పత్రికలు సరిగా ఈ తరుణంలోనే ఆవిర్భవించాయి. బ్రహ్మబంధము ఉపాధ్యాయ సంపాదకత్వాన వెలువడే 'సంధ్య' దినపత్రిక, భూపేంద్రనాథ్ దత్ సంపాదకత్వాన వెలువడే 'జుగంతర్' వారపత్రిక, మనోరంజన్ గుహ ఠాకుర్త సంపాదకత్వాన వెలువడే 'నవశక్తి' దిన పత్రిక, అరవిందఘోష్ సంపాదకత్వాన వెలువడే 'బందేమాతరం', పత్రికలు తిరుగులేని ప్రచారం పొందాయి. తమ వ్యక్తిగత స్వేచ్ఛకు ఆయా సంపాదకులు ఏ మాత్రం శ్రద్ధ వహించకుండా వున్నదున్నట్లు వ్రాసేవారు. వీరిలో చాలా మందిపై రెచ్చగొట్టే రాతలు రాసినందుకు నిరంతరం విచారణలు సాగాయి. ఏ మాత్రం రాజీకి ఆస్కారంలేని ధోరణి ప్రదర్శించిన బ్రహ్మబంధము తాను తరుచూ చెపుతూ వచ్చిన విధంగానే విచారణలో గల ఖైదీగా ఉండగానే ప్రాణం విడిచారు.

ఈ లోగా, పంజాబులో రైతాంగం, భూమి చట్టాల లోటుపాట్లు మూలకంగా తీవ్ర ఆందోళన చేట్టింది. లజపతిరాయ్, అజిత్ సింగ్ ఆందోళనకు సారథ్యం వహించారు. వారి వారపత్రిక పంజాబీ ముద్రాపకుడు, ప్రచురణ కర్తను జైలుపాలు చేశారు. ఆ ఇద్దరు నాయకులనూ 1818 రెగ్యులేషన్ క్రింద అరెస్టు చేసి బర్మాకు తరలించి అక్కడ జైల్లో వేశారు. ప్రజానీకం తిరుగుబాటు కఠిన చర్యలద్వారా అణచి వేయడానికి ప్రభుత్వం పూనుకుంది. నిరసన ఊరేగింపులను, సమావేశాలను, ముఖ్యంగా విదేశీ వస్తువులు అమ్మే దుకాణాల వద్ద వలంటీర్లు సాగించిన పికెటింగ్ కార్యక్రమాలను రెండు రాష్ట్రాల గవర్నర్లు విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నించారు. ప్రయత్నాలు సాగించారు. ముఖ్యంగా తూర్పు బెంగాల్ లెఫ్టినెంట్ గవర్నర్ సర్‌బామ్ ఫిల్డ్‌ఫుల్లర్ ఆందోళనకారుల మధ్య మరీ శతృత్వ భావం వహించారు. విదేశీ వస్త్ర బహిష్కరణ కార్యక్రమాన్ని అశ్వినీకుమార్, అశ్వనీ కుమార్‌దత్ సమర్థవంతంగా నడిపిన బరిసాల్ జిల్లాలో ఆయన మరీ మహోగ్రంగా కార్యక్రమం అణచివేతకు పూనుకున్నారు. స్థానిక వివాదాల సత్వర పరిష్కారానికి పంచాయతీ

కోర్టులను కూడా అశ్వనీకుమార్‌దత్ ఆ జిల్లాలో నెలకొల్పగలిగారు. 1906 ఏప్రిల్ 14,15 తేదీలలో బెంగాల్ రాష్ట్రీయ రాజకీయ మహాసభ జరిగిన బరిసాల్‌లో ఈ ఉద్యమం తొలిసారి రక్తాన్ని చిందించింది. ఈ మహాసభకు ముందు, బహిరంగ ప్రదేశాల్లో 'బందేమాతరం' అని నినాదం చేయడాన్ని జిల్లా అధికారులు నిషేధించారు. మహాసభలో పాల్గొని విభజనను వ్యతిరేకించేందుకు చేపట్టవలసిన కార్యాచరణ క్రమం గురించి చర్చించారు. అయితే అంతకుముందే బందేమాతరం నిషేధం వచ్చింది. ఈ ఉత్తర్వు పాటించాలా వద్దా అనే అంశంపై సభలో తర్జనభర్జనలు జరుగుతున్న తరుణంలో మోతీలాల్-

"నా శిరస్సు ఏమంత విలువైనది కాదు. అందుచేత నడి వీధిలో బందేమాతరం అని అరవడం వలన నా శిరస్సు ఖండించినా సరే, ఆ నినాదం ఇవ్వడం మానను. అయితే అలా నినాదం చేసే తరుణంలో పోలీసులు అరెస్టు చేయబోతే ప్రతిఘటించవలసిందిగా మిత్రులను కోరుతున్నాను" అన్నారు. చివరికి నిషేధపు ఉత్తర్వును శాంతియుతంగా ధిక్కరించాలని నిర్ణయించారు సభలో.

మహాసభ ప్రతినిధులు తమ శిబిరాల నుంచి బైటకు వచ్చి మహాసభ స్థలికి వెడుతుండగా వారిపై పోలీసు సూపరింటెండెంట్, ఆయన వెంటగల లాఠీ బలగాలు విరుచుకుపడ్డాయి. బందే మాతరం అని అరుస్తున్న ప్రతినిధులను పోలీసులు చిత్తం వచ్చినట్లు బాదుతున్నారు. ఈ దశలో సురేంద్రనాథ్, మోతీలాల్, అశ్వనీకుమార్ ముందుకు వచ్చి తమను అరెస్టు చేయవలసిందిగా కోరారు. అయితే సురేంద్రనాథ్ ఒక్కరినే అరెస్టు చేసి మేజిస్ట్రేట్ ఇంటికి తీసుకుపోగా మేజిస్ట్రేటు సురేంద్రనాథ్‌కు రూ.400 జరిమానాను విధించారు. ఆ పైమను చెల్లించి 'బందేమాతరం' అనే నినాదాల మధ్య సురేంద్రనాథ్‌ను మహాసభకు తీసుకువచ్చారు. కలకత్తాకు చెందిన విఖ్యాత న్యాయవాది అబ్దుల్ రసూల్ అధ్యక్షోపన్యాస మిచ్చారు. మోతీలాల్ సభలో కీలక తీర్మానాన్ని ప్రతిపాదించారు. తీర్మానం సంగ్రహ పాఠం...

తూర్పు బెంగాల్, అస్సామ్ అంతటా దేశభక్తి పరులైన కార్యకర్తలపై ప్రభుత్వం సాగిస్తున్న పాశవిక చర్యల దృష్ట్యా, ఈ ప్రాంతంలో సక్రమమైన న్యాయబద్ధమైన, చట్టపరమైన పరిపాలన ఏనాడో కొరవడిందని మహాసభ భావిస్తోంది. ప్రస్తుత బాధ్యతారహిత ప్రభుత్వంపై పరిష్కారం ఆధారపడిన ఏ సమస్యనూ ప్రస్తుత

మహాసభ చర్చించబోదు. కేవలం ప్రజల స్వయంకృషి వలన పరిష్కరించదగు అంశాలను మాత్రమే చర్చించడం జరుగుతుంది."

ఈ తీర్మానం జాతీయ పోరాటానికి క్రొత్త రూపాన్ని సూచిస్తున్నది. లండన్‌లో విదేశాంగ మంత్రికి నిరసన సందేశం పంపాలన్న సురేంద్రనాథ్, భూపేంద్రనాథ్ బసుల ప్రతిపాదనను మహాసభ మెజారిటీ వర్గం వ్యతిరేకించింది. తరువాత సంవత్సరం సూరత్ మహాసభలో చీలికకు ఇది నాందీ అయింది. సూరత్ మహాసభలో జాతీయ వాదుల ప్రభుత్వంతో పోరాటంలో పద డాంబికాలకు బదులు పోరాట బలం పెంపునకు ప్రాధాన్యమివ్వాలన్నారు. మితవాదులు, ఉగ్రవాదులు మధ్య ముఖ్యమైన సైద్ధాంతిక విభేద మేమిటంటే, బెంగాల్ విభజనను వ్యతిరేకించే ఆందోళన స్వదేశీ ఉద్యమంలో భాగం కావాలని మితవాదులు భావించారు. సంపూర్ణ స్వాతంత్ర్యానికి సాధనంగా బెంగాల్ విభజన వ్యతిరేకోద్యమం చేపట్టాలని ఉగ్రవాదులు భావించారు.

పదిహేనేళ్ళ తరువాత 1921లో మహాత్మాగాంధీ అహింసాయుత పద్ధతిలో సహాయ నిరాకరణ, శాసనోల్లంఘన ఉద్యమాలకై పిలుపు నిచ్చినపుడు అప్పట్లో ఆంగ్లో ఇండియన్‌ల అభిప్రాయాలను చాటే స్టేట్స్ పత్రికలో ఈ క్రింది వ్యాఖ్య వెలువడింది.

"బెంగాల్‌లోని బరిసాల్‌లో 1906లో తొలిసారిగా శాసనోల్లంఘన జరిగింది బాబూ మోతీలాల్‌ఘోష్ ఈ ఉద్యమాన్ని తొలిసారి ప్రతిపాదించిన వ్యక్తి ఇదొక్కటే కాదు - సహాయ నిరాకారణ పద్ధతి కూడా అదే బరిసాల్‌లో బాబూ మోతీలాల్ ఘోష్‌సూచించినదే. చరఖాపై నూలువడకడం పునరుజ్జీవింప చేయాలన్న అభిప్రాయాన్నిసైతం మోతీలాల్ ఘోష్ 1906లోనే సూచించి, అందుకుగాను వ్యక్తిగతంగాను, తన పత్రిక ద్వారా ఎంతో కృషిచేశారు. ఆయన కృషి వృధా కాలేదు. బెంగాల్‌లోని భాద్రాలోక్ కుటుంబాలతో హెచ్చు సంఖ్యలో చర్కాలు వెలిశాయి. అయితే విభజనాందోళన సారధులైన నాయకులు దురదృష్టవశాత్తు ఈ చర్ఖా ప్రాముఖ్యాన్ని గుర్తించక ఆ అంశం పట్ల అంతగా శ్రద్ధ వహించలేకపోయారు.

కమాండర్-ఇన్-చీఫ్ అనుబంధ హెూదా కల్పనకు 'కర్జన్ అభ్యంతరం పెట్టడాన్ని 'వైట్‌హాల్' త్రోసి పుచ్చడంతో 1905లో కర్జన్ ప్రభువు రాజీనామా చేసినట్లు ముందు చెప్పుకున్నాం. ఆ అధిష్ఠానంలో వచ్చిన 'లార్డ్‌మింటో' నాటి

పరిస్థితిని చక్క దిద్దడానికి ఎంతో శ్రమపడి అధికార రహస్యాల చట్టాన్ని కట్టుదిట్టం చేయడం, బహిరంగ సభల చట్టాల్ని పత్రికల చట్టాల్ని, రెచ్చగొట్టే ధోరణుల అణచివేత చట్టాన్ని ప్రేలుడు పదార్థాల వినియోగ చట్టాన్ని, ఇతర అణచివేత చట్టాలన్నింటినీ చాలా కట్టుదిట్టం చేశారు. కలకత్తాలో వందేమాతరం అని అరచిన 15 సంవత్సరాల బాలుడికి శిక్షక్రింద 16 కొరడా దెబ్బలు కొట్టారు. ఈ కేసు విచారణ సాగించి తీర్పు చెప్పిన మేజిస్ట్రేట్ కింగ్‌ఫోర్డుపై పగ సాధిస్తామని విప్లవకారులు ప్రతిన పూనారు. తత్ఫలితంగా ఆ మేజిస్ట్రేటు ముజఫర్‌పూర్‌కి బదిలీ అయ్యాడు. అతన్ని మట్టుపెట్టటానికి ఖుదీరాయ్ బోస్, ప్రఫుల్ల చక్కి అనే ఇద్దరిని బాంబులిచ్చి పంపారు. అయితే పొరపాటున బాంబుల దాడిలో మేజిస్ట్రేటు బదులు ఇద్దరు యురోపియన్ మహిళలు మరణించారు. బెంగాల్ లెఫ్టినెంట్ గవర్నర్ ఆండ్రూ ఫ్రెజర్‌పైన కూడా రెండుసార్లు బాంబుల దాడులు జరిగాయి. కానీ రెండు సార్లూ వెంట్రుకవాసిలో తప్పించుకున్నారు. ఒక బాంబు దాడిలో ఢాకా డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేట్ 'అలెన్' చనిపోయారు. ప్రఫుల్ల చివరికి ఒక బెంగాలీ పోలీసు ఆఫీసరుకు దొరికి పోయాడు. చివరికి ప్రఫుల్ల ఆత్మహత్య చేసుకున్నాడు. తరువాత ఆ పోలీస్ అధికారిని విప్లవకారులు వధించారు. కలకత్తా శివార్లలోని మానిక్‌తల ఉద్యానవనంలో వున్న చిన్న ఆయుధాగారాన్ని ముట్టడించిన సంఘటనలలో అరబిందో తమ్ముడు బీరేంద్ర కుమార్ ఘోష్‌తో సహా అనేకమంది విప్లవకారులు అరెస్టు అయ్యారు. వారిపై కేసులు బనాయించి విచారణ జరిపించింది ప్రభుత్వం వారిలో చాలా మందిని నేరస్తులుగా ధృవపరచి యావజ్జీవ కారాగార శిక్ష విధించి అండమాన్ దీవులకు తీసుకు పోయారు. అరవిందోను కూడా అరెస్టు చేసి నెల్లాళ్ళ నిర్బంధంలో ఉంచిన తరువాత తగిన సాక్ష్యాధారాలు దొరకక విడిచి పుచ్చారు.

విప్లవకారులు ఇంగ్లాండ్, ఫ్రాన్స్, అమెరికాలో సైతం తమ కేంద్రాలు స్థాపించారు. బ్రిటిష్ పాలనని కూలద్రోసే ఉద్యమాన్ని అక్కడ నించి కూడా సాగించారు. వారిలో శ్యామ్‌జీ కృష్ణవర్మ, మేడం, ఎస్.ఆర్.రాణా, వీరేంద్రనాధ్ ఛటోపాధ్యాయ, తారాకాంతదాస, బేడీ సావర్కర్, లాలా హరదయాళ్ ముఖ్యులు. వీరంతా పత్రికల ద్వారా ప్రచారాన్ని సాగించారు. విదేశాలలోని భారతీయ విద్యార్థులను సమీకరించేవారు. లండన్‌లో జరుగుతున్న ఒక సమావేశంలో విదేశాంగ మంత్రి

కార్యదర్శి సర్. కర్జన్ వైల్‌ను మదన్‌లాల్ ధింగ్రా కాల్చి చంపారు. ధింగ్రాను బ్రిటిష్ ప్రభుత్వం ఉరితీసింది. కలకత్తాలో ఆలీపూర్ జైలులో ఒకానొక రాజకీయ కేసులో అరెస్టయ్యి విచారణలో వున్న సత్యన్‌బోస్ మానిక్‌లాల్ బాంబు కేసులో అప్రూవర్‌గా మారిన నిందితుడు నరేంద్ర గోస్వామిని కాల్చి చంపాడు. ఈ కేసులో దర్యాప్తు సాగిస్తున్న పోలీసు అధికారినీ, ప్రాసిక్యూషన్ న్యాయవాదినీ కూడా బూటారంగ న్యాయస్థానంలో కాల్చి చంపారు. శాంతి భద్రతలు కొరవడడానికి టెర్రరిస్టుల విజృంభణకు పత్రిక స్వేచ్ఛే కారణమని 'మింటో' తేల్చారు. 1910లో ఆయన పత్రికా చట్టాన్ని ప్రకటించారు. వార్తా పత్రికలపై ఈ చట్టం ఆంక్షలు విధిస్తున్నది. "బ్రిటిష్ ఇండియాలో ప్రభుత్వంపట్ల, ప్రభుత్వ సంస్థల పట్ల, కార్యాలయాల పట్ల, సూటిగా గాని సూచనా మాత్రంగా గానీ, ప్రజలలో ఆగ్రహాల చులకన భావాన్ని రెచ్చగొట్టే" రాతలు రాసే పత్రికలు ప్రచురితమయ్యే ముద్రణాలయ యజమాని అయిదువేల రూపాయల ధరావతు కట్టాలని ఈ చట్టం నిర్దేశిస్తున్నది.

మోతీలాల్ పత్రికకు ప్రభుత్వం నుంచి ఒకటి వెంట ఒకటిగా హెచ్చరికలు వస్తున్నాయి. 1908వ సం॥ మొదట్లో ముజఫర్‌పూర్ మృతవీరులకు, మండలేకు పంపబడిన ఖైదీలకు నివాళులు అర్పిస్తూ వ్రాసినందుగాను 'కేసరి' పత్రిక సంపాదకులు తిలక్‌కు ఆరేళ్ళ జైలు శిక్ష విధించారు. ప్రభుత్వం అంతకు నెలరోజుల ముందు రూపొందించిన వార్తా పత్రికల (నేరాలు రెచ్చగొట్టడం) చట్టం క్రింద ఈ శిక్ష విధించారు. మోతీలాల్ ఈ చట్టాన్ని విమర్శిస్తూ "మన కిప్పుడు మరో సమస్య ఎదురయ్యింది. భారతదేశంలోని ప్రతి పత్రిక ఇంగ్లీషు పాలనా యంత్రాంగంలోని ప్రతి ఒక్కరికి ధూపం వెయ్యడం మొదలుపెడితే ఇంగ్లీషు పాలకులు నిజంగా ఇష్టపడతారా అని. పత్రికల చట్టం రూపొందించడం, ఆమోదించడం అయిపోయింది కనుక. ఆ చట్టంపై ఇదే అసలైన వ్యాఖ్య బహుశా."*

ఇలాగా వ్రేళ్ళు పాదుకొని దేశంలోని ఇతర ప్రాంతాలకు సయితం వ్యాపించిన ప్రజాందోళనని మొదలంటూ త్రుంచివేయగలనని మింటో ఆశించినదంతా వమ్ము అయింది. "ముందు అణచివేత చర్య, తరువాతే రాజీ చర్యలు" అనే వైఖరిని మింటో అవలంబించి నందువలన గాని, బ్రిటిష్ అనధికారులు, మహమ్మదీయులు, హిందువులలో విద్యావంతుల వర్గాల మధ్య పొరపొచ్చాలు సృష్టించడానికి మోర్లే,

అతని స్థానంలో వచ్చిన లార్డ్ క్రెవీ జరిపిన ప్రయత్నాల వలన గానీ, బ్రిటీష్ పాలకులు ఆశించిన ఫలితాలు కలగలేదు. మోర్లే మింటో సంస్కరణలను ఒక్క మహమ్మదీయులే హర్షించారు. అదైనా స్వల్ప కాలం మాత్రమే 1911లో బెంగాల్ విభజన రద్దు వలన మహమ్మదీయులు అసంతృప్తులయ్యారు. హిందూ ఉగ్రవాదులకు అనుకూలంగా బ్రిటీషువారు తమను నట్టేటముంచేశారని భావించారు. బ్రిటీష్ వారినుంచి అనుకున్న పనులు సాధించుకొనడానికి వారిని ఆశ్రయించడం కంటే మన స్వశక్తి ప్రదర్శించడమే ఉత్తమమని హిందూ ఉగ్రవాదులు గ్రహించారు. 1902లో బొయర్స్ తమ స్వీయపాలనా లక్ష్యం సాధించుకొన్నారు; 1905లో చిన్న దేశమైన జపాన్ రష్యాను పాలించిన జార్ ప్రభువుల గర్వాన్ని హరించారు.

తరువాత వైస్రాయి లార్డ్ హార్డింగేను క్రొత్త రాజధాని ఢిల్లీలో వడిరోడ్డు మీద హత్య చేయడానికి 1912 డిసెంబరులో విప్లవకారులు జరిపిన ప్రయత్నం శాంతియుతంగా చలన రహితంగా వున్న ప్రజలలో రాజుకుంటున్న జ్వాలా తోరణాన్ని తేటతెల్లం చేసింది. మోతీలాల్ అహింసను, ప్రజోద్యమాన్నే బలపరిచారు. అయినప్పటికీ, కూడా గాంధీయుగం ఆవిర్భవించడానికి ముందు నాటి మేధావులలో రవీంద్రనాథ్ ఠాగూర్ వలే మోతీలాల్ ఘోష్ కూడా ఒక గొప్ప లక్ష్య శుద్ధితో ఉద్యుక్తమైన ప్రయోజనాలు ఆశించి ప్రాణాలను తెగించి పోరాడిన వీరుల చిత్త శుద్ధిని, ఔన్నత్యాన్ని గుర్తించి గౌరవించారు.

# 11. విషాదాచ్ఛాయలు

**1911** సంవత్సరం ఘోష్ కుటుంబానికి అత్యంత విషాదంగా మొదలైంది. రెండు దశాబ్దాలుగా మంచాన పడిన శిశిర్‌కుమర్ ఘోష్ అధిక భాగం కలకత్తాకు దూరంగా గడిపి చివరికి 1911 జనవరి 10న కన్నుమూశారు.

నలభైమూడేళ్ల క్రితం 1892లో పెద్దన్నగారు హేమంత్ కుమార్ మరణించే నాటికే శిశిర్ కుమార్ క్రియాశీలక పత్రికా రచన విరమించి 'ఆధ్యాత్మిక చింతనలోకి అగుడుపెట్టారు 1911లో ఆయన మరణంతో పత్రిక కార్యవ్యవస్థాపకులైన సోదరులు ముగ్గురిలో ఇక మోతీలాల్ ఘోష్ ఒక్కరే మిగిలారు. శిశిర్‌కుమార్ మరణించినప్పుడు "శిశిర్‌కుమార్ పావు శతాబ్దంపాటు పత్రిక ప్రధాన సంపాదకులు. నిజానికి పత్రికకు రూపాన్ని, అస్తిత్వాన్ని, ఆత్మనీ యిచ్చింది ఆయనే" అని పేర్కొన్నారు. జర్నలిజం నుంచి విరమించినప్పటినుంచి పత్రిక సంపాదకత్వ విధానాన్ని ఆయన రూపకల్పన చేసి తగు సలహాలిస్తూ వచ్చారని చాలామందికి తెలుసు. సంపాదకీయ వ్యాఖ్యలలో కొన్ని ఆయన సొంత అభిప్రాయాలని కూడా పాఠకులకు తెలుసు. నిజానికి ఆయన అభిమానులు ఆయనను మహాత్మా అని సంబోధించేవారు. ఔదార్యం, నిరాడంబరత, విధులకు అంకితమై పనిచేసే తత్వం వలన ఆయనను అలా పిలిచేవారు. బెంగాలీ సాహిత్యానికి ఆయనచేసిన చెప్పుకోతగ్గ సేవ ఆయన అయిదు సంపుటాలుగా వ్రాసిన శ్రీచైతన్య జీవితగాథ. 1870లోనే ఉన్నత బెంగాలీ కుటుంబాలలో వైష్ణవ కీర్తనల పట్ల ఆదరణ పెంచిన ఘనత కూడా శిశిర్‌కుమార్‌ఘోకు దక్కుతుంది. అన్నగారి గురించి వ్రాస్తూ మోతీలాల్ -

"దాంపత్యప్రేమ, తల్లితండ్రుల ప్రేమ, బిడ్డలపై ప్రేమ, వగైరా ప్రేమల గురించి వింటూ వుంటాం. కానీ మాకు ఆ దైవం ప్రసాదించిన అత్యంత విలువైన వరం - సోదరప్రేమ. ఇది అన్ని ప్రేమలకూ పునాది. సోదరుని కోల్పోవడమంటే

హృదయం ఛిన్నాభిన్నం కావడమే. బాబూ శిశిర్‌కుమార్ మాకు ఏక గర్భుడైన సోదరుడు మాత్రమే కాదు - మా జీవితకాలం శ్రేయోభిలాషి ఆయన - దాదాపు 60 యేళ్లపాటు అనుదినం ఆయన ప్రేమ చవి చూసిన మేము సాధించిన మంచి ఏదైనా వుంటే ఆయన పాదాల చెంతనే వుంచుతున్నాం. ఉన్నత జీవిత లక్ష్యాలను, రాజకీయాలలో ఆ ఆలను, ఆయనే బోధించాడు మాకు. కేవలం సిద్ధాంతాలు వల్లించడమే కాదు - బోధనలో భాగంగా ఆయన ఉన్నతాశయాల మేరకు జీవించి సోదాహరణ పూర్వకంగా అంతా నేర్పారు మానవుడు సమోన్నతంగా మాధవసేవద్వారాను, మానవసేవద్వారాను, మాత్రమే సిద్ధిస్తుందని ఆయన మాకు బోధించారు. ఆయవ మా మానస గురువు ఆయన సమక్షంలో మేము అనుష్టమాత్రులుగా జీవించేవాళ్లం. మరో లోకాలకు ఆయన వెళ్లిపోయారంటే - ఆ లోటు మేమీ ఇహంలో వున్నంత కాలం తీరేది కాదు. అయినా ఆయన మా స్మృతి పథంలో, పర లోకంలో చిరంజీవి."

అమృత బజార్ పత్రికను ఉమ్మడి కుటుంబ వ్యాపార సంస్థగా ఆదిలో ప్రారంభించారు. నల్భై ఏళ్ల తరువాత 1908లో దానిని లిమిటెడ్ వ్యాపార సంస్థగా రిజిష్టర్ చేశారు. అందులోని వాటాలు ఘోష్ కుటుంబాలవి పత్రిక సంపాదక వర్గం మోతీలాల్ వుండగా ఆర్థిక వ్యవహారాలు హేమంతకుమార్ ఆధీనంలోను, ఆధిపత్యంలోనూ, ఆయన మృతి అనంతరం గోలప్‌లాల్, హేమంత కుమారుడు మృనాల్ కాంతి ఆధీనంలోకి వచ్చేయి. పత్రికపై వచ్చిన ఆదాయం చాలా స్వల్పం. ఘోష్ కుటుంబం జరుగుబాటు సాగడానికి వారి స్వగ్రామంలోని భూములనించి రాబడి కూడా అవసరమయింది. మోతీలాల్‌కు కలకత్తా సమాజంలో అగ్రశ్రేణిలో స్థానం లేదు. అందుకాయన అర్రులు చాచనూ లేదు. సామాన్య పౌరుడి సాధక బాధకాలు పట్టించుకొనే తత్వమే ఆయనకు ప్రజాజీవితంలో గల బలం, గుర్తింపుకి హేతువు.

అయిదవ జార్జి ప్రభువు 1911, డిసెంబర్ 11న తన పట్టాభిషేకం సందర్భంగా బహుమతిగా ప్రకటించిన బెంగాల్ పునరేకీకరణ విప్లవ కారుల కార్యకలాపాలను ఎంతమాత్రం తగ్గించ లేకపోయింది. బెంగాల్‌లోని మరే ప్రాంతంలో విప్లవకారుల వలెనే, జాతీయవాదులు. పత్రికల పోరాట ధోరణిని ఈ చర్య ఎంత మాత్రం

చల్లార్చలేకపోయింది.

కాంగ్రెస్ నియమావళి సవరించడం ద్వారా ఆ పార్టీపై ఆధిపత్యం సంపాదించిన మితవాద నాయకులు రాజ్యాంగ సాధనాలద్వారా భారతదేశంకి యురోపియన్ సామ్రాజ్యానికి లోబడి వ్యవహరించే స్వరాజ్యాన్ని సాధించడం తమ లక్ష్యమని సాధించి నవ్వులపాలయ్యారు. ప్రగల్భాలు పలకడమే తప్ప చేతలు శూన్యమని కాంగ్రెస్‌నూ, మితవాద నాయకత్వాన్ని విమర్శించేవారు. మితవాద నాయకత్వం పట్ల విమర్శనాత్మక ధోరణి పెరగడానికి మరొక కారణమేమిటంటే మదన్‌మోహన్ మాలవ్య, భూపేంద్రనాథ్ బసు మినహా, వైస్రాయి కౌన్సిల్‌లోని ఏ భారతీయ సభ్యుడు వార్తాపత్రిక బిల్లును వ్యతిరేకించలేదు. బిల్లుకు గోఖలే మద్దతు నివ్వడం ఆయనకు గల కీర్తిని కొంత హరించింది, అయితే 1911లో వచ్చిన " ప్రజలను రెచ్చగొట్టే సమావేశాల బిల్లు" ను ఆయన నిర్బంధంగా ఖండించి ప్రజలలో తన స్థానాన్ని కొంత మేర తిరిగి నిలనబెట్టుకో గలిగారు. బ్రిటిష్వర్ల యాజమాన్యంలో గల పత్రికలు ప్రదర్శిస్తున్న రెచ్చగొట్టే ధోరణిని ఆయన దుయ్యబట్టారు.

"జాత్యహంకారంతో భారతీయులపై ముఖ్యంగా విద్యావంతులైన భారతీయులపై ఈ పత్రికలు రాసే రాతలు చురకత్తి శరీరంలోకి దిగబడిన దాని కంటే పదునుగా మనస్సుని తాకుతాయి. నా దేశీయులు అనేక మంది ఏమని భావిస్తున్నారంటే - ప్రతి ఆంగ్లో ఇండియన్ రచయితా తన కలాన్ని సర్కారువారి ఇంకుతో ముంచిరాస్తున్నారని. ప్రభుత్వం ఆ రకపు రాతలు రాయడం అసంబద్ధ - అంతకుంతా హానికరం" అని గోఖలే పేర్కొన్నారు.

అదే సంవత్సరం కలకత్తా నుంచి ప్రభుత్వం వారిని నిధులతో ప్రభుత్వ విధానాలను బలపరచే బెంగాలీ పత్రికను ప్రారంభించాలని వైస్రాయ్ కౌన్సిల్‌లో ప్రతిపాదన వచ్చింది. ఇండియన్ మిర్రర్ అనే దినపత్రిక సంపాదకుడు, మితవాది శ్రీ నరేంద్రసేన్‌కు ఈ నిధి మంజూరు చేయాలని సంకల్పం. ఈ నిధి విడుదలయింది. అంతటితో జర్నలిస్టుగా సేన్ చరిత్రకు తెరపడింది.

మితవాద జర్నలిజం, మితవాద నాయకత్వం బెంగాల్‌లో కనుమరుగవడం మొదలైంది. జాతీయవాద పత్రికలు అలవికాని అణచివేత దిగ్బంధనాల ఉచ్చుల్లో నలిగిపోతున్నాయి. ఆ బంధనాలు (1) శిక్షాస్మృతి 124 ఎ, 153 ఎ (2)

శిక్షాస్మృతి 505 సెక్షన్లు, (3) 1908 వార్తాపత్రికలు నేరాల ప్రకోపింత చట్టం, (4) 1910 పత్రికల చట్టం, (5) 1911 ప్రజలను రెచ్చగొట్టే సభలూ, సమావేశాల చట్టం (6) 1908 క్రిమినల్ సవరణ చట్టం (7) 1903 అధికార రహస్యాల చట్టం. వీటిలో కబంధ హస్తాల్లో ఇరుక్కుపోకుండా ఉండడానికి మోతీలాల్ అడుగడుగునా గండాల మధ్య ఆనించి తూచి నడుచుకునేవారు. పైగా ఆయన పత్రిక అన్నా, ఆయనన్నా అధికారులకీ, అనధికార ఆంగ్లేయులకీ తీరని కోపం. ఐతే క్రొత్త లెఫ్టినెంట్ గవర్నర్ లార్డ్ కార్మిచెల్‌కి జాతీయతా భావాలపట్ల తన పూర్వ అధికారి కంటే ఎక్కువ అభిమానం అధికారులు ఇచ్చిన సలహా పెడచెవిన పెట్టి ఆయన నాటి ప్రజల వాస్తవాస్థితిని, ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోడానికి ప్రయత్నించారు. అమృతబజార్ పత్రికలో వ్యక్తమయిన అభిప్రాయాలకి ఆయన ఎంతో ప్రాముఖ్యం ఇచ్చారు. మోతీలాల్‌తో పరిచయాన్ని పెంచుకొని ఆయనకి మిత్రుడయినాడు. ప్రభుత్వ చర్యలు, చట్టాలు, మోతీలాల్‌కి కంఠగింపయినప్పటికి కూడా ఆయన వ్యక్తిత్వం, దాపరికంలేని తత్వం ఆకర్షణలో పడి భేదాభిప్రాయాల్ని ఎవరైనా విస్మరించి తీరుతారు. యురోపియన్ అధికారులలో లార్డ్ కార్మిచెల్ ప్రైవేట్ కార్యదర్శి డబ్ల్యూ.ఆర్.గోర్లే ఆయనకు అటువంటి మిత్రుడే లెఫ్టినెంట్ గవర్నర్‌కి మోతీలాల్‌కి మధ్య భేటీ ఈయన ద్వారానే ఏర్పాటయినది. ఆతర్వాత మళ్లీ మళ్లీ సమావేశాలు జరిగాయి. 1912 మే 18న లార్డ్ కార్మిచెల్ గారు మోతీలాల్‌కు వ్రాసిన ఒక వ్యక్తిగత లేఖ ఇక్కడ ప్రస్తావించడం సముచితం.

"ఏయే సమస్యలు నేను వ్యక్తిగతంగా జోక్యం చేసుకుని పరిష్కరించాలో మీరు నేరుగా గాని పరోక్షంగాగాని నాకు సూచిస్తే మీకెంతో కృతజ్ఞుడనై ఉంటాను. తరుచుగా అమృతబజార్ పత్రికలో ఇటువంటి సూచనలు నేను చూస్తూ ఉంటాను. బెంగాలీలు సుఖశాంతులలో ఆనందమయంగా జీవించడానికి అనువుగా బెంగాల్‌ను తీర్చిదిద్దడానికి నేను ఉవ్విళ్లూరుతున్నాను. నా ప్రజలు నా పట్ల అసంతుష్టులై ఉంటారని నేనుఎరుగుదును- ఎందుకంటే చాలా మంది అనుకున్నాం అలాగే నేనే మీ వారికి సేవచేయ లేకపోతున్నానని నాకు తెలుసు ... అయితే చేతనైనంతవరకు శక్తివంచన లేకుండా కృషి చేయాలని నా ధృఢసంకల్పం. ఏ ఏ సమస్యలపై నేను తక్షణం దృష్టి కేంద్రీకరించాలో తెలిసిన వారు చెబితే సంతోషిస్తాను.

మరో సంగతి చెప్ప దలచాను, అదేమిటంటే - స్థానిక సమస్యలు క్షుణ్ణంగా తెలిసిన మరో గవర్నర్ వచ్చినా కూడ, నా పొరుగువారి భాష కూడా తెలియని నా వలెనే ఆ గవర్నర్ సైతం అనుకొన్న దానిలో పదోవంతు కూడా చేయలేకపోతాడు. చేసిన మంచి పని ఏదైనావుంటే దాన్ని భగ్నం చేసేవి ఎన్నో ఉంటాయి. వాటిని ప్రస్తుతానికి అలా విడిచిపెట్టడమే మంచిదని అనడం బహుశా నిజమేమో! అవి పూర్తిగా నిష్క్రమించేటంత కాలం ప్రగతి మందకొడిగానే అగుపించాలేమో! ముఖ్యంగా 'స్వయపాలన' లో ధోరణులు పైవిధంగానే ఉంటాయి ప్రజలు ఏమనుకుంటున్నారు అనే ప్రసక్తి వచ్చేక ఏ రంగంలోనైనా ఈ ధోరణి ఇదేవిధంగా ఉంటుంది... గవర్నర్ పదవిలో ఉన్న వ్యక్తినిజానికి ఎన్నో చేయాలని అనుకున్నా... చివరికి అతను చేయగలిగింది ఒక్కటే... వాస్తవాలను తమకు తోచిన దృష్టిలో కాక వేరే దృష్టితో చూడండని కోరడమే. అతను చేయగలిగింది -"

కార్మిచెల్ తలపెట్టిన కార్యం పూర్తిగా వేరు. 1912 డిసెంబరు 13న వైస్రాయ్‌లార్డ్ హారింగ్టన్‌పై బాంబు దాడి గవర్నర్ కర్జన్‌లోని యూరోపియన్ సభ్యులనూ, సివిల్ సర్వీసులోని యూరోపియన్లనూ, అధికారులు కాని యూరోపియన్లనూ అందరినీ సమానంగా ప్రతిస్పందింప చేసింది. ఈ బాంబు దాడిలో హారింగ్‌టన్ చేయి విరిగి పోయింది. గవర్నర్‌కౌన్సిల్‌లోని యూరోపియన్ సభ్యులూ, సివిల్‌సర్వీసులోని యూరోపియన్లూ అనధికారులైన యూరోపియన్లూ అందరూ విప్లవకారుల రక్తం కళ్లచూస్తామని ప్రతిన పట్టారు. అన్ని తరగతుల ప్రజలూ, ఉగ్రవాద కార్యకలాపాలు నిరసించేటట్లు వారి మధ్య అంగీకార పూర్వకమైన వాతావరణం కల్పించడానికి కార్మికల్ ప్రయత్నించారు. అయితే వైస్రాయ్ మండలిలోని హోమ్ శాఖ సభ్యుడు లార్డ్‌రీనాల్డ్ క్రాడాక్ ఉగ్రవాదం అనేది కొన్ని దురన్యాయం ఉనికి వల్లనే పుడుతుందనీ, ఆర్థికపరంగా నెలకొని ఉన్నా నిరాశాకరమైన పరిస్థితులు ఈ ఉగ్రవాదాన్ని రెచ్చగొట్టి పెంచుతాయనీ, ముఖ్యంగా బెంగాల్ వంటి రాష్ట్రంలో దురుద్దేశ పూర్వకమైన శక్తులను విమోచన కలిగించగల శక్తులుగా పూజించడం, ఉదాత్తులందరనూ పత్రికలూ, సభావేదికల్లో బాహాటంగా దూషించడం వంటి విచిత్ర పరిస్థితులున్నందువల్ల అక్కడ ఈ ఉగ్రవాదం పెచ్చు పెరుగుతోందనీ అభిప్రాయ పడ్డారు. అసలు బెంగాల్‌లో ప్రజలు ప్రభుత్వంపట్ల విశ్వాస భావంతో ఉండరు. అలా వుండాల్సిన పరిస్థితి కూడా కనిపించదు - అవి

కూడా ఆయన చెప్పారు.

కార్మైకేల్ క్రాడాక్ మధ్య వివాదం చివరికి ఎలా పరిణమించిందో వేరే చెప్పనక్కరలేదు. జనాభిప్రాయం మాత్రం కార్మైకేల్‌కు అనుకూలంగానే వుంది. అందుచేతనే మోతీలాల్‌కూ ఆయనకూ మధ్య మైత్రి ఏర్పడింది. భారతీయ పత్రికా రంగాన్ని చెప్పుచేతల్లో ఉండే సైనిక విభాగం మాదిరి మలచుకోవాలనీ, ప్రభుభక్తి ప్రచారాన్ని పత్రికలోకి చొప్పించాలనీ ప్రభుత్వం ఎంతో ప్రయత్నించింది గాని రెండింటా విఫలమైంది. బ్రిటన్ చేస్తున్న తప్పుడు వాగ్దానలనే కాక భారతీయులకు విధేయతా వాదాన్ని నూరిపోసే వాళ్ళని కూడా పత్రికలు నిరంతరం జలకడుగుతున్నాయి. ఈ విధేయతా వాదులనే నేషనలిస్టులు ఎంతో జాగ్రత్తగా దోషరహితంగా కనపడేలా తమ ప్రచారం సాగించినా, దేశ స్వాతంత్ర్యాన్ని తిన్నగా పోరాటంద్వారా సాధించాలనుకునే వారిని వెడిపోయిన కుర్రాళ్లగా మెత్తమెత్తగా విమర్శిస్తున్నా ఆవాదానికి పునాదయిన 'విధేయత'ని పత్రికలు విశ్లేషించి చూపిస్తూ నిశితంగా విమర్శిస్తూనే ఉన్నాయి.

కార్మైకేల్ తన అభిప్రాయాల మేరకు పోరాటం సాగిస్తూనే వున్నాడు ఉన్నత స్థానాలలో ఉన్నవారిలో అంతకు అంతా పగ సాధించాలనే పట్టుదల పెరుగుతూనే వుంది. 1914లో మొదటి ప్రపంచం యుద్ధం మొదలయ్యేదాకా ఈ కక్ష సాధింపు ధోరణి కొనసాగుతూనే వచ్చింది సదవకాశాన్ని జారవిడవకుండా క్రాడెక్ గారు ఆంక్షలు బిగింపులేని విధానానికి స్వస్తి పలుకుతూ భారత రక్షణ చట్టం తెచ్చారు. పత్రికలూ, ప్రజల నోళ్లు కట్టేసేయడం ఈ చట్టం లక్ష్యం.

క్రాడెక్ భారతీయ యాజమాన్యంలో వున్న పత్రికారంగం యావత్తునూ ద్వేషించాడు. కాని అమృతబజార్ పత్రిక ఆయనకు మరీ సింహస్వప్నం. ఈ పత్రికను ఉచ్చుల్లో బిగించాలని అధికారులు వేసిన నిఘా 1913 మే నెలలో ఓ సారి ఫలిలించింది. సిల్హెట్ జిల్లాలోని అరుణాచల్ ఆశ్రమ వాసులపై పోలీసులు బీభత్సకాండ జరిపిన సంగతిని నిబంధనలకు విరుద్ధంగా పత్రిక ప్రచురించినట్లు అస్సాం ప్రభుత్వం సుప్రీమ్ గవర్నమెంట్‌కు ఫిర్యాదు చేసినప్పుడు అది ఫలించింది.

ఈ ఆశ్రమం దయానంద అనే వైష్ణవ గురువుగారి పీఠం. గౌరవనీయ కుటుంబాలకు చెందిన స్త్రీ, పురుషులు ఈ ఆశ్రమవాసులు వారు సంకీర్తన

జరిపేవారు. కులాల మధ్య అంతరాలను పాటించకుండా, స్త్రీ, పురుష లింగ బేధాలు పాటించకుండా అంతా సమైక్యంగా సంకీర్తనలు జరపడం స్థానికులు కొందరికి కంటకంగా అనిపించి ఈ ఆశ్రమంలో సాగే సంకీర్తనలు తమకు నిద్రాభంగంగా పరిణమించాయంటూ అధికారులకు ఫిర్యాదు చేశారు. గురువుకూ, ఆయన ఆశ్రమవాసులైన శిష్యులకూ ఒక్కొక్కరికీ పదేసి రూపాయలు జుల్మానా విధించారు. అయినంత మాత్రాన రాత్రిపూట వారి భజనలూ, సంకీర్తనలూ బంద్ కాలేదు. ఈసారి ఇరుగు పొరుగు స్థానికులు మరోసారి ఫిర్యాదు చేశారు ఆశ్రమవాసులు ఒక చోరుణ్ణి అపహరించుకుపోయినట్లు ఫిర్యాదు చేశారు. ఆ బాలుని ఆచూకీ కోసం వచ్చిన పోలీసుల్ని ఆశ్రమవాసులు లోపలికి రానీయలేదు. ఈ ఆశ్రమం విప్లవకారుల రిక్రూటింగ్ కేంద్రంగా శిక్షణకేంద్రంగా వుందని అనుమానిస్తున్న అస్సాం ప్రభుత్వం మిలటరీ పోలీసుల ద్వారా ఆశ్రమంపై దాడి జరిపించింది. ఆశ్రమంలోని స్త్రీలపై మిలటరీ పోలీసులు చేయి చేసుకుంటుంటే ఆశ్రమవాసులు తిరగబడ్డారు. చేతికందిన వస్తువునల్లా విసిరేశారు. సన్యాసుల త్రిశూలాలను సైతం పోలీసుల మీదికి విసిరారు. దాడి సాగించి పోలీసుల బృందం కాల్పులు జరిపి ఆశ్రమవాసులలో ఒక ప్రముఖుణ్ణి చంపి, ఏడుగుర్ని గాయపరిచింది. అమానుషమైన ఈ దాడికి సంబంధించిన వార్తాపత్రిక సవివరంగా ప్రచురించింది. దానితో ప్రభుత్వం వాస్తవాలకు రంగుపులిమే ప్రయత్నంలో ఈ అంశంపై ఓ వివరణ వెలువరించింది. ఆ నివేదికలో ప్రభుత్వం, ఈ ఆశ్రమం ఉన్నతమైన నైతిక సూత్రాలకు వ్యతిరేకంగా అపవిత్ర, అశ్లీల, అనైతిక, అసభ్య కార్యక్రమాలు సాగించే సంస్థగా తయారైందని ఆరోపించింది. అంతే కాకుండా "బ్రిటిష్ పాలన నుంచి తమ స్వాతంత్ర్యం సాధించుకొన్నట్లు కొన్ని రోజులు ముందరే ఆశ్రమం అధికారులు ప్రకటించారు!" అ... ప్రభుత్వం చాటింపు వేసింది. ప్రభుత్వం ఇచ్చిన పై ప్రకటనతో మోతీలాల్ ఊరుకోకుండా అధికారుల వివరణలో ఉద్దేశపూర్వకమైన అసత్యాలను తూర్పారబడుతూ తన పత్రికలో విమర్శలు ప్రచురించాడు. తత్ఫలితంగా అస్సాం ప్రభుత్వం డిమాండ్ చేయడంతో కేంద్ర ప్రభుత్వం ఈ పత్రిక నుంచి 5000 (ఐదు వేలు) రూ॥లు ధరావతును కోరుతూ తాఖీదు పంపించింది. తాఖీదుకు కార్మిచెల్ అభ్యంతరం పెట్టారు కాని ఫలితం లేకపోయింది. ఇంగ్లాండులోని 'మాంచెస్టర్ గార్డియన్' అనే పత్రిక ప్రభుత్వ చర్యపై చేసిన వ్యాఖ్య

బ్రిటిష్ స్వేచ్ఛ ఎడల అభిప్రాయలను ప్రముఖంగా ప్రచురించింది:

భారతదేశంలోగాని, వేరే మరెక్కడాగాని కలకత్తా నుంచి వెలువడే అమృతబజార్ దినపత్రిక వంటిది మరొకటి లేదు. 1910 భారతీయ పత్రిక చట్టం అనే నిర్బంధ శాసనం క్రింద చర్యకు పాత్రయైన మొదటి ముఖ్యమైన ప్రజాభిప్రాయ సాధనం ఆ పత్రికే! ఆ పత్రిక పూర్తిగా ఒకే ఒక వ్యక్తి చేతులమీదుగా నడుస్తోంది. ఆ పత్రిక యజమాని, సంపాదకుడు శ్రీ మోతీలాల్ ఘోష్ చేతులమీదుగానే పత్రిక యావత్తు రూపుదిద్దు కొంటోంది. ఆ పత్రికలో అంతా ఆయనే, మరొకరులేరు. లార్డ్‌లిట్టన్ వైస్రాయ్‌గా వచ్చిననాటి నుంచీ, ఆ పత్రిక బెంగాలీ జర్నలిజం అందించిన గుణాత్మకమైన ప్రజాభిప్రాయసాధనంగా గుర్తింపు గడించింది. ఆ పత్రిక అపారమైన విజ్ఞానగనిగా, ప్రజాభిప్రాయం తెలుసుకోవడానికి తిరుగులేని మార్గంగా ఘోషుబాబు చేతిలో రూపుదిద్దుకొంది. ఆ పత్రికలోని పతాక వార్తలు, వ్యాసాలన్నీ ఒకే ఒక్కచేతి మీదుగా అనుకరణ సాధ్యం కాని శైలీ మోతీబాబు స్వయంగా వ్రాయగా వెలువడినవే! నిర్దాక్షిణ్యంగా ఆయన కలాన్ని ఝుళిపిస్తాడు.... ఆ వ్యాసాలు (అస్సాంలో పథకం ప్రకారం సాగిన దౌర్జన్యకాండపై వ్రాసినవి వ్యంగ్య వైభవంతో ఘాటైన విమర్శతో కూడిన కళాఖండాలుగా ప్రశంసలు అందుకొన్నాయి. అయితే అవి పత్రికాచట్టం క్రింద కఠిన చర్యకు అర్హమైనవా కావా అన్నది వేరే విషయం. మోతీబాబు అంత ధనవంతుడు కాదని తెలుస్తోంది కాని ధరావతు సొమ్ము ఆయన సులభంగా కట్టేయగలరు. ఏది ఏమైనా ఆయన తాను చట్టాన్ని ధిక్కరించలేదనీ, ప్రభుత్వ డిమాండ్ నిర్వేదకమైందనీ వదిలిండం తథ్యం."] ఇది అంత చిన్న విషయం కాకపోవడంతో ఈ ఉదంతం మితవాద పత్రికల దృష్టిని కూడా ఆకర్షించింది. ది పాల్ మాల్ గెజెట్ ప్రభుత్వ ధరావతు ఉత్తరువును స్వల్ప మోతాదులో సమర్థిస్తూనే మోతీలాల్‌పై ఈ క్రింది విధంగా రాసింది.

"అయితే, ఆ పత్రిక సంపాదకుడు యజమాని అయిన మోతాలాల్ ఘోష్‌ను జాతి వినాశకారిగా మనం భావించనక్కర్లేదు. ఆయన ఎప్పుడూ ముఖం మీద ఓ చిరునవ్వు తగిలించుకొని కనపడే నెమ్మదస్తుడు. యూరోపియన్‌ల వలె కనబడ్డానికిగాని, వారి వేషభాషలు అనుకరించడానికి గాని ఇష్టపడని ఒక వృద్ధుడు. ఒకసారి ఆయన కలం గంధకపాయం అవుతూ ఉంటుంది..... అయినప్పటికీ మోతీలాల్ ఘోష్ విప్లవకారుడు మాత్రం కాదు. తరుచుగా ఆయన పెళపెళ

విరుచుకు పడుతున్న తీరులో వ్రాస్తారు, కాని ప్రభుత్వ అధికారులను అలక్ష్యం చేయకుండా ఆయన స్నేహ పూర్వకంగా వారిని కలుసుకొంటూ ఉంటాడు. కొన్నేళ్లక్రితం ఆయనను అప్పటి 'వేల్స్ యువరాజు ప్రస్తుత రాజువద్దకు పిలువనంపినపుడు విధేయత ఆయనలో పెల్లుబికింది. ఉత్తర కలకత్తాలో ఒక పెద్ద పురాతన శిధిల బంగళాలో ఆయన తన పత్రిక ముద్రిస్తున్నాడు. ఉమ్మడి కుటుంబ సంప్రదాయం పాటిస్తూ అదే బంగాళాలో ఆయన అశేష బంధుకోటి మధ్య, తనపై ఆధారపడి వున్న చుట్టపక్కాలలో నివసిస్తూ ఉంటాడు. ఒకే ఒక్క తుండుగుడ్డ మొలకు చుట్టుకుని పాదాలపై పనివాళ్లు పారలుతుంటే, ఆయన ఘాటైన గంధకమం వంటి రచనలను ముఖం పై చెదరని చిరునవ్వుతో రాసుకుపోతూ వుంటాడు."

'ది పాల్ మాల్ గెజెట్' పత్రిక మోతీలాల్ అభిప్రాయాలు అంతగా పట్టించుకొనక్కరలేదనీ, ఆయన నిర్దిష్టమైన సిద్ధాంతాలేమీ లేనివాడనీ, అశక్తుడనీ, చిత్రించింది. అయితే ఈ అభిప్రాయం కూడా 'క్రాడెక్' కు సమ్మతం కాదు సెక్యూరిటీ డిపాజిట్ సొమ్ము వాపసు ఇచ్చేయవలసిందిగా కార్మిచెల్ రెండుసార్లు సిఫార్సు చేస్తే రెండుసార్లూ క్రాడెక్ తిరస్కరించాడు. అంచేత ఇక కార్మిచెల్ చేయగలిగిందల్లా ఈ డిపాజిట్ సొమ్ము జుల్మానాగా మారి మోతీలాల్ సొమ్మును కోల్పోకుండా చేయడమే! రెండు సందర్భాల్లో ఆయన ఈ డిపాజిట్ కోల్పోకుండా అడ్డు పడ్డారు.

మోతీలాల్ కార్మిచెల్‌కు చేసిన విజ్ఞప్తులలో రెండు విజ్ఞప్తులు ముఖ్యమైనవి అవేమిటంటే పోలీసులను అదుపుచేయడం, గ్రామీణ ప్రాంతాలలో పారిశుద్ధ్య సౌకర్యాలు పెంచడం. బ్రిటిష్ దొరల చెప్పుచేతల్లో ఉన్న పోలీసులకూ, మోతీలాల్‌కు ఎప్పుడూ పడేది కాదు. 1902 లో పోలీసు కమిషన్ ఆయన మెమొరాండం క్షుణ్ణంగా చదివిన తరువాత ఆయనను ముఖ్యసాక్షిగా పిలవడం మానుకోవాలని ఆదరాబాదరా నిర్ణయించింది కాని ఆ మెమొరాండాన్ని మోతీలాల్ తన పత్రికలో ప్రచురించాడు. ఆ రోజుల్లో బాగా ప్రచారంలో వున్న ఒక జోక్ ఇక్కడ ప్రస్తావించతగ్గదే.

"ఒకానొక ఉదయం కలకత్తాలో ఒక రోడ్డు ప్రక్క తూము దగ్గర ఒక తాగుబోతు పొర్లుతున్నాడు. డ్యూటీలో నిఘా తిరుగుతున్న ఒక పోలీసు ఆ

తాగుబోతుని నిలవేశాడు.

'ఏం చేస్తున్నావిక్కడ ?' అని పోలీసు గదమాయించాడు.

'అమృతబజార్ పత్రిక చదువుతున్నాను'. అన్నాడు తాగుబోతు.

అంతే!- ఆ పోలీసు అక్కడనుంచి ఉడాయించాడు!!"

గ్రామాలలో పరిస్థితులు మోతీలాల్‌కు బాగా తెలియడంవలన పల్లెల్లో ప్రజారోగ్య కార్యక్రమాలు మెరుగుపరచాలని ఆయన కోరుతూ వచ్చారు. అధికారులు ఉద్దేశపూర్వకంగా పల్లెలలో పరిస్థితులను పట్టించుకోకుండా దాటవేస్తూ వచ్చారు. 1911లో బొంబాయిలో జరిగిన మొదటి అఖిలభారత పారిశుద్ధ్య మహాసభకు అనధికార ప్రతినిధిగా మోతీలాల్ హాజరై గ్రామాలలో పారిశుద్ధ్యంపై ప్రభుత్వ విధానాలలోనే తగినంత శ్రద్ధ కొరవడిందని విమర్శించారు. "పట్టణవాసులు బయటివారి సహాయం ఏదీ లేకపోయినా రకరకాల వ్యాధి కీటకాలనుంచి స్వయంగా రక్షించుకోగలుగుతారు. అయితే మారుమూల గ్రామాల్లో నివసిస్తున్న లక్షలాది పల్లెప్రజలు ప్రభుత్వంనుంచి సహాయం లేకపోతే వ్యాధులపాలై క్రిమికీటకాదులకన్నా హీనంగా నశించిరాలిపోతారు, లేదా అశక్తులుగా మారిపోతారు" అని ఘోషించాడు. 1913 లో మద్రాసులో జరిగిన రెండవ మహాసభలో అన్ని సమస్యలకు ఏకైక విరుగుడు గ్రామీణ ప్రజలకు ఆరోగ్య సంబంధమైన విషయాలను బోధపరచడమే అని బ్రిటిష్ అధికారులు ఘంటాపథంగా బల్లగుద్ది మరీ చెప్పారు. కానీ మోతీలాల్ మాత్రం అన్నిటికన్నా అత్యంత ఆవశ్యకం బోధన కాదనీ, పరిశుభ్రమైన మంచినీటిని సరఫరా చేయడం, మలేరియా, కలరావంటి వ్యాధులని అరికట్టడం, మురికినీటి పారుదల సౌకర్యాలు ముమ్మరంగా చేపట్టడంవంటి పనులు ముఖ్యమనీ వాదించారు. అక్కరలేని మొక్కలు, చెట్లతో అడవిలా పెరిగిపోయిన దుబ్బులు నరికి వేయడం అవసరమన్నారు. తెలియని తనంతో గాక సొంతంగా పారిశుద్ధ్య పనులు చేసుకునే స్థోమతలేని గ్రామీణ ప్రజానీకం ఆర్థిక పరిస్థితి మెరుగుపరచడం అన్నింటికన్నా ముఖ్యమని ఆయన పేర్కొన్నారు. భారతదేశంలో అత్యున్నత హోదాగల బ్రిటిష్ వైద్యులు ఇద్దరు 'ది టైమ్ ఆఫ్ లండన్' పత్రికకు వ్రాసిన లేఖనుబట్టి మహాసభవిశేషాల గురించి రాయిటర్ వార్తా సంస్థ ఇచ్చిన సంగ్రహ సమాచారంలో గ్రామీణ పారిశుద్ధ్యంపై మోతీలాల్ ఇచ్చిన సలహాను విస్మరించడం జరిగిందని అర్థమయింది. ఆయన వ్యాఖ్యలు

ఎంతో కొంత ప్రభావం చూపబట్టి మరుసటి సంవత్సరం బ్రిటిష్ ఇంపీరియల్, ప్రావిన్షియల్ బడ్జెట్‌లలో గ్రామీణ పారిశుద్ధ్య పనులకు కొంత నిధులు కేటాయించారు సుంకాలద్వారా వచ్చే ఆదాయాన్ని జిల్లా బోర్డుకు సంక్రమింపచేసారు.

రాజ్యాంగ సవరణలను దృష్టిలో వుంచుకొని 1912లో తిరిగి ప్రభుత్వ సర్వీసులపై ఒక రాయల్ కమిషన్‌ను ఎనిమిది మంది బ్రిటిష్‌వారు, ముగ్గురు భారతీయులతో నియమించారు. బ్రిటిష్ వారిలో బెంగాల్ గవర్నర్‌గా కార్మిచెల్ స్థానాన రావలసిన లార్డ్ రోనాల్డ్ షే, పేరుమోసిన మహమ్మదీయ వేర్పాటువాది థియోడోర్ మోరిసన్, కాంగ్రెస్ లండన్ కమిటీలో అప్పుడు సభ్యులుగావున్న రామ్‌సేమెక్‌డొనాల్డ్‌తో బాటు ఫిషరీస్లీ అనే వింత నామధేయులైన ఇద్దరు పౌరులు ఉన్నారు. 1913లో ఈ కమీషన్ కలకత్తా సందర్శించినపుడు మోతీలాల్ దాని ముందు హాజరు కాలేనంత సుస్తీగా వున్నారు. అయితే ఆయన లిఖిత విజ్ఞాపన పత్రం ఒకటి కమిషన్‌కు పంపడంతోబాటు అమృతబజార్ పత్రికలో ఎన్నో వ్యాసాలు రాశారు. వాటిలోని అంశాలు:-

"1858 విక్టోరియా మహారాణి ప్రకటనకు భిన్నంగా దేశీయ, రాష్ట్రీయ సర్వీసులకు నియామకాలలో ఉన్నత పదవులకు భారతీయులను దూరంగా ఉంచుతున్నారు-

ఇంగ్లాండు భారతదేశాలమధ్య పరస్పర ప్రభుత్వ సర్వీసులలో ప్రవేశానికి జరిపే పరీక్షలు ఏకకాలంలో జరగాలి-

జిల్లా మేజిస్ట్రేటు పదవులలో 50% శాతం, జిల్లా జడ్జీ పదవులలో వాలుగింట మూడు వంతులు భారతీయులకు ప్రత్యేకంగా కేటాయించాలి-

ప్రావిన్షియల్ ప్రభుత్వ కార్యదర్శి పదవులలో రెండింటిని, అండర్ సెక్రటరీ పదవులన్నింటినీ భారతీయులకే ఇవ్వాలి.

పోలీసు డిప్యూటీ ఇనస్పెక్టర్ జనరల్‌లో ఒకరు భారతీయులై వుండాలి-

జిల్లా పోలీసు సూపరింటెండెంట్‌లో సగభాగం భారతీయులై ఉండాలి-

సాధారణ ప్రభుత్వ సిబ్బందికి వేతనాలు తగ్గించాలని,' బ్రిటిష్ యూనివర్శిటిల నుంచి దిగుమతైన అఖండ ప్రజ్ఞావంతులుగా చెలామణీ అయ్యేవారి సంఖ్య అంత భారీగా ఉండనవసరం లేదని కూడా ఆయన సిఫార్సు చేశారు.

కొంతకాలం తరువాత ఈ విజ్ఞాపన పత్రం, పత్రికలో వెలువడిన వ్యాఖ్యలు ఒక

పుస్తకంగా వచ్చి వెంట వెంటనే అమ్ముడుపోయాయి. అయితే ఈ సిఫార్సులు దాదాపు ఎనిమిదేళ్లు చీకటి అరల్లో ఉండిపోయాయి. 1920 లో మాండగు-చెమ్స్‌ఫోర్డ్ సంస్కరణలుగా తదుపరి విడుత రాజ్యాంగ సంస్కరణలపుడు ఈ సిఫార్సులను పట్టించుకున్నారు.

భారతీయ సాధారణ ప్రభుత్వ సర్వీసులలోని ప్రత్యేక హక్కులు, తరగని జీతాలు మాత్రం స్వాతంత్ర్యం తరువాత కూడా కొనసాగాయి.

# 12. కొండను తవ్వి ఎలకను పట్టిన ఘనత

**1912** నాటికి అజ్ఞాత విప్లవ కార్యకలాపాలు ప్రభుత్వానికి జటిలమైన సమస్యగా మారాయి. వైస్రాయ్ లార్డ్ హార్డింగ్‌పై బాంబులదాటి లక్ష్యం పూర్తిగా ప్రారంభించడంతో బాటు దాడి జరిపినవారు చిన్నపాటి ఆధారం కూడా విడవకుండా మాయమై పోయారు. సీక్రెట్ పోలీసులు వారి ఆచూకీ పట్టుకోవడానికి సుమారు రెండేళ్లు పట్టింది పైగా బెంగాల్‌లో రాజకీయ ఉద్దేశాలతో కూడిన దోపిడీలు, గుర్తు దొరకనివి సంభవిస్తున్నాయి. బెంగాల్ ప్రభుత్వం ఎంత ఆగ్రహోదగ్రమై పోయిందంటే -ప్రతీ బెంగాలీనీ, ఆఖరుకు సురేంద్రనాథ్ బెనర్జీనీ కూడా టెర్రరిస్టు కార్యకలాపాలకు వత్తాసు పలుకుతున్నట్లు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో టెర్రరిస్టుల విద్రోహ చర్యల్లో పాలుపంచుకొంటున్నట్లు భావించింది. ఈ టెర్రరిస్టు కార్యకలాపాలన్నీ ఉపాధి లేక అలమటిస్తున్న నిరుద్యోగుల పని అని, కఠినంగా వ్యవహరిస్తే అవి అణిగి పోతాయనీ క్రాడెక్ సూత్రీకరించారు. కుట్ర కేసుల విచారణలు, దైహిక, నైతిక దార్ఢ్యానికికూడా యువకుల సంఘాలు ఏర్పడకుండా వాటిని నిషేధించడం వంటి అణచివేత చర్యలు స్వదేశీ ఉద్యమాల రోజులలో అమలులోకి వచ్చాయి. తత్ఫలితంగా విప్లవసంస్థలు అజ్ఞాతంలో విస్తరిల్లాయి. ఈ ఉద్యమం సిద్ధాంతాల ఆధారంగా సాగుతున్నదని కార్మిచెల్ గుర్తించినా ఆయన వాదం అలక్ష్యానికి గురిఅయింది. ఆయన వద్దంటున్నా వినకుండా పోలీసు గూఢచారి శాఖను రంగంలోకి దించి అపరిమితంగా అరెస్టులు సాగించే అధికారం దానికి కట్టబెట్టారు. కోర్టులలో ఆమోదయోగ్యమైన సాక్ష్యాలు లేక నేరం ఋజువు కాకపోయినా అనుమానితులను దీర్ఘకాలం పాటు విచారణలో వున్న ఖైదీలుగా నిర్బంధంలో వుంచే అధికారం కూడా ఆ శాఖకు అప్పగించారు. ఇక అరెస్టుల కాండ ఎంత అక్రమంగా సాగిందంటే నిందితుల తరపు న్యాయవాదికి తన క్లయింటులు నిర్దోషులని రుజువు చేసి అనుకూలంగా తీర్పు పొందడం చాలా

సులభంగా సాగిపోయేది. 1910 హిరా కుట్ర కేసు అటువంటి కేసులలో ఒకటి. ఈ కేసులలో ఆ చివర ఉత్తర బెంగాల్, ఈ చివర పశ్చిమ బెంగాల్‌లో వేరువేరు ప్రాంతాలలోని అనుమానితులందరూ అరెస్టుల పేరిట ఒకచోట చేర్చడంతో జతిన్ ముఖర్జీ నాయకత్వంలో విప్లవకారుల సంస్థ నికరంగా రూపుదిద్దుకోవడం సాధ్యమయింది. ఈ జతిన్ ముఖర్జీయే తదనంతరం మొదటి ప్రపంచ యుద్ధసమయములో జర్మనీ ఆయుధాల రూపేణా, ధనం రూపేణా ఇచ్చిన సహాయంతో తిరుగుబాటుకు ప్రయత్నించారు.

1913 మే లో బెంగాల్ సి.ఐ.డి.కి చెందిన గూఢచారి విభాగం ఒక పెద్ద కుట్రను బైటపెట్టామని చెప్పుకుంది. బారిసాల్‌లో కొన్ని బందిపోటు సంఘటనలు జరిగిన దరిమిలా బ్రిటిష్ చక్రవర్తిపై పోరాటానికి కుట్ర జరుగుతున్నట్లు కనుగొన్నామని గూఢచారులు ప్రకటించారు. స్థానిక మేజిస్ట్రేట్ కోర్టులో గూఢచారి విభాగం ఈ మేరకు ఒక కేసు నమోదు చేసింది. తూర్పుబెంగాల్‌లోని ఇంచుమించు అన్ని జిల్లాలకూ, కలకత్తాకూ చెందిన నలభై నాలుగుమంది యువకులను ఈ కేసు క్రింద అరెస్టు చేశారు. అంత సులభంగా చేరుకోలేని మారుమూల పట్టణాన్ని ఈ కేసు విచారణకి ఎంపిక చేయడం గమనార్హం. అలాగే విచారణకు చేపట్టిన పద్ధతి కూడా అసాధారణం. పోలీసులు విప్లవకారుల ముఠాలకు చెందిన కొందరిని నిర్బంధించ గలిగిన మాట వాస్తవమే, కాని వారంతా బాహాటంగా హానికరమైన కార్యకలాపాలకు పాల్పడ్డారని నిరూపించడం ప్రాసిక్యూషన్‌కు దుర్లభం. నిందితులలో యుక్త వయస్కులైన విద్యార్థులు కూడా వున్నారు. నిందితులపై మోపిన ఆరోపణల పత్రాల నకళ్లు వారి కివ్వకుండా నిరాకరించారు. అంతేకాక ఫిర్యాదీ ప్రకటన కాపీలు కూడా ఇవ్వలేదు. పైగా వారందర్నీ తాళ్లతో కట్టి చేతులకు బేడీలు కట్టి వీధులలో ఊరేగించారు. న్యాయసూత్రాలకు పూర్తిగా విరుద్ధంగా పోలీసులు అవలంబిస్తున్న ఇటువంటి పద్ధతుల పైనా, " నేర పరిశోధక శాఖవారి ప్రస్తుత సంచలనాత్మక భయోత్పాదక కార్యక్రమం స్వరూప స్వభావాల" పైన పత్రిక కొరడా దెబ్బల వలె ఘాటైన విమర్శలు గుప్పించింది. "రాను... రానూ యావత్ దేశంలోని అనేకమంది ప్రజలని లేదా జాతి మొత్తాన్ని ఈ కుట్రకేసులో ఇరికించ దలచారా అనే అనుమానాలు కలుగుతున్నాయి. ఈ ప్రయత్నంలో మూలమూలలా గాలించి మొత్తం దేశాన్ని తలక్రిందులు చేసినా చేయవచ్చు" అని

పత్రిక వ్రాసింది. నిందలపై ప్రైమరీ కేసుకు అస్కారం ఉందో లేదో చూసి, ఉన్న పక్షంలో, వారు తమ తరుపున వాదించుకొనే అవకాశం కల్పించాలని పత్రిక కార్మిచల్‌కు విజ్ఞప్తి చేసింది. "ప్రాసిక్యూషన్‌కు మద్దతుగా ప్రభుత్వ అపరిమిత వనరులున్నాయి, డిఫెండెంట్లు అయిన నిందితులకు మిత్రులూలేరు నిధులూలేవు సరికదా వారి వ్యక్తిగత స్వేచ్ఛ కూడా గుంజుకున్నారు. ఆ రకంగా యీ పోరాటం అసమానమైంది. డిఫెండెంట్లు సహజమైన నేరస్థులు కాని పక్షంలో తమ వ్యక్తిత్వానికి ఏర్పడిన మచ్చ తొలగించుకోవడానికి తమను తాము రక్షించుకోవడానికి ప్రభుత్వం వారికి సకల సదుపాయాలు కల్పించాలి," అని నేరం చేసినట్లు ఋజువయ్యేదాక ఏ వ్యక్తినైనా నేరం చేయని వ్యక్తిగానే పరిగణించాలన్న బ్రిటిష్ న్యాయసూత్రాన్ని మోతీలాల్ ఈ కేసులో తన వాదానికి ప్రాతిపదిక చేసుకొన్నారు. భారతీయుల అభిప్రాయాలు ఈ కేసులో మోతీలాల్ పక్షాన ఉండగా ఆంగ్లో ఇండియన్ పత్రికలు మాత్రము పోలీసుల ప్రవర్తనను విమర్శించడంలో మోతీలాల్ ప్రభుత్వాన్ని కోర్టు ధిక్కారణకు పాల్పడినట్లు చిత్రించారని ఆగ్రహపూరితంగా వ్రాశారు.

ప్రభుత్వం వెంటనే దానిని సావకాశంగా తీసుకుని, మోతీలాల్‌ను పత్రిక ముద్రాపకుడు, ప్రచురణకర్తను కోర్టు ధిక్కారణ కేసులో ఇరికించారు. ఈ కేసు విచారణకు జెంకన్స్, సి.జె, స్టిఫెన్,, అసూతోష్‌ముఖర్జీ జె.జెలతో కలకత్తా హైకోర్టు ప్రత్యేక పీఠం ఏర్పాటైంది. ప్రభుత్వం తరపున అడ్వకేట్ జనరల్ కెన్నికీ వాదించగా డిఫెండెంట్ల తరపున న్యాయశాస్త్ర రంగానికి చెందిన ప్రముఖ న్యాయవాదులు వాదించారు. అప్పుడు పత్రిక సంపాదకుడు పలానావారిని ప్రకటించాలన్న నిబంధన ఏదీ పత్రికలపై లేనందువలన పత్రిక సంపాదకుడు, మేనేజరు శ్రీ మోతీలాల్ అని నిర్ధారించే సాక్ష్యాధారాలు తెమ్మని ప్రాసిక్యూషన్‌ను ప్రధాన న్యాయమూర్తి డిమాండ్ చేశారు. అటువంటి ఆధారాలు ఏవీ కోర్టుకు సమర్పించనందువలన కోర్టు ఈ కేసు కొట్టివేస్తూ "ఆయనను ఈ కేసులో బాధ్యునిగా చేసేందుకు అవసరమైన పత్రాలు ఏవీ లభించలేదు" అని వ్యాఖ్యానించింది. ప్రింటర్, పబ్లిషర్‌పై కూడా అదే కారణంపై కేసు కొట్టి వేశారు. "అక్కడి కక్కడ మేము చర్య గైకొనడానికి ఎటువంటి కోర్టు ధిక్కారణకూ వారు పాల్పడినట్టు రుజావు కాలేదు." అని కోర్టు ప్రకటించింది. అసలు కోర్టు ధిక్కారణానేరం

జరగనేలేదని న్యాయమూర్తి ముఖర్జీ వ్యాఖ్యానించారు.

అప్పుడు ప్రభుత్వం కోర్టు ధిక్కారణ బిల్లును ప్రవేశపెట్టింది. ఈ బిల్లులోని నిబంధనలలో ప్రతి పత్రికాప్రతి సంచికలోనూ సంపాదకుని పేరు ప్రకటించాలన్న నిబంధన కూడా వుంది. అయితే కారణాంతరాల వలన ఈ బిల్లు ఆమోదముద్ర పొందడానికి 12 సంగరాలు పట్టింది.

భారతీయుల విషయానికొస్తే హైకోర్టు తీర్పు జాతీయవాదులు గెలుపు సాధించిన తొలి న్యాయశాస్త్ర పోరాటం కాగా బ్రిటీష్‌కు మాత్రం హైకోర్టుతీర్పు ఆ హైకోర్టును అస్తిత్వంలోకి తీసుకువచ్చిన ప్రభుత్వానికి తిన్నగా తగిలిన ముష్టి ఘాతమైంది. జాతీయవాదులు సాధించే ప్రతి విషయం జాతీయతా వాదులకు, ఉగ్రవాదులకు కూడా సహజంగానే ప్రయోజనకరం కాబట్టి వారు ఈ విజయంతో ఉప్పొంగిపోయారు." అని 'ది ఇంగ్లీష్‌మాన్' పత్రిక వ్యాఖ్యానించింది. ఇంగ్లీష్‌మాన్ ఇంకా ఇలా రాసింది :- "ఈ పత్రిక సంపాదకుడు కలహ భోజనుడిలా అగుపడుతోంది - హైకోర్టు అభిప్రాయం ప్రకారం అతనొక అనామక భూతం అతను అయిష్టంగానే విమర్శక బాణాలు విసురుతాడు. అవి మిత్రుడికి తగులుతాయో, శత్రువుకి తగులుతాయో పట్టించుకోడు "

బ్రిటిష్ స్వేచ్ఛావాదులు హైకోర్టు తీర్పును శ్లాఘించారు. 'కాపిటల్' అనే వార పత్రిక ఎంతో శ్రమపడి కొండను త్రవ్వి ఎలకను పట్టిన చందాన ఈ కేసు చివరికి తేలిపోయిందని వ్యాఖ్యానిస్తూ ప్రభుత్వ విధానాలను దుయ్యబట్టడంలో బ్రిటిష్ పత్రికలు అంతకంటే ఘాటయిన వ్యాఖ్యలు చేస్తూ కూడా ధిక్కారం కేసులలో ఇరుక్కోకుండా స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తున్నాయని రాసింది. ఈ విషయంపై ఆ పత్రిక ఇంకా ఇలా రాసింది.

"ఐర్లాండుకు స్వయం పాలనా హక్కును ఇంగ్లాండులోని మితవాద పత్రికలు, భారతదేశంలోని వాటి 'ఆంగ్లో ఇండియన్ గ్రామ్‌ఫోన్లు'వ దగ్గ పత్రికలు ఎలా వ్యతిరేకిస్తూ వచ్చాయో గమనించి భారతీయ పత్రికలు ఎన్నో గుణపాఠాలు నేర్చుకున్నాయి. దిగువ సభలో మెజారిటీ మద్దతుగల ఒక ప్రభుత్వ విధానాన్ని ఆ పత్రికలు వ్యతిరేకించి యథేచ్ఛగా దైవ దూషణా సదృశమైన నిందలు గుప్పిస్తూ వ్యాఖ్యలు చేయడమే కాక ఆ దేశంలో సాయుధ తిరుగుబాటును సైతం ప్రేరేపిస్తూ రాతలు రాయగా లేనిది ఒకానొక భారతీయ పత్రిక తప్పయినా

ఒప్పయినా తన జాతి శాంతి భద్రతలకు గొడ్డలిపెట్టని తాను నిశ్చయంగా భావించిన ప్రభుత్వ విధానానికి పదగుంభనగల ఘాటైన వ్యాఖ్యల ద్వారా నిరసన తెలిపినపుడు ఆ పత్రికకు దోషం అంటగట్టడం ఎంతమాత్రం సబబుకాదు..
హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి విజ్ఞప్తిపైన ఆయన సహచరుల తీర్పును హర్షిస్తున్నాయి. అది పత్రికా ప్రపంచానికి దోష రహితంగా నిరూపించే యోగ్యతా పత్రాలు కూడా భారతీయ ప్రభుత్వ అధికార యంత్రాంగాల పత్రికా రంగాన్ని అదుపాజ్ఞలో వుంచుకోవడానికి ఎంత గావో అంగలారుస్తోంది. సర్ రోనాల్డ్ క్రాడెక్ హోమ్‌శాఖ ఇన్‌ఛార్జ్‌గా ఉన్నంతకాలం సిమ్లానించిగాని, ఢిల్లీనించిగానీ ధైర్యంగా ఘాటైనవిమర్శలతో పత్రికను నడిపే జర్నలిస్టును తలచుకుంటే జాలి పుడుతోంది. పాపం అసలు అటువంటి జర్నలిస్టు ఉద్భవించకుండా వుంటేనే మేలు "

9/ కర్జన్ లాగానే క్రాడెక్ కూడా బెంగాల్‌లో శాంతిభద్రతలు నెలకొనాలంటే విభజించడమే మార్గమని నమ్మారు. గౌహతీ నుంచి లాహోర్ దాకా విస్తృతమైన పరిధి కలిగిన కలకత్తా యూనివర్శిటీ జాతీయ భావాలుగలవారికే అధ్యాపకులుగా నియమించే విధానాన్ని అనుసరిస్తూ ప్రభుత్వ వ్యతిరేక జాఢ్యం మహమ్మారిలా వ్యాపించడానికి హేతువవుతున్నదని ఆయన భావించారు. ఈ యూనివర్శిటీ బ్రిటిష్‌రాజ్ ఆధీనంలో ఉండడంచేత, సెకండరీస్కూల్‌కు గుర్తింపునిచ్చే ఈ యూనివర్శిటీ అధికారాన్ని ఉపసంహరించి ఆ అధికారాన్ని ప్రభుత్వానికి కట్టబెట్టాలని 1913లో ఒక ప్రతిపాదన చేసింది. దాని కారణంగా బెంగాల్ విద్యాశాఖకు కొత్త డైరెక్టర్‌ను ఇంగ్లాండు నుంచి 'దిగుమతి' చేశారు. అబ్దుల్ రసూల్, అబ్దుల్లా అల్ - మామున్‌సురావార్దీ, కె.పి. జమాస్వాల్ అనే ముగ్గురు మేధావులను యూనివర్శిటీ లెక్చరర్లుగా నియమించడాన్ని బెంగాల్ ప్రభుత్వ సమ్మతితో తిరస్కరించారు. వారు రాజకీయాల్లో క్రియాశీలకంగా పాల్గొంటున్నారన్న కారణంపై నియామకాన్ని తిరస్కరించారు. పత్రిక ఇలా వ్యాఖ్యానించింది :-

"కొత్త విద్యావిధానం ఉద్దేశం యూనివర్శిటీపై బ్రిటిష్ ప్రభుత్వ అధికారుల పెత్తనాన్ని మరింతగా పెంచి వారికి విశేషాధికారాలు కట్టబెట్టి, మన శక్తియుక్తులను నీరు కార్చించి, మన పిల్లల చదువులకు విఘాతం కల్పించుటకుతప్ప మరింకేమీ కాదు." ఈ వ్యాఖ్య నాటిప్రజల ఏకాభిప్రాయంతో సరితూగింది. ఈ కొత్త విద్యా విధానానికి బెంగాల్‌నిరసనను గొంతెత్తిచాటేందుకు టౌన్‌హాల్‌లోజరిగిన బ్రహ్మాండ

మైన బహిరంగసభలో అన్ని వర్గాల ప్రజల అభిప్రాయాలకు ప్రాతి నిధ్యంవహించే ఎందరోనాయకులు ప్రసంగించారు. వేర్పాటు "బెంగాల్ విభజించాలన్న పట్టుదల ఇంకా ఉధృతంగా ఉంది" అ సభలో ఆమోదించిన తీర్మానంలో చాటారు.

ఈ సభలో మోతీలాల్ అందరికంటే గొప్పగా మాటిగా ప్రసంగించారు. అయినప్పటికీ ఆయనపై ప్రజలను రెచ్చగొట్టుతున్నట్లు కేసు బనాయించ లేదంటే, అధికారులు అటువంటి కేసులో ఎదురయ్యే పరిణామాలు తలచుకొని భయపడుటకు కారణం మోతీలాల్ తన ప్రసంగంలో ఇలా వ్యాఖ్యానించారు :

"బిడ్డ తల్లిపట్ల కాకుండా బిడ్డపట్ల ఎక్కువ ప్రేమ కనపరిచే స్త్రీని మంత్రగత్తెతో పోలుస్తారు. మన పిల్లలకు మన జాతీయతే సహజ సిద్ధమైన సంరక్షకులైనప్పటికీ కూడా వాళ్ల బాగోగుల గురించి ఎక్కడనుంచో వచ్చిన విదేశస్థులు ఎక్కువ ప్రేమాదరాలు, ఆత్మీయతా కనపరచడం కొత్తేమీ కాదు. అసలు ఆంగ్ల విద్యార్థులకు విద్యాబుద్ధులు నేర్పే బాధ్యతని ఇంగ్లీషు విశ్వవిద్యాలయాలే కాక తమ చేతిలో పెట్టాలని జపాన్ అధికారులు అంటే ఇంగ్లీషు వాళ్లు ఏ విధంగా భావిస్తారో చెపుతాముకానీ భారతదేశంలో అన్ని అసందర్భాలూ సంభవాలే."

కార్మిచల్ ఆదేశంపై కలకత్తా యూనివర్శిటీ నెత్తిపై రుద్దాలనుకున్న ప్రతిపాదనలు, వైస్‌ఛాన్సలర్‌గా శ్రీ అశుతోష్ ముఖర్జీ స్థానే ఆంగ్లేయుణ్ణి పట్టుకువచ్చే పథకం ఉపసంహరించాక. కాని ఎనిమిదేళ్ల తరువాత యూనివర్శిటీని వికేంద్రీకరించినపుడు తిరిగి పై ప్రతిపాదనలన్నీ అమలులోకి వచ్చాయి.

1913 ఆగస్టులో బెంగాల్‌లో దుఃఖదాయని దామోదర్ నదికి ఉధృతంగా వరదలు వచ్చాయి. ఈ వరదలు బర్ద్వాన్ జిల్లాను, పొరుగునగల హుగ్లీ, మిడ్నపూర్ జిల్లాలను ముంచెత్తాయి. బెంగాల్ ప్రజలు వరద బాధితుల సహాయార్థం కార్యరంగంలోకి దుమికారు. భారీఎత్తున నిధులు ప్రోగుచేశారు. లార్డ్ కార్మిచెల్ అధ్యక్షతన ఆ సందర్భంలో జరిగిన ఒకానొక సమావేశంలో ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ జెంకిన్స్ సారథ్యంలో ఒక పౌర సంఘం ఏర్పడింది. ఈ కమిటీకి ఎన్నికైన మోతీలాల్, ప్రభుత్వం నుంచి చాలినంత కరువు సహాయ నిధులకై కమిటీ సమావేశంలో హృదయాలను కరిగించే రీతిలో విజ్ఞప్తి చేస్తూ ప్రసంగించారు. గవర్నర్‌ను సంబోధిస్తూ ఆయన ఇలా అన్నారు :

"మేము లక్ష రూపాయల నిధిని విరాళాల రూపంలో సేకరిస్తే, ప్రభుత్వం దొడ్డ

హృదయంతో జనం : ుంచి మరో తొమ్మిది లక్షలు మంజూరు చేసిందని నేను ఆశించ వచ్చునా? పన్ను చెల్లింపుదారు డబ్బును ప్రభుత్వం ఇటువంటి సంద ర్భాలకు వెచ్చించకూడదని వాదించే వారందరికీ నాది ఒకటే సమాధానం- ఆ పన్నుచెల్లించే ప్రజానీకాన్ని అడగండి, ప్రజాభిప్రాయ సేకరణ జరిపించండి, వారిలో 99 శాతం మంది ఇటువంటి సమున్నతమైన కారణానికి తమ డబ్బును వెచ్చించ డానికి ఆ నందంగా సమ్మతిస్తారు. అందుకు ప్రభుత్వం అభ్యంతరం చెప్పదు."

మొత్తం దేశమంతటా కదిలింది దేశం నలుమూలల నుంచీ ఆర్థికంగానూ, ఇతరత్రా సహాయం అందింది. బెంగాల్ వెలుపలనుంచి కూడా స్వచ్ఛంద కార్యకర్తలు పెద్ద సంఖ్యలో వరద బాధితులను ఆదుకోవడానికి ముందుకు వచ్చారు. యువజన సంఘాల అణచివేత తర్వాత అదే మొదటిసారిగా బెంగాల్ యువతకు గొప్ప మానవత ధర్మంతో కార్యరంగంలోకి దుమికే అవకాశం వచ్చింది రామకృష్ణ మిషన్‌తో బాటు సహాయ కార్యక్రమాలు పూనికతో జరగడానికి అజ్ఞాత ఉద్యమ నాయకులే కారణం. అజ్ఞాత ఉద్యమంలోకి కొత్త కొత్త వాలంటీర్లను చేర్చుకున్నారు. నాలుగేళ్ళ తరువాత, దామోదర్ వరద బాధితులకు నీటుగా సహాయ కార్యక్రమాలు జరిపిన ఘనత నాటి యువతదే అని అంతా గుర్తించడంతో విచారణ లేకుండా నిరవధికంగా యువతను నిర్బంధించడాన్ని నిరోధించడానికి అవకాశం ఏర్పడింది

రాజకీయవాదిగా, పత్రికా రచయితగా ఎంతో కృషి చేసిన మోతీలాల్‌కు ఇపుడు పూర్తిగా వేరే ప్రపంచమైన సాంస్కృతి రంగం నుంచి కూడా పలు కార్యక్రమాల నిర్వహణకు పిలుపు వచ్చింది. చిన్న నాటినుంచీ సంగీతం అంటే చెవికోసుకొనే గుణమున్న మోతీలాల్ సమయం చిక్కినప్పుడల్లా సంగీత కచేరీలకు హాజరయ్యేవారు శాస్త్రీయ ధ్రుపద, ఖయాల్, వైష్ణవ పదావళి కీర్తన అంటే ఆయనకు ఎంతో ఇష్టం. అలాగే శరీరదార్ఢ్యం, నేర్పు, జట్టులోని అందరూ కలిసి కట్టుగా గెలుపుకోసం కృషి చేసే గుణం మినహా ఖర్చుతో కూడుకొన్న సాధనసంపత్తి అవసరం లేని కబాడీ వంటి భారతీయ ఆటలంటే కూడా ఆయనకు ఇష్టం. ఇందులోకూడ దేశజనాభాలో 90 శాతం దాకా వున్న గ్రామీణుల తరపున ఆలోచించడమే కనబడుతుంది - ఆయన రాజకీయ దృక్పథంలో కూడా ఇదే ఆలోచనా సరళి ఉంటూ వచ్చింది ఎప్పుడూ.

# 13. మొదటి ప్రపంచ యుద్ధం

మహాయుద్ధం అని పిలువబడిన మొదటి ప్రపంచ యుద్ధం 1914 ఆగస్టు 4వ తేదీన ప్రారంభమైంది. బ్రిటన్, ఫ్రాన్స్, రష్యా కలిసి ఆస్ట్రియా జర్మన్‌లపై పోరాటానికి తలపడ్డాయి. సహజంగానే భారతదేశం బ్రిటన్ పక్షం వహించింది. ముస్లిం ప్రపంచపు కలీఫ్ (ఆధ్యాత్మిక నాయకుడు) గా పరిగణించిన సుల్తాను పాలన క్రిందవున్న టర్కీ జర్మనీ పక్షం వహించి బ్రిటన్‌పై పోరాటం సాగించింది. ఈ అత్యవసర పరిస్థితిని పాలకుల విధేయతలో సేవ చేస్తే, యుద్ధం ముగిసిన తర్వాత ఇండియాకు మరింత స్వయం నిర్ణయాధికారం రూపంలో ప్రతిఫలం లభించాక అవకాశం ఉన్నదని భారతదేశంలోని యోజెరేట్లు (మితవాదులు, అతివాదులూకాని వారు) భావించారు. ప్రభుత్వం ప్రాపకం, రక్షణ క్రింద వున్న స్వప్రయోజనాపరులు విజయసాధనలో బ్రిటన్‌తోడ్పడాలని సహజంగానే సంకల్పించడం జరిగింది. బెంగాల్ విభజన రద్దు కారణంగా ఒక రాష్ట్రంలో అత్యధిక సంఖ్యలో వుండి పొందే ప్రయోజనాలు కోల్పోయినందున ముస్లింలోని మధ్యతరగతివారు బ్రిటన్ నమ్మదగినదికాదని భావించారు. 1911లో ఇటలీ, టర్కీల మధ్య యుద్ధం జరిగినపుడు క్రైస్తవ రాజైన బ్రిటన్ టర్కీకి మద్దతునివ్వ నిరాకరించింది. 1912 లో జరిగిన బాల్కన్ యుద్ధం ఇస్లామిక్ సామ్రాజ్యంపై బ్రిటన్‌లో 159 రాజ్యాల దురాక్రమణకిది తార్కాణమని భావించినందున బ్రిటన్ ప్రభుత్వం పట్ల ముస్లిమ్‌లు ద్వేషం పెంచుకున్నారు. బ్రిటిష్‌పాలన పట్ల వ్యతిరేకంగా పోరాడుతున్న కాంగ్రెస్ పట్ల జాతీయవాదుల పట్ల సానుభూతి కనబరచారు. మౌలానా అబ్దుల్ కలామ్ ఆజాద్, మహమ్మద్ ఆలీ, షిబ్లినోమానీ ముస్లిం వర్గాల కొత్త నాయకులుగా ఆవిర్భవించారు. అరగఫ్‌కు చెందిన సాహెబ్‌ల గుత్తాధిపత్యం అంతమైంది. 1913 నాటి లండన్ ఒడంబడిక కారణంగా బ్రిటన్ పట్ల ముస్లింల అవిశ్వాసం మరింత పెరిగింది. ఆ ఒడంబడికలను గురించి,

దక్షిణ యూరప్ ప్రాంతంలో స్వాధీనం చేసుకున్న ప్రాంతాలను టర్కీ, బ్రిటన్‌కు తిరిగి వదులుకోవలసి వచ్చింది. ముస్లిం లీగ్ పట్ల కంటే ఉధృతమైన జాతీయోద్యమం పట్ల విధేయత కనపరచాలని లీగ్‌లోనూ, వైస్రాయ్ కౌన్సిల్‌లోనూ అప్పటికే 160 వున్న మహమ్మద్‌అలీ జిన్నా సంకల్పించారు.

బ్రిటన్ ఎదుర్కొంటున్న ఇబ్బందులు తాము విజృంభించడానికి చక్కని అవకాశం కల్పించాలని బెంగాల్ జాతీయ వాదులలోని విప్లవ వర్గం భావించింది. విదేశ ప్రభుత్వాన్ని పడగొట్టి తిరుగుబాటు జరపడానికి ఆయుధాలను, ధనాన్ని సరఫరా చేసే విషయంలో జర్మన్ ప్రభుత్వంతో యూరప్, అమెరికాలోని ఆ వర్గం సహచరులు ఒప్పందం కుదుర్చుకున్నారు. ఈ తిరుగుబాటులో భారతీయ సైన్యంలోని కొన్ని విభాగాలకు సైతం ప్రమేయం కల్పించాలని తలపెట్టారు. బ్రిటిష్ ప్రభుత్వ పాలనా అధికారం చేపట్టిన తర్వాత భారతీయ సైన్యం నుంచి తొలగించివేసిన బెంగాలీలను తిరిగి అధిక సంఖ్యలో సైన్యాలను చేర్పించడానికి మొదటి ప్రపంచ యుద్ధం తగినదని భారతీయ రాజకీయ నాయకుల్లోని తీవ్రవాద వర్గం భావించింది. అజ్ఞాత నాయకులు కూడా తమకు రః కారణాల వలన ఆ ప్రతిపాదనను సమర్థించారు బెంగాలీలు తిరిగి సైన్యంలో చేరాలని ప్రతిపాదనను ప్రచారం చేయడంలో మోతీలాల్ ప్రముఖ పాత్ర వహించారు. " ఆ ప్రత్యామ్నాయంలో బ్రిటన్‌కు ఇండియా తోడ్పడితే రః సహాయానికి ప్రతిఫలం లభించకపోదు అనే దృష్టితో ప్రభుత్వంలోని బాధ్యతాయుతమైన వర్గాలవారు ఇచ్చిన హామీలను మహాత్మాగాంధీ తదితర పలు భారతీయ నాయకుల వలనే మోతీలాల్ కూడా గట్టిగానే నమ్మారని మోతీలాల్ జీవిత చరిత్ర రాసిన ఆయన మనవడు శ్రీ.పి.దత్తా పేర్కొన్నారు. ఈ గ్రంథ రచయిత ఈ అభిప్రాయంతో ఏకీభవించడంలేదు. బ్రిటిష్ ప్రభుత్వ వాగ్దానాలను చూసి ఆ ప్రభుత్వం పట్లగల అపనమ్మకాలని మోతీలాల్ ఎన్నటికీ మెచ్చుకోలేదని ఆయన అడుగడుగునా బ్రిటిష్ ప్రభుత్వాన్ని చీల్చిచెండాడుతూ వ్రాసిన విమర్శలను బట్టి అర్థమవుతోంది. అయితే మానవుడికి ఎప్పటికప్పుడు ఆశ చిగురుస్తూనే వుంటుంది అనేది వేరే విషయం.

ప్రాంతాలవారీగా స్వపరిపాలనను అనుమతించే ప్రతిపాదనని ఎలా వెనక్కి నెట్టివేస్తున్నారో, క్రాడెక్ ముందు కార్మిచెల్ ఎలా పట్టుకోల్పోతున్నారో జాతీయ

ఉద్యమకారులు గ్రహించారు. యుద్ధానికి ముందే బిపిన్ చంద్రపాల్ "ఈ దేశంతో బ్రిటిష్‌వారికి గల సంబంధాలను బట్టి, బ్రిటిష్ ప్రభుత్వానికి, ప్రజాహక్కులకీ మధ్య రాజీ కుదిరే అవకాశం లేదు" అన్నారు

"ఒక ప్రక్క కౌన్సిళ్ల పునరుజ్జీవ స్థితీకరణ ప్రజల కళ్ళ ముందే చెదిరిపోయాయి. వాస్తవం ఎంతో విచారించతగ్గదిగా వుంటే, కాంగ్రెస్ నాయకులు ఎంతో ఆకర్షణీయమైన ఊహ అల్లుకున్నారో తలచుకుంటే ఆశ్చర్యమేస్తుంది" అన్నారాయన.

స్వాతంత్ర్య సాధనకు సార్వత్రిక తిరుగుబాటు ఒకటే ప్రత్యామ్నాయం అనే అస్త్రాన్ని తార్కిక దృష్టితో గ్రహించడానికి నిరాకరించిన మోడరేట్లు కూడా, బ్రిటిష్ సామ్రాజ్యంతో పూర్తి స్వయం పాలనాధికారాన్ని ఫలానా తేదీ కల్లా అప్పగిస్తామని బ్రిటన్‌నించి ఇదమిద్ధమైన వాగ్దానం పొందాలంటే ప్రజల ఐక్య సంఘటనయే రాజ్యాంగ బద్ధమైన మేలైన మార్గమని గ్రహించసాగారు. అయితే ఈ విషయాన్ని పూర్తిగా గ్రహించేప్పటికి రాజకీయ పరిస్థితి ఎంత దిగజారింది; తమను పట్టించుకునేవారు లేరని మోడరేట్లు గ్రహించారు

కుట్రలను విచ్ఛిన్నం చేసేలా బాధ్యతను 1914 డిసెంబరులో సర్వాధికార ప్రభుత్వం స్వీకరించింది. 1915 మార్చిలో కొత్త రక్షణ చట్టాన్ని వైస్రాయ్ కౌన్సిల్‌కు సమర్పించడం, కౌన్సిల్ దాన్ని ఆమోదించడం ఒక రోజులోనే జరిగాయి విచారణ లేకుండా ఎవరినైనా అరెస్టు చేయడానికి, నిర్బంధించడానికి ప్రభుత్వానికి అపరిమితమైన అధికారాలు దత్తంచేసే ఆ చట్టం ప్రవేశపెట్టిన వెంటనే యావత్ భారతదేశం అంతటా నిరసన వెల్లువ పెల్లుబికింది ముఖ్యంగా బెంగాల్, పంజాబ్‌లో టెర్రరిస్టు కార్యకలాపాలు ఎక్కువ కావడం, భారత-జర్మన్ కుట్ర గురించి విదేశీ సంస్థల నివేదికల ద్వారా తెలిసిరావడం వలన బ్రిటన్ ప్రభుత్వం అంత ఆదరాబాదరాగా ఆ చట్టాన్ని ప్రవేశపెట్టడం జరిగింది. కుట్ర గురించి అమెరికాలో పనిచేస్తున్న చెకొస్లొవియా విప్లవకారుల నక్కడి భారతీయ విప్లవకారులను తరిమివేశారు. ఆస్ట్రియా నుంచి విముక్తి ఉద్యమంతో మిత్ర దేశాలతో సహకరిస్తున్న చెకొస్లొవియా విప్లవకారులు వెంటనే ఆ కుట్ర గురించి బ్రిటన్ ప్రభుత్వానికి వర్తమానం పంపారు. ఆయుధాలతో వస్తున్న రెండు నౌకలను అటకాయించడం, బెంగాల్, పంజాబ్‌లో ప్రభుత్వం భయాందోళనను

సృష్టించడం జరిగింది. విప్లవకారులతో సంబంధం ఉన్నదనే అనుమానంతో వేలాది మందిని ప్రభుత్వం అరెస్టు చేసింది. అయితే, ఈ వృత్తాంతం వేరు.

బెంగాలీ యువజనులను సాయుధ దళాలలోకి చేర్పించడానికి మోతీలాల్ ప్రముఖంగా ప్రయత్నించారు. ఈస్ట్ ఇండియా కంపెనీ దళాలలో ఉండగా బెంగాలీ సిపాయిలు ధైర్యసాహసాలను కనబరచారనీ, తదనంతరం సైన్యాలనుంచి వారిని తొలగించడం వారి అసమర్థతవలన కాదనీ, వారి విధేయతపట్ల బ్రిటన్ ప్రభుత్వానికి సందేహాలు కలగడం వలననే వేదికలపైనా, పత్రికాముఖంగా ఆయన వాదించారు. యుద్ధం విస్తృతం అయిన కొలదీ మరింత సైన్యం కావాలని ప్రభుత్వం భావించింది; మొదటగా రెండువేల మంది బెంగాలీ అంబులెన్స్ దళాన్ని చేర్చుకపోవడానికి, చివరికి బెంగాలీ రెజిమెంట్‌ను ఏర్పరచడానికి బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించింది. సైన్యంలో వాలంటీర్లను చేర్పించడానికి వేదికలపై నుంచి, పత్రికా ముఖంగా మోతీలాల్ గట్టి ప్రయత్నాలు చేశారు. అధిక సంఖ్యలో యువజనులు సైన్యంలో చేరారు

ఇది ఇలా ఉండగా 1914 లో బర్మాలోని జైలు నుంచి తిలక్ విడుదల అయ్యారు. అందుబాటులో వున్న మోతీలాల్ వంటి మిత్రులను ఆయన కలుసుకొని వర్తమాన పరిస్థితిని ఆకళింపు చేశారు. 1907 నాటికి తిలక్ అనుచరులలో చాలామంది అప్పటికీ జైలులో వున్నారు. యుద్ధ సమయంలో సహకారంతో ఒనగూడిన సన్నిహితత్వం ఆసారాగా మోడరేట్లు, తీవ్రవాదులూ, ముస్లిం నాయకులూ కలిసిన ఐక్య కాంగ్రెస్ ఏర్పాటు చేస్తే స్వయంపాలనాధికారం ఇవ్వవలసిందనే కోర్కెను బ్రిటిష్ ప్రభుత్వంపై ఒత్తిడి చేసి సాధించుకోవచ్చుననీ మోతీలాల్ వ్యక్తం చేసిన అభిప్రాయంతో 1914 నాటి కాంగ్రెస్ అధ్యక్షునిగా ఎన్నికైన భూపేంద్రనాథ్‌బాసు ఏకీభవించారు. తీవ్రవాదులను కాంగ్రెస్‌తో చర్పించే క్లిష్టమైన యత్నాలలో తోడ్పడవలసిందిగా మోతీలాల్‌ను బాసు కోరారు. తన పత్రికలో పలు వ్యాసాలు రాయడం ద్వారా ఆ యత్నాలకు మోతీలాల్ మద్దతు ఇచ్చారు. అప్పుడు 'న్యూ ఇండియా' ఎడిటర్‌గా వున్న మోతీలాల్‌తో సంప్రదింపులకై కలకత్తా వచ్చిన శ్రీమతి అనిబిసెంట్ కూడా ఆ యత్నాలను సమర్థిస్తూ వ్యాసాలు రాశారు. కాంగ్రెస్ మహాసభలో పాల్గొనడానికి బాసు, మోతీలాల్ మద్రాసు వెళ్లారు. అయితే వారి ప్రయత్నాలు ఫలించలేదు. తిలక్‌ను కాంగ్రెస్‌లోకి తిరిగి చేర్చుకునే

ఏ ప్రతిపాదనయినా ఫిరోజ్‌షా మెచ్చితే, గోఖలే, సురేంద్రనాథ్ వ్యతిరేకించడమే అందుకు కారణం. 1915లో గోఖలే (170) మరణానంతరమే ఎన్నికల ద్వారా కాంగ్రెస్ సంస్థను విస్తృతపరచే ప్రయత్నాలు ఫలించాయి. ఈలోగా మహారాష్ట్రలో తన నాయకత్వాన్ని తిరిగి సాధించుకొన్న తిలక్‌ను ప్రభుత్వం మళ్ళీ హింసించ ప్రారంభించింది. సత్ప్రవర్తన కనబరచకపోతే (సంవత్సరం పాటు) రు. 40,000=00 రుసుము చెల్లించేట్లు దండించింది. తత్ఫలితంగా ఆయనకి ప్రజాసానుభూతి లభించటమే కాదు, దేశసేవకి కానుకగా ఒక లక్ష రూపాయలు ఆయనకి బహూకరించారు.

బొంబాయి హైకోర్టు తిలక్ అప్పీలును అనుమతించి, నిర్బంధపుటుత్తర్వును కొట్టివేసింది. కాంగ్రెస్‌లో తిరిగి చేరడానికి తిలక్ అంగీకరించారు. 1916 ఏప్రిల్‌లో ఆయన 'హోమ్‌రూల్ లీగ్' స్థాపించారు. కొత్త ఫ్రంట్ ఏర్పాటు యత్నంగా శ్రీమతి అనిబిసెంట్ కూడా అదే సంవత్సరం సెప్టెంబర్ లో తన లీగ్ ప్రారంభించారు. మద్రాస్ ప్రభుత్వ ఉత్తర్వును అనుసరించి ఆ మరుసటి సంవత్సరం శ్రీమతి అనిబిసెంట్ (అప్పటికి ఆమెకు 69 ఏళ్ళు) అరెస్టు చేయడంతో ఆమె పట్ల ప్రజలకు అత్యంత గౌరవం ఏర్పడింది. బ్రిటన్ పాలనను ఆమె తీవ్రంగా విమర్శించడమే కాకుండా, భారతీయ ఆధ్యాత్మిక సంపద పట్ల అభిమానం కనపరచేవారు. తాను ఏర్పాటు చేసిన లీగ్‌లో చేరవలసిందిగా మోతీలాల్‌కు కలకత్తానుంచి తోటి దివ్యజ్ఞానవాది హీరేంద్రనాథ్ దత్తా ద్వారా అనిబిసెంట్ నచ్చజెప్పించారు. "శ్రీమతి అనిబిసెంట్ ఇప్పుడు ఒక వ్యక్తికాదు; ఒక సిద్ధాంతం. ఆమెకు అనర్థం జరిగితే, హోమ్‌రూల్ (స్వయం పాలానాధికారం) ఉద్యమానికి అనర్థం జరిగినట్టే" అని మోతీలాల్ పత్రికలో పేర్కొన్నారు. బీసెంట్ నిర్బంధంపట్ల సర్వత్రా నిరసన వ్యక్తం కావడంతో సెప్టెంబరులో ఆమెను ప్రభుత్వం విడుదల చేయక తప్పిందికాదు. అదే సంవత్సరానికి (1917) ఆమె కాంగ్రెస్ అధ్యక్షురాలుగా ఎన్నికయ్యారు. 1916లో వివిధ పక్షాల మధ్య మైత్రీ సంబంధాల పునరుద్ధరణ జరిగింది. లక్నో వెళ్ళడానికి మోతీలాల్‌కు ఆరోగ్యం బాగా చెడిపోయింది. కానీ తిలక్ పెద్ద సంఖ్యలో గల ఉగ్రవాదుల ప్రతినిధుల బృందాన్ని వెంటబెట్టుకుని లక్నో వెళ్ళాడు. విషయ నిర్ణాయక కమిటీకి జరిగే ఎన్నికలలో రాజీ ధోరణికి తిలక్ చేసిన సూచన ఆమోదముద్ర సాధించారు. ఈ

ఎన్నికలలో ఉగ్రవాదులు విజయం సాధించారు. మోడరేట్లు అభివృద్ధి అయిన మహాత్మాగాంధీ సైతం ఓడిపోయారు. ఆయన అప్పటికి పూర్తిగా అపరిచితుడు అయితే గాంధీ గెలిచినట్లు తిలక్ ప్రజాప్రతినిధుల సభకు ప్రకటించారు.

భారత జాతీయోద్యమానికి ఈ లక్నో సదస్సు ఒక మైలురాయి. కాంగ్రెస్ సంస్థలో ప్రాతినిధ్య సూత్రం నెలకొంది. అది అత్యున్నత స్థానాలలోగల ప్రముఖుల సంస్థగా కొనసాగడానికి ఆటంకం ఏర్పడింది. అది అన్నింటికంటే ముందు చెప్పుకోదగ్గ విషయం. రెండో విషయం ఏమిటంటే- ఈ సదస్సులో మహాత్మాగాంధీని కాంగ్రెస్ రాజకీయాలకు పరిచయం చేసింది. భారతదేశపు భవిష్యత్తుపై అనతికాలంలోనే చెప్పుకోతగ్గ ప్రభావం చూపించిన కాంగ్రెస్ రాజకీయాలకు అలా గాంధీ సన్నిహిత మయ్యారు. మూడో సంగతి – త్వరలోనే భారతదేశానికి డొమినియన్ స్టేటస్ కల్పించాలన్న ఐక్య కాంగ్రెస్ ముస్లిం డిమాండు ఈ మహాసభలో వ్యక్తమైంది. ముస్లింలకు ప్రత్యేక వోటర్లతో హిందువులు, ముస్లిములు ఏ ఏ రాష్ట్రాలలో ఉంటే అక్కడ వారికి ప్రత్యేక సౌకర్యాలతో భారతదేశానికి సంపూర్ణ రాజ్యాంగాన్ని లక్నో సదస్సులో పొందుపరిచారు. కొంతకాలం పోయిన తరువాత ప్రత్యేక వోటర్ల పద్ధతిని రద్దు చేయవచ్చునని నాయకులు భావించారు. ఆంగ్లో ఇండియన్ పత్రికల ద్వారా ఈ ఒప్పందం పట్ల అధికార్ల విమర్శను ఘాటుగా వ్యక్తమవుతున్న కొద్దీ మోతీలాల్ ఆ దూషణలను త్రిప్పికొడుతూ ప్రతి విమర్శను చేశారు. ఆయన పత్రికలో సంపాదకీయం రాస్తూ –"ఇలా గుండెలు బాదుకొనేవాళ్ళు సోదరులను చూస్తుంటే మాకు ఆనందంగానూ, బాధగాను ఉంది. అది వారి జీర్ణశక్తిని దెబ్బతీసి ఈ సుందర రాత్రులలో వారిని కునుకుకు దూరం చేస్తుంది"

భారతదేశానికి ప్రాతినిధ్యంవహించే వివేకవంతుల పట్ల ద్వేషాన్ని, దుర్బుద్ధిని పెంచుకునేందుకు ప్రతీకంగా ఇప్పుడు వారి హృదయాలు ఆందోళనతో గింజుకుపోతాయి" అని వ్యాఖ్యానించారు.

/భారతదేశంలో వ్యవస్థీకృతమైన రాజకీయ సంస్థలన్నీ సంపూర్ణ స్వయంపాలన ప్రభుత్వాన్ని ఐక్యంగా డిమాండ్ చేయడంతో బ్రిటిష్ ప్రభుత్వం ప్రతిస్పందించక తప్పిందికాదు. 1917 లో భారత విదేశాంగమంత్రి పదవిలోకి వచ్చి ఎడ్విన్ మాంటేగ్ 1917 ఆగస్టు 4న భారతదేశం పట్ల బ్రిటన్ విధానాన్ని ప్రకటించారు.

ప్రకటన పాఠం ఇది:- బ్రిటన్ రాజుచే ప్రకటితమై భారత ప్రభుత్వానికి శిరోధార్యమైన విధానాలు ఏమటంటే- పాలనా యంత్రాంగపు ప్రతి ఉపాంగంలోనూ భారతీయుల ప్రాతినిధ్యాన్ని పెంచి బ్రిటిష్ సామ్రాజ్యంలో అంతర్భాగంగా భారతదేశంలో బాధ్యతాయుతమైన ప్రభుత్వం నెలకొనాల్సిన ఆవశ్యకతకు గుర్తింపు లభించేదాకా స్వయం పాలనా సంస్థలను క్రమక్రమంగా పుంజుకుంటూ రావడం!

త్వరలోగాని, వీలును బట్టిగాని, ఫలానా తేదీన డొమినియన్ స్టేటస్ ఇస్తామన్న హామీ కూడా లేకుండా ఏకమొత్తంగా ఆ డిమాండ్‌ను త్రోసి పుచ్చడానికే ఈ ప్రకటన జారీచేశారు. 1917లో మాంటేగు భారతదేశం వచ్చారు. ఈ ప్రకటనను విశ్వసించి క్రింది స్థాయినుంచి స్వయంపాలన సంస్థలు ఏర్పడేదాకా ఎదురు చూడవలసిందని భారతీయ నాయకులను ఒప్పించడానికి వచ్చాడు. కాంగ్రెస్‌లీగ్ పథకాన్ని వ్యతిరేకించడానికి అధికార వర్గాల వారు ఎన్నో నకిలీ సంస్థలను నెలకొల్పారు. నేషనలిస్టు నాయకులకు కొందరు నాయకులను మూకుమ్మడిగాను వ్యక్తిగతంగానూ అభిప్రాయాలను తెలుసుకోవాలన్న మాంటెగు నకిలీసంస్థల మాత్రము శ్రద్ధగా వెనువెంటనేకలుసుకొని వారు చెప్పింది విన్నారు. ఆయన కలకత్తాలో మోతీలాల్‌ను కూడా కలుసుకున్నారు. అదే ఏడాది మొదట్లో మోతీలాల్ తన పాత మిత్రుడు తిలక్‌తో తిరిగి మైత్రి గట్టిచేసుకొని ఇరువురూ కలిసి ఉమ్మడి వ్యూహం రూపొందించడం జరిగింది. అమెరికా పాలనలో ఉన్న ఫిలిపైన్స్‌ను ఉదాహరణగా తీసుకుంటూ మోతీలాల్ పరంపరగా వ్యాసాలు రాశారు. కేవలం 15 సంవత్సరాలలో పూర్తిగా స్వయం సహాధికారాన్ని ఫిలిప్పైన్స్ సాధించడాన్ని ఆయన ఉదహరించారు. మాంటేగు కలుసుకున్న నాయకులు ఈ వ్యాసాల ఆధారంగా అభిప్రాయాలు రూపొందించుకొని ఆయనకు నివేదించారు. 1917 డిసెంబరు 4న మోతీలాల్‌తో జరిపిన చర్చల పై తన అభిప్రాయాలను మాంటేగు తన "ఇండియన్ డైరీ" లో ఇలా పొందుపరచారు.

"-అమృతబజార్ పత్రిక సంపాదకులు మోతీలాల్‌తో సుదీర్ఘమైన ఇంటర్వ్యూలు జరిపాయి. ఆయన సహృదయుడు, పెద్దవాడు, వెమ్మదస్తుడు. ఉగ్రమైన రాజకీయ దృష్టికల వ్యక్తి నిష్కర్షగా ప్రైవేటుగా ఒప్పుకున్నా పబ్లిక్‌గా పూర్తిగా ఖండిస్తూంటాడు.

భారతీయ సామ్రాజ్యం బ్రిటిష్ వారి చేతుల నుంచి జారిపోతుందని అయిదేళ్ళ

క్రితం నాతో ఒక సందర్భంలో అన్న విషయం ఆయన నాకు ఇంటర్వ్యూలో గుర్తు చేశారు. మలేరియా తీవ్రత గురించి ఆయన తీక్షణంగా మాట్లాడాడు మలేరియా మరణాల రేటు పెరిగిపోకుండా ఆపే శక్తి ప్రజలకే ఉందని ఆయన అభిప్రాయం వ్యక్తం చేశారు. మోతీలాల్ కాంగ్రెస్‌లీగ్ స్కీముకు ఆయన ఆమోదించలేదు. అది కేంద్ర ప్రభుత్వానికి వర్తింపజేయాలనీ, రాష్ట్రాలు పూర్తిగా స్వయంపాలన క్రిందకు రావాలని అంటున్నారు. ఆయన అలవికాని ఆత్రంలో ఉన్నారు. కొంచెం జాలిని చూపాలని ఆయనను నేను కోరాను పదేళ్ళు వ్యక్తి జీవితంలో చాలా ఎక్కువేగాని ఒక దేశం జీవితంలో చాలా స్వల్పమని నవ్వుజెప్పారు "

౦మోతీలాల్‌ను బ్రాహ్మణుడని శ్రీమాంటేగు పేర్కొన్నారు. అది తప్పు. ఆయన కాయస్థుడు అది నిమ్నకులం రెండోదేమిటంటే భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యాన్ని సాగించడంలో బ్రిటిషర్ల దురుద్దేశం ఉండడం అసాధ్యమని మోతీలాల్ నమ్ముతూ వచ్చారు అది ఆయన గురువు శిశిర్‌కుమార్ నుంచి ఆయనకు సంక్రమించిన నమ్మకం. కార్మిచెల్ విషయంలో వలెనే మాంటేను ఉద్దేశాలను అంగీకరించి ఉండవచ్చు కాని బ్రిటిష్ రాజకీయ రంగంలో ఉన్నదికేవలం మాంటేగు వంటివారు కాదు. మరణాలరేటును ప్రజలే అదుపు చేయగలరని మోతీలాల్ అన్నారంటే అర్థం జీవన్మరణ సమస్య ఎదురైనప్పుడు ఆ వ్యవహారాలను ప్రజలే దిద్దుకోవాలనీ ఆరోగ్యం, విద్య ప్రజా ప్రతినిధులకు అప్పగించాలని మాంటేగు సూచించారు పోలీసుశాఖను కూడా ప్రజలకు అప్పగించాలని మోతీలాల్ సూచించారు. మరి కొన్నేళ్ళు ఆగక అది సాధ్యమని మాంటేగు చెప్పారు. దానికి మోతీలాల్ ఆకలితో నకనకలాడుతున్న ఒక బ్రాహ్మణుని కథ ఉదాహరణగా చెప్పారు. అస్పృశ్యులుగా భావించే శూద్రులు ఇచ్చిన ఆహారాన్ని స్వీకరించి తనబ్రాహ్మణీకాన్ని వదులుకోవడానికి సిద్ధపడతాడు. శూద్రుడు అతనికి ఒక చెంచాడు ఆహారం యిచ్చి ఆ తరువాత నోటికి పట్టినంతా పెడతానన్నాడట. అలా చివరికి బ్రాహ్మణులకు కులం పోయిందిగాని ఆకలి ఉండిపోయింది. మాంటేగు ఇచ్చిన హామిని ఈసడిస్తూ మోతీలాల్ అన్నారు. గంజినీళ్ళ కోసం జన్మహక్కును వదులుకొనే మనిషి కాదు మోతీలాల్. ఇక బ్రిటిష్ పాలకుల చిత్తశుద్ధి గురించి మోతీలాల్‌కుగల అభిప్రాయం తెలియాలంటే మోతీలాల్ జీవితచరిత్రకారుడు మనమడు పి. దత్ ఆయనతో తాను జరిపిన సంభాషణల

నుంచి రికార్డు చేసిన ఈ క్రింది విషయాలు సంభాషణల నుంచి రికార్డు చేసిన ఈ క్రింది విషయాలు చదివితే సరి:- "ప్రభుత్వం గైకొనే ప్రతి చర్యను విమర్శిస్తారెందుకు? ఈ ప్రభుత్వం వలన మనకు కొంత మేలు జరుగుతుందంట మీకు నమ్మకం లేదా అని ఒకసారి నేను ఆయన్ను అడిగాను. పరిస్థితుల ప్రాబల్యం వలన మంచి అనేది మనకు జరగదని గట్టిగా నమ్ముతూ వచ్చాను అందుకే ప్రభుత్వం గైకొనే ప్రతి చర్య అది మంచిది కాని, చెడ్డది కాని నేరం క్రిందయినే కాని విమర్శించడమే కర్తవ్యంగా పెట్టుకున్నానని ఆయన జవాబిచ్చారు. ప్రభుత్వం చేసే చెడ్డపనులన్ని విమర్శించు కాదనను. కాని మంచి పనులపై ఎందుకు విమర్శించాలి? ఉదాహరణకు భారతీయుల కోసం ప్రభుత్వం ఒక కొత్త ఆసుపత్రి తెరవడమో, కొత్త వంతెన నిర్మించడమో, రైలు దారి వేయడమో, చేసిందనుకో. దానిని మనం హర్షించాలే తప్ప విమర్శించడం చేనికి. ఘోష్‌ను నేను మళ్ళీ రెట్టించి అడిగాను.

"నువ్వింకా తెలుసుకోవాలిరా! నాయనా!" అంటూ ప్రారంభించాడాయన. కొత్తగా ఆసుపత్రి తెరవాలని ప్రభుత్వం నిర్ణయం తీసుకోవడం జరిగితే బ్రిటిష్ డాక్టర్లకి ఆంగ్లో ఇండియన్ నర్సమ్మలకు ఉపాధి కల్పించడానికి ఆ ఆసుపత్రి తెరిచారేమో జాగ్రత్తగా గమనించాలి. లేకపోతే బ్రిటన్‌లో తయారైన మందులను మన నెత్తిన రుద్దడానికి తెరిచారోమో చూడాలి. క్రొత్త వంతెన నిర్మించేటప్పుడు కూడా సాధన సంపత్తి పంపించాలని ఆర్డర్లు బ్రిటిష్ కంపెనీలకి పెడతారు ఖచ్చితంగా. బ్రిటిష్ ఇంజనీర్లు కాంట్రాక్టర్లకే ఉపాధి కల్పిస్తారు వాటిలో భారతదేశాన్ని బ్రిటన్ పరిపాలిస్తున్నది సొంత ప్రయోజనాల కోసమే తప్ప భారతదేశం ప్రయోజనాలకోసం కాదని ఏనాటికినీ మరిచిపోలేను. పైకి ఎంతో మంచి పనులుగా కనిపించినా నిజానికి దేశానికి అది ఎంతో చేటు తెచ్చేవిగావచ్చునని ఆయన జవాబిచ్చారు.

1910లో ప్రజా జీవితం నుంచి శ్రీఅరవిందులు రిటైర్ అయిన తరువాత బిపిన్ చంద్రపాల్, మోతీలాల్‌ఘోష్ బెంగాల్ రాజకీయాలలో జాతీయవాదుల ప్రతినిధులయ్యారు. 1912లో కాంగ్రెసు పునర్వ్యవస్థీకరణకు జాతీయవాదులు దృఢమైన అభిప్రాయాలద్వారా ఒత్తిడి తేవడం కారణం. 1915లో బెంగాల్ ప్రావిన్షియల్ పొలిటికల్ కాన్ఫరెన్స్ అధ్యక్షపదవికి ఎన్నిక కావడం రాజకీయ

జీవితంలో ఆయన అనుసరించిన వైఖరిక ప్రబల నిదర్శనమే కాక నేషనలిస్టు అభిప్రాయాలు బలంగా ప్రభావం చూపుతున్నాయనడానికి ఋజువు. కోర్కెల సాధనకు, సమస్యల పరిష్కారానికి ప్రభుత్వం పై ఆధారపడడం మాని ప్రజలు తమ సమస్యలు తామే పరిష్కరించుకోవడానికి మార్గాలు అన్వేషించాలని స్వయం కృషి ద్వారా కష్టాలనుంచి గట్టెక్కాలని, అలా చేయడం ద్వారానే ప్రజల స్వాతంత్ర్యం సిద్ధిస్తుందని, ఆయన తన ఎన్నిక సందర్భంగా ఇచ్చిన ప్రసంగంలోను సూచించారు. బ్రిటిష్ చట్టాలను, దొరల న్యాయస్థానాలను విదేశీ సరుకులను బహిష్కరించడమే ఒక్కటే వారు చేయవలసినదని పిలుపు నిచ్చారు. ఈ సందర్భంగా ఆయన నిర్దేశించిన 8 సూత్రాల కార్యక్రమం :

1. స్వదేశీ జాతీయ భావాల ప్రచారం భారత దేశంలో తయారైన వస్తువులనే కొనుగోలు చేయడం, దేశీయ కుటీర పరిశ్రమలనూ వ్యవసాయ సంస్కరణలను ప్రోత్సహించడం.

2. పాంప్లేట్లు ప్రసంగాలు, మహాసభల ద్వారా ప్రజలకు వాస్తవాలు తెలియజెప్పడం.

3. జాతీయ వాద ప్రచారానికి మిషనరీలకు మినహా గౌరవ వేతనాలుగాని, ప్రతిఫలం చెల్లించి గాని ఏర్పాటు చేసి వాటి ద్వారా అంతర్గత కల్లోలాలను పరిష్కరించుకుని, ఐకమత్యం పెంపొందింపజేయడం.

4. జాతీయవాదం ప్రాతిపదికగా సాధారణ సాంకేతిక విద్యావ్యాప్తి.

5. పరిశుభ్రత.

6. పొదుపుతో నిరాడంబరం, జీవించడానికి సూచనలు

7. సాధ్యమైనంత మేరకు సాంఘిక దురాచారాల నిర్మూలనకు సంస్కరణలు ప్రవేశపెట్టడం.

8. హిందువుల మహమ్మదీయుల మధ్య సామరస్యం పెంపొందించడం.

ప్రభుత్వం పట్ల వ్యవహరించవలసిన తీరు ఎలా ఉండాలో చెబుతూ రాజ్యాంగబద్ధమైన నిరసనను పాటించాలని దేశప్రయోజనాలను రక్షించవలసిన సందర్భంలో ప్రభుత్వానికి సహకరించాలని ఆయన సూచించారు.

భారతీయ పత్రికలు ఎల్లప్పుడూ ప్రభుత్వాన్ని వ్యతిరేకిస్తూ చిత్తశుద్ధితో ఒక ప్రతిపక్షం వలె వ్యవహరించాలని ఆయన సూచించారు. భారతీయ రాజకీయాలను

జాగ్రత్తగా అధ్యయనం చేసేవారికి ఈ కార్యక్రమము స్వదేశీ ఉద్యమం రోజులలో రూపొందించిన కార్యక్రమాన్ని తదనంతరం గాంధీజీ ప్రబోధించిన కార్యాచరణను పోలిఉన్నట్లు స్పష్టం అవుతుంది. మోతీ లాల్ చర్యను మహాద్భుతయంత్రంగా అభివర్ణించడం, నూలు వడకడాన్ని బలపరచడం ఆసక్తికరమైన అంశం. భారత రక్షణ చట్టం అమలు చేయడంలో ఆచితూచి వ్యవహరించాలని 'కార్మిచెల్' పదేపదే ఇచ్చిన సలహాలు వ్యతిరేకంగా 1915 నాటికి ప్రభుత్వం మళ్ళా అణచివేత కార్యక్రమాన్ని విచక్షణారహితంగా చేపట్టింది. వేలాదిమందిని ఎట్టి విచరణా లేకుండా నిర్బంధించడం, పత్రికలను శిక్షించడం సాగించింది. 1910-1917 మధ్య పత్రికల చట్టం క్రింద 1991 పత్రికలని ముద్రణాలయాలని జుల్మానాలకు గురి చేసింది. వీటిలో 705 భారిమొత్తాలను పూచీకత్తులుగా కట్టాయి. దాదాపు 173 కొత్త ముద్రాణాలయాలు, 129 పరిక్రొత్త వార్తాపత్రికల గొంతు నులిమేశాయి. 22 పాత పత్రికల్లో 18, 88 సాధారణ ముద్రాణాలయాలు నలభై ధరావత్తు కట్టలేక మూతపడ్డాయి. శ్రీమతి బిసెంట్ నడిపిన న్యూయిండియా పత్రిక అంత బయిండ్ కట్టిన 2 వేల రూపాయలు ధరావత్తుమ 1917లో ప్రభుత్వం జుల్మానా రూపేణా కబళించింది. అదనంగా మరో పదివేల రూపాయల సెక్యూరిటి కట్టాలని ఉత్తర్వు చేశారు. ఇటువంటి పరిస్థితులలో మోతీలాల్ అవధులు మీరకుండా ప్రభుత్వ వ్యతిరేక ధోరణి ప్రదర్శించడంలో అద్భుతమైన చాకచక్యం ప్రదర్శించారు. ప్రభుత్వపు అవకతవకలు వివరాలు ఎంతో జాగ్రత్తగా మదింపు చేసిన తరువాత వాటిని బాహాటంగా విమర్శించేవారు. ఈ అవకతవకల నివృత్తికి గానూ హింస్మా దౌర్జన్యాలు ప్రదర్శించాలని సలహా ఏదీ ఇవ్వకుండా సంయమనం చూపాడు. వేలాదిమంది యువకులని నిర్బంధించడంలో ప్రభుత్వం చాలా తత్తరపాటుతో వ్యవహరించింది. క్రిడాక్ సిద్ధాంతంలోని ఆర్థిక సంస్కరణలు బెంగాల్ వ్యతిరేకత వ్యక్తం చేసినప్పుడు ఈ వ్యతిరేకతను అణచడానికి పోలీసు అధికారాలు విస్తృతంగా చెలాయించాలని ప్రభుత్వం భావించడంతోనే బెంగాల్‌లో అశాంతి ప్రభవించి ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌లో సీనియర్ సభ్యుడు "పి.సిలియన్" పేర్కొన్నారు. 1917 ఆగస్టులో ఆయన ఇలా విశ్లేషించాడు.

'మనం ఏ విప్లవకారులతో పోరాడుతున్నామో ఆ విప్లవకారులు సాగిస్తున్న ప్రచారానికి జాతీయవాదం పునాది. బెంగాల్‌లోని ఎన్నో పాఠశాలలు, కళాశాలల్లో

వారు నేర్చుకుంటున్నది కూడా అదే బెంగాల్‌లో ప్రముఖ రచయితలు వ్రాసేది పేరెన్నికగన్న వక్తలు మాట్లాడేది కూడా జాతీయవాదమే. దేశ సమస్యల గురించి ప్రజానీకం గురించి ఆలోచించి ప్రతి ఒక్క విద్యార్థితో పాటు విద్యావంతులలోని మెజారిటీ వర్గం జాతీయవాద ప్రభావానికి తాను లోనయి వుంది. అదీకాక ఈ వర్గాన్ని అశేష ప్రజానీకంలో సంబంధాలను పట్టించుకొనక్కర్లేనిదిగా ఒక అల్ప సంఖ్యాక వర్గంగా పరిగణించడం ఇక చెల్లదు. వారు జనబాహుళ్యంలో తామొక అంతర్భాగంగా గుర్తించి బ్రిటిష్ పాలన పట్ల తమ అవిశ్వాసాన్ని సాటి ప్రజలలో ప్రచారం చేస్తున్నాయి. తమ కోర్కెల సాధనలో వారు ప్రజలను తమతోబాటు నడిపించగలగడం తథ్యం."

కార్మిచెల్ భావాలతో ఏకీభవిస్తూ "లీఆన్" ఇచ్చిన విశ్లేషణకి "కార్మిచెల్" వలెనే గుర్తింపు లేకుండా పోయింది. యువకులను పోలీసులు విచక్షణారహితంగా నిర్బంధించి చిత్రహింసల పాలు చేయడాన్ని తుదివరకు వ్యతిరేకించిన "కార్మిచెల్" 1917 మార్చిలో భారతదేశం వదలిపెట్టి వెళ్ళిపోవలసి వచ్చింది. ఆ యువకులు చేసిన నేరం ఏ కోర్టులోనూ, ఏ చట్టం క్రింద శిక్షార్హంగా నిరూపించజాలమని. ప్రజలు గట్టిగా నమ్ముతున్నప్పుడు వారికి నిర్బంధించడం అవివేకమని వాదించిన కార్మిచెల్‌కు ఆ గతి పట్టింది. పోలీస్ రాజ్‌ను నిరంతరం వ్యతిరేకించిన మోతీలాల్ కేవలం అనుమానంపై అరెస్టుచేసి యువకుల విడుదలకి కార్మిచెల్‌తో కలసి మధ్య వర్తిత్వం నడిపారు.

కార్మిచెల్ వెళ్ళిపోయిన కాలంలో దాదాపు 800 మంది యువకులు 1818 రెగ్యులేషన్ చట్టం క్రింద కొందరు జైళ్లలోనూ, ఇంకా కొందరు దేశంలో వేరు వేరు చోట్ల నిర్బంధాల క్రింద మగ్గుతున్నారు.

ప్రజల అసంతృప్తి అవిశ్వాసంతో పరిస్థితులు సలసలా మరుగుతున్న నీటితొట్టెను కలిపి తలపిస్తూండగా కార్మిచెల్ ఉత్తరాధికారి లార్డ్ "రోనాల్డ్‌షే" వచ్చారు. అందుచేత కర్జన్ పక్కలో తయారయిన అధికారి అయిన ఐరోపా వ్యవస్థ విలువలకే వ్యతిరేకంగానూ విదేశీ సంస్కృతిని స్వీకరించడం భారతదేశానికి ఆత్మాహుతితో సమానమనే భావనవల్ల జనించిన ఆందోళనతోను ఈ ఉగ్రవాదం తొలగిపోయేది కాదు కాబట్టి ఉగ్రవాదులతో హేతుబద్ధంగా వ్యవహరించడం కుదరదని ఆయన అభిప్రాయం. క్రమబద్ధంగా వ్యవహరించే ప్రభుత్వానికి ఈ

విప్లవోద్యమాన్ని అణచివేయడంతప్ప మరోదారి లేదని ఆయన నిశ్చయించుకున్నాడు. ఇటువంటి భావాలుగల ఆయన సులభంగా ఐ.పి.యస్. అధికారులనూ, బ్రిటీషు వ్యాపారవర్గాన్ని విధేయులైన పెద్దభూస్వాములను కలుపుకొని సామ్రాజ్య పరిరక్షణ కర్తవ్యాన్ని భుజానెత్తుకున్నాడు. మాంటెగు ఛేమ్స్‌ఫర్డ్ సంస్కరణ ప్రతిపాదనలని బెంగాలీలు ఎందుకు విమర్శించారో గాంధీజీ తన అహింసాయుత సహాయ నిరాకరణ, శాసనోల్లంఘన కార్యక్రమాన్ని ప్రతిపాదించినప్పుడు హింసాత్మక పద్ధతిని పూర్తిగా తిరస్కరించకుండానే ఆ కార్యక్రమాన్ని బెంగాల్ ఎందుకు విశ్వసించిదో ఈ పరిస్థితుల నేపథ్యంలో సులభంగా గ్రహింపవచ్చును

# 14. ఎన్నో పరిణామాల సంవత్సరం...

**పం**దొమ్మిదివందల పదిహేడు మాంటేగు ప్రకటనతో బాటు ఎన్నో పరిణామాలను తెచ్చిన సంవత్సరం. మహాత్మాగాంధీ సత్యాగ్రహ ఉద్యమం దేశానికి ఒక సాహసవంతమైన మలుపు నిచ్చింది. భారత దేశంలో తిరుగుబాటు ఉద్యమాలు, కుట్రలు ఏ స్థాయిలో ఉన్నాయి, వాటి నివారణోపాయాలు ఏమిటి అవేది పరిశీలించి తగు సిఫార్సులు చేయడానికి బ్రిటన్‌నుంచి వచ్చిన జస్టిస్ వాలార్ట్ అధ్యక్షతన ఒక కమిటీ ఏర్పాటైంది. తదనంతర పరిణామాలు ఏమి రుజావు చేశాయంటే - ఈ రెండు హేతువులు కూడా స్వాతంత్ర్య పోరాటం నిర్దిష్టమైన ఆకృతిని సమకూర్చుకోవడానికి తోడ్పడ్డాయి. మోతీలాల్‌కు, పత్రికకు అది తాజా కష్టాలను కొని తెచ్చిన సంవత్సరమయింది. 1917 మే 22న పత్రికలో వెలువడిన కొన్ని వ్యాఖ్యలపై కోర్టు ధిక్కారణ కేసు వచ్చింది. మోతీలాల్‌ను, సంస్థ డైరక్టర్లనూ, ముద్రాపకుని కోర్టు పూర్తి న్యాయపీఠం ఎదుట హాజరు పరిచారు. కలకత్తా అభివృద్ధి ట్రస్టు తీర్పులకు వ్యతిరేకంగా వచ్చిన అప్పీళ్ల విచారణకు కలకత్తా హైకోర్టు ప్రత్యేక న్యాయపీఠాన్ని ఏర్పాటుచేయడంపై ఆ పత్రికలో పై వ్యాఖ్యలు వచ్చాయి. నాటి న్యాయవాద రంగంలోని అగ్రగణ్యులు జాక్సన్, ఈషి వర్టన్, సి.ఆర్. దాస్, బి. చక్రవర్తి డిఫెన్సు తరఫున వకల్తా పుచ్చుకొన్నారు. డిఫెన్సుకు సారథ్యం వహించిన జాక్సన్ నేరారోపణలను ప్రశ్నిస్తూ కోర్టే ప్రాసిక్యూటర్ అయినపుడు సదరు ఆరోపణల మీద విచారణకు అదే కోర్టుకున్న అధికార పరిధిని సవాలు చేశారు. ఏపీ ఆరోపిత నేరంతో మోతీలాల్‌కు ప్రమేయం ఉన్నట్లు నిరూపించే సాక్ష్యాధారాలు ఏవీ లేవని, ఒక సంస్థలో ప్రతి విషయం డైరెక్టర్ల అందరి దృష్టికి వస్తుందనుకోవడం సంబద్ధమవీ ఆయన వాదించారు. చివరకు మోతీలాల్‌నూ, డైరక్టర్లనూ సాక్ష్యాధారాలు లేక విడిచి పుచ్చారు. సాంకేతిక పరమైన కారణాలపై మోతీలాల్‌కు సంస్థ డైరెక్టర్‌లకు

లభించిన విజయమిది. ఒక్క ముద్రాపకునికి మాత్రమే ఈ కేసులో 300 రూపాయలు జర్మానా పడింది. ఈ కేసులో ప్రధాన న్యాయమూర్తి తీర్పునిస్తూ పత్రికలో రాతకు బాధ్యుని పక్రమంగా గుర్తించే నిమిత్తం సంపాదకుని పేరు ప్రకటించాలని వ్యాఖ్యానించారు. ఈ వ్యాఖ్యకు పత్రిక ఇచ్చిన సమాధానం :-

త్రికపై ఇటీవలి కోర్టు ధిక్కారణ కేసుపై విచారణ జరిపిన ఐదుగురు విజ్ఞులైన హైకోర్టు న్యాయమూర్తుల సిఫార్సును ప్రభుత్వం ఆమోదిస్తే - వారు సిఫార్సు చేసిన విధంగా ప్రతి పత్రికా తప్పనిసరిగా సంపాదకుని పేరు ప్రకటించాలని నిబంధన విధిస్తే - ఆ కృష్ణ జన్మస్థాన ప్రాప్తి - (ఇంకా రాయాల్సి వుంది).

మోతీలాల్ చట్టం ఉచ్చు నుంచి తనంతతాను బైట పడగలగడం గురించిన 'స్టేట్స్‌మన్' పత్రిక ఇలా రాసింది :

"రెస్పాండెంట్ల తరఫున వకాల్తా పుచ్చుకొన్న పెక్కుమంది న్యాయవాదుల వాదనప్రకారం, ఈ పత్రిక (అమృతబజార్) శూన్యంలోంచి పుట్టుకువచ్చే అసంకల్పితంగా పొగయ్యే వ్యాసాలు, వ్యాఖ్యలతో నింపబడుతోందన్నమాట. చిత్తశుద్ధి లేని సదరు ముద్రాపకుడు ఆ వ్యాసాలను అసలు చదవడన్న మాట తాడూ బొంగరం లేని ఆలోచనలు చేసే బాబూ మోతీలాల్ ఘోష్ వంటి వృద్ధ వాంధసులకు తగినట్టుగానే ఉందన్నది ఈ వాదం". 'బెంగాలీ' పత్రిక మోతీలాల్‌ను ప్రశంసించింది :-

"బైటపడే మార్గాంతరాలు సంక్లిష్టంగా ఉండి కూడా ఈ కేసులో బాబూ మోతీలాల్ ఘోష్ సమర్థవంతంగా పోరాడి నెగ్గుకు వచ్చి ఒక రకంగా ఎంతో మేలుచేశారు. ఎందుకంటే న్యాయం కొందరి వ్యక్తిగత ప్రయోజనాల ముందు తలవొంచి సామాన్యులకు ప్రియం అయిపోతోంది మరి".

అసలు ఈ వ్యవహారంలోని వాస్తవం ఏమిటంటే - తన పత్రికలోని వ్యాఖ్యలకు సంపాదకునిగా తన బాధ్యతను ఒప్పుకోవడానికి మోతీలాల్ సిద్ధంగా ఉన్నారు. కాని ఆయన తరఫున వాదించిన లాయర్లు మాత్రం చట్టసంబంధమైన నిబంధనల ప్రాతిపదికగా ఈ కేసు వాదిద్దామని ఆయనను శాంతింపజేశారు.

1915 ఆరంభంలో, మహాత్మాగాంధీ తన సహోదారు గోఖలే మరణానికి ముందు దక్షిణాఫ్రికాలో 2 ఏండ్లు గడిపి భారతదేశానికి తిరిగివచ్చారు. జాతి వర్ణ వివక్షతలకు లోనైన అక్కడి భారత జాతీయతను కూడగట్టి మహాత్మాగాంధీ

సత్యాగ్రహ ఉద్యమాలను దక్షిణాఫ్రికాలో దిగ్విజయంగానే నడిపారు. భారతదేశం నుంచి కంట్రాక్టు కార్మికుల క్రింద భారతీయులను అక్రమంగా వలసపట్టుకు పోతుండడం నిరోధించడానికి మహాత్మాగాంధీ జరిపిన కృషి 1917తో ఫలితాన్ని ఇచ్చింది. మితవాది సంస్కరణ వాదిగా పేరుబడిన గాంధీ "ప్రజా కార్యక్రమాలలో పూర్తి సత్యసంధత', అనే అద్భుత గుణాన్ని ప్రవేశపెట్టారు. పరిస్థితిని బట్టి అవసరమైతే బాహాటంగా ప్రభుత్వాన్ని ధిక్కరించడానికి ఆయన భయపడేవాడు కాదు. పూర్తి నిజాయితీ, అహింసా యుతమైన కార్యకలాపాలు, వ్యక్తిగతంగా ఎంత బాధాకరమైన పరిస్థితికయినా ఆఖరుకు చావుకయినా సిద్ధపడేలా రాగల పరిణామాలను ఎదుర్కొనే ధైర్యం – అహింసా సిద్ధాంతం ఈ గుణాలు ఉండాలని ఆయన నిర్దేశించింది. ఈ దశలో ఆయన బోధించిన అహింసాత్మక పోరాట వ్యూహం లోతుపాతులు ఎవరికీ అర్థం కాలేదు, అంతా ఆ రకం పోరాటం సాధ్యం కాదని అభిప్రాయపడ్డారు. అయినప్పటికీ 25 వందల ఏళ్ల క్రిందటి అహింసా సిద్ధాంతం భారతదేశంలోని లక్షలాది ప్రజల నరనరాల్లో జీర్ణించుకుని ఉన్నదే కనుక గాంధీ అహింసా సిద్ధాంతం ప్రజలపైన గట్టి ప్రభావం చూపింది గాంధీ ఆ సిద్ధాంతాన్ని సామూహిక కార్యాచరణ అనే ఆయుధంగా మలచారు.

1917 ఏప్రిల్లో బీహార్లోని చంపారన్ జిల్లా ముఖ్య పట్టణమైన మోతీహారి సందర్శనకై గాంధీకి ఆహ్వానం వచ్చింది. ఐరోపా దేశాల నీలిమందు తోటల పెంపకందార్లు ఒక పాత స్థానిక చట్టాల లొసుగులు ఉపయోగించుకొని ఆ ప్రాంతం పేద రైతులు తమ ప్రాంతంలోని నాలుగోవంతు భాగంలో తప్పనిసరిగా నీలిమందు పండించాలని బలవంతపు నిబంధన విధించి ఆ నిబంధనను ధిక్కరించే రైతులను అనాగరిక చిత్రహింసా పద్ధతులకు గురిచేసి వేధించేవారు.

గాంధీ చంపారన్ విడిచి పెట్టాలన్న ప్రభుత్వ ఉత్తర్వును ధిక్కరించాడు. తాను ఆ ఉత్తర్వులను ధిక్కరించి నందుకుగాను తనను విచారించవలసిందని కోర్టు ఎదుట హాజరయ్యారు. తన దోషమేమీ లేదనీ, వీలైతే తనని శిక్షించవచ్చుననీ, కోర్టును ఆయన సవాల్ చేశారు. ప్రభుత్వ ఉత్తర్వు అక్రమమనీ అంతరాత్మ ప్రబోధం అనే మానవ జాతి అత్యున్నత న్యాయ సూత్రానికి ఇది విరుద్ధమైనదనీ ఆయన చాటారు. ఆయన వ్యాఖ్యలతో ఖంగుతిన్న మేజిస్ట్రేట్ తన తీర్పును వాయిదా వేసి తగు సూచనలు ఇవ్వవలసిందిగా గవర్నర్ను అడిగారు. గాంధీ

నిర్భయత ఆయనను హీరోగా నిలబెట్టాయి. కీడెంచి మేలెంచమన్నట్టుగా గవర్నర్‌గారు ఆలోచించి గాంధీపై కేసు ఉపసంహరించారు. గాంధీ చంపారన్ రైతులతో కలిసి మెలిసి ఉంటూ తన దర్యాప్తు సాగించారు. ప్రభుత్వం కమీషన్‌ను నియమించి నీలిమందు పెంపకందార్ల ఇష్టారాజ్యానికి తెరపడింది.

సత్యాగ్రహం శక్తి రాజకీయ వివేచన గల జనసామాన్యానికి అవగతమైంది. ఆధునిక నాగరికత ఏ భయాలులేని ఒక వర్గం ప్రజలు అహింసాయుధం ఒకమంత్రదండంవలె అసాధ్యాలను సాధ్యం చేయగలదని నమ్మితే ఆధునికలు ఒకానొక పోరాట పద్ధతి త్వరలో దేశమంతటా ప్రజలలో విస్తరించి పాతుకుపోతుందనీ, దాని నిజాలు ఎలా ఉంటాయో మాత్రం చెప్పజాలమనీ భావించారు. ఊహించజాలని ఫలితాల గురించి భయాందోళనలు చెందే వర్గంలో లేరు మోతీలాల్ ఎన్ని కష్టనష్టాలకైనా ఓర్చి అహింసా పంథానే అనుసరిద్దామనే సూత్రంపైనే దేశంలో ఏ ఆయుధబలం లేని లక్షలాది ప్రజలు ఏకత్రాటిపై నిలిచే అవకాశం ఉంటుందని మోతీలాల్ నమ్మారు. స్వయంగా తాను రైతు కుటుంబం నుంచి వచ్చిన వ్యక్తి కనుక, కొత్త మలుపులు పట్ల ఆయన బేషరతుగా హర్షం ప్రకటించారు

కాంగ్రెసు పార్టీ అగ్ర నాయకుల్లో ఒకరై స్వతంత్ర భారతదేశపు తొలి రాష్ట్రపతి పదవి నలంకరించిన బాబూ రాజేంద్రప్రసాద్‌ను మొదటిసారిగా గాంధీ చంపారన్‌లోనే ఒకానొక సందర్భంలో కలుసుకొన్నారు

శ్రీ చంపారన్ పాత్రిళ్లలో తదుపరి స్వాతంత్ర్య పోరాటబిడ్డ ఎదుగుతుంటే మాంటేగు తదుపరి సంస్కరణల ముసాయిదా రూపొందించే పనిలో మునిగిపోయి వున్నారు. అదే తరుణంలో భారత ప్రభుత్వం రౌలట్ కమిటీని నియమించింది. విప్లవ కార్యాచరణ పథకాలు విద్యావంతులైన మధ్యతరగతి ప్రజానీకానికే పరిమితమైన బెంగాల్‌లోవలె గాక ప్రపంచ యుద్ధ కాలంలో ఈ విప్లవ బీజాలు పంజాబ్‌లో విస్తృతంగా వ్యాపించాయి. భారతీయ సైన్యంలోని సిక్కులు, పంజాబులోని పేద రైతాంగంకూడా ఈ విప్లవ కార్యాచరణ పథకాల్లో పాలు పంచుకొనే ధోరణులు బాహాటంగా కనిపించాయి.

ఏళ్ల క్రితం అమెరికా, కెనడాలకు వలసపోయిన భారతీయులు ముఖ్యంగా సిక్కులు, గదర్‌పార్టీ అనే క్రొత్త విప్లవ పార్టీ స్థాపించారు. బెంగాల్‌లోని యుగంతర్

పార్టీలతో దీనికి సంబంధాలు ఉన్నాయి. ప్రపంచ యుద్ధం మొదలుకాగానే ఈ సిక్కులలో అనేకమంది విదేశీ సహాయంతో బ్రిటిష్ ప్రభుత్వంపై సాయుధ తిరుగుబాటు రేకెత్తించడానికి భారత దేశం వచ్చారు. ముందే చెప్పిన విధంగా ఈ బృహత్ పథకం నీరుకారిపోయింది. కాని ప్రయత్నాలు ఆగలేదు. 1916 ఆకరకు ఈ శక్తులు బెంగాల్‌లో, పంజాబ్‌లో క్షీణించి పోయాయి. ప్రపంచయుద్ధంలో మిత్రరాజ్యాల కూటమి గెలుపు తథ్యమని తేలిపోయింది. సంస్కరణలు ప్రకటించే దాక ప్రభుత్వానికి సహనం కొరవడింది. ప్రభుత్వాధికార కార్యకలాపాల స్వరూప స్వభావాలు అవగతం కాకపోయినా వాటిని అణిచివేయాలనే పంతం ప్రభుత్వానికి పెరిగింది. కఠినంగా అణిచివేత మొదలు పెడితే భారతజాతి నిర్వీర్యమై, విధేయంగా అణిగిమణిగి పడి ఉంటుందనే అభిప్రాయంలో ప్రభుత్వం పడింది

రౌలట్ కమిటీ నివేదిక ఢిల్లీ దర్బారును సంతోషపెట్టే ఫక్కీలో సాగింది. విప్లవకార్యకలాపాల్లో పాల్గొన్న వారిని అక్కడక్కడా విచారించి సాక్ష్యాధారాలతో నిమిత్తం లేకుండా తిరిగి అప్పీలు చేసుకునే హక్కు కూడా లేకుండా కఠిన శిక్షలు విధించాలని ఈ కమిటి సిఫార్సు చేసింది. 1918 జూలైలో మాంటే ఛేమ్స్‌ఫర్డ్ నివేదిక విడుదల కాగా, రౌలట్ కమిటీ నివేదిక నాలుగు నెలల ముందు 1918 ఏప్రిల్‌లో విడుదలయింది. ఆ రకంగా రాబోయే సంస్కరణలకి ఈ కమిటీ ముందే గండి కొట్టింది. బ్రిటన్ ప్రభుత్వం అసలు ఉద్దేశాలపై జాతీయతా వాదుల శంకలు ధృవపడ్డాయి ఆ తరుణంలో 1918 ఆగస్టులో బొంబాయిలో జరిగిన కాంగ్రెస్ ప్రత్యేక మహాసభ నుంచి మితవాదులు (అప్పుడు గాంధీ కూడా) వెళ్ళిపోయి జాతీయ విమోచనా సమాఖ్యను స్థాపించారు.

కాంగ్రెసుపార్టీ మహాసబభ ఇక 15 ఏళ్లలో సంపూర్ణ స్వయం పాలనాధికారం ఇవ్వాలని డిమాండు చేసింది. మాంటేగు సంస్కరణలకు మద్దతుగా మోతీలాల్ ప్రచురించే హేతుబద్ధమైన వ్యాఖ్యలు జాతీయతా వాదులను విశేషంగా ఆకర్షించాయి. అలా ఆకర్షితులైన ఆ తరుణంలోని ప్రముఖులలో శ్రీమతి అనీబిసెంటు ఒకరు. కొందరు అగ్రశ్రేణి బెంగాలీ జాతీయతావాదులతో కలిసి బొంబాయి నుంచి మోతీలాల్ తిలక్‌ను కలుసుకొనేందుకు పూనా వెళ్ళారు. హోమ్‌రూల్ లీగ్ సమావేశం జరపడానికి ఆయన తిలక్‌ను కలుసుకొన్నారు. తీవ్ర అస్వస్థత వలన తొలి రోజు సమావేశానికి మోతీలాల్ హాజరు కాలేకపోయారు. రెండో రోజు

సమావేశంలో చేతిమీద వ్రాలి ఏవో కొన్నిమాటలు మాత్రమే ఆయన మాట్లాడగలిగారు. అయితే ప్రభుత్వ ధిక్కార నేరం క్రింద ఏడేళ్లు జైలులో గడిపి సమావేశానికి కొద్ది ముందు విడుదలైన మద్రాస్ దేశభక్తుడు చిదంబరం పిళ్లైను పరిచయం చేయగానే ఆయనకు ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది. నీరసాన్ని మర్చిపోయి 'మిత్రమా' అంటూ పిళ్లైను ఆయన కౌగలించుకొన్నారు.

1918 సంవత్సరం ఆ రకంగా తుపాను ముందు ప్రశాంతతలా గడిచిపోయింది.

# 15. తుపాను

మొదటి ప్రపంచ యుద్ధం 1918 నవంబర్ 11న బ్రిటన్ మిత్ర రాజ్యాల కూటమి విజయం సాధించడంతో ముగిసింది. జర్మనీ వలస సామ్రాజ్యం, యూరప్‌లో ఆస్ట్రో - హంగేరియన్ సామ్రాజ్యం, పశ్చిమాసియాలో టర్కిష్ రాజ్యం చీలిపోయి జర్మనీ, ఆస్ట్రియా, టర్కీ చిన్న చిన్న దేశాలుగా మారిపోయాయి. రష్యాలో బోల్షివిక్కు తిరుగుబాటు దారులు గెలిచారు. జారు ప్రభువు కుటుంబాన్ని బోల్షివిక్కులు బహిష్కరించారు. ఆఫ్ఘనిస్థాన్ విదేశీ వ్యవహారాలలో స్వతంత్రంగా వ్యవహరించడం మొదలుపెట్టింది. ఈ పరిణామాల ప్రభావం భారత ప్రభుత్వ విధానాలపైనా, ఆ విధానాలకు భారతీయులు ప్రతిస్పందించే తీరుపైనా ప్రభావం చూపాయి. జర్మనీతో విప్లవకారుల కుట్రను అణచివేసినప్పటికీ, బోల్షివిక్కుల సహాయంతో విప్లవకారులు మరో కుట్రకు పథకాలు వేయరని అనుకోవడానికి లేదని ప్రభుత్వం భయపడింది రౌలత్ కమిటీ నివేదికలోని రెండు సిఫార్సులను పొందుపరిచి రెండు బిల్లులను ప్రవేశ పెట్టడానికి బహుశా ఈ భయమే కారణం. రాజధిక్కారం జరిగిందో లేదో ఏదైనా కేసులో ప్రభుత్వాధికారులూ, పోలీసులే నిర్ణయిస్తారు, అక్కడ నిందితుని విచారించి శిక్షిస్తారుతప్ప చట్టరీత్యా జరగవలసిన తతంగం ఏమీఉండదు; నిందితుని తరఫున న్యాయవాది ఉండడు. ఎగువ న్యాయస్థానానికి శిక్షపై అప్పీలు చేసుకునే అధికారం శిక్షపడిన వ్యక్తికి ఉండదు. ఏ వ్యక్తినైనా ప్రభుత్వం తన ఇష్టానుసారం దేశంలో లోపల నిర్బంధించవచ్చు. దేశం నుంచి వెళ్ళగొట్టవచ్చు. వైస్రాయ్ కౌన్సిల్‌లో ఎన్నికైన ప్రతినిధులు యావన్మందీ ఈ బిల్లును వ్యతిరేకించారు. కానీ 1919 మార్చి మూడున ప్రభుత్వం తరుఫున మెజారిటీ ప్రతినిధుల ఓటుతో బిల్లుల చట్టంగా రూపొందాయి. మహ్మదాలీ జిన్నా మరి కొందరు సభ్యులు శాసనమండలి నుంచి రాజీనామా చేశారు. భారతదేశం యావత్తు నిరసన వెల్లువ పెల్లుబికింది. భారతదేశానికి అత్యంత

విధేయులపైన ప్రతివ్యక్తి దీనిని ఘోరమైన విశ్వాస ద్రోహంగా భావించాడు.

ఈ బిల్లులు ఆమోదముద్ర పొందడానికి ముందు బెంగాల్ నేషలిస్టులు ఫిబ్రవరి 3న టౌన్‌హాలులో సమావేశం ఏర్పాటు చేశారు. ఈ సమావేశానికి అసంఖ్యాకంగా జనం హాజరవడంతో టౌన్‌హాలు బయట ఆరు బయట స్థలంలోకి సమావేశం మార్చవలసి వచ్చింది. 72 ఏళ్ల మోతీలాల్ ఆరోగ్యం క్షీణించినప్పటికీ సమావేశానికి హాజరయ్యారు. అభిమానులు ఆయనను భుజాలమీద ఎక్కించుకుని టౌన్‌హాలు మెట్లు ఎక్కించి హాలులోకి తీసుకువెళ్ళారు. సభకు చాలామంది మితవాదులు హాజరయ్యారు. బిల్లు పట్ల స్పష్టమైన నిరసన ప్రకటించే ప్రధాన తీర్మానాన్ని మోతీలాల్ ప్రతిపాదించారు.

బ్రిటిష్ పౌరుడు అనుభవించే ప్రాథమిక స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో ఏ మాత్రం పొంతనలేని విధంగా ఈ బిల్లు భారతీయ ప్రభుత్వాధికారులకూ, పోలీసులకూ నిరంకుశ బాధ్యతారహిత అధికారాలను కట్టబెడుతుంది. చట్టబద్ధమైన పాలన అంటే ఏమిటో న్యాయసూత్రాలంటే ఏమిటో వీటన్నిటికీ విరుద్ధంగా కూడా ఈ బిల్లు పరిణమిస్తుంది భారతదేశంలో త్వరగా బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని నెలకొల్పే ఆలోచనతో ప్రభుత్వం ఈ ప్రస్తుత బిల్లును ప్రవేశపెట్టకుండా ఉండాలి, లేదా, ప్రజా ప్రాతినిధ్యంతో భారతదేశపు శాసన సభ్యులను పునర్వ్యవస్థీకరించేదాకా ఈ బిల్లులను వాయిదా వేయాలని ఈ సమావేశం కోరుతుంది.

అయితే ఈ బిల్లులను ఒక సవాలుగా తీసుకొన్న గాంధీజీ దానిపై సత్యాగ్రహోద్యమం లేవదీయాలని భావించారు. ఇక ఆయన వాదోపవాదల జోలికి పోకుండా కొందరు మిత్రులను కూడగట్టుకుని, సత్యాగ్రహుల దళాన్ని రూపొందించారు. మిత్రులతో సంప్రదించిన పిదప ఆయన సాధారణ హర్తాళ్ పాటించవలసిందిగా దేశ జవాభా యావత్తుకు పిలుపు నిచ్చారు. " ఆ రోజున భారత ప్రజానీకం యావత్తు తమ పనులన్నీ విడిచి పుచ్చి నిరాహార దీక్ష పాటించి ప్రార్థనలతో రోజుగడపాలి. అన్ని రాష్ట్రాలు ఇందుకు అనుకూలంగా నడుచుకుంటాయో లేదో చెప్పడంచాలా కష్టం .... కానీ బొంబాయి, మద్రాస్, బీహార్, సింధు రాష్ట్రాల విషయంలో మాత్రం ఆ ప్రజలు తప్పక నా వినతి పాటిస్తారనే నమ్మకం నాకుంది.. " అని గాంధీ వాటారు. బెంగాల్, పంజాబ్,

మహారాష్ట్రల విషయంలో గాంధీజీ నమ్మకం కొరవడినట్లుకనిపిస్తుంది. ఆ రాష్ట్రాల ప్రజలు మౌలికంగా విప్లవ భావాలుకలవారవడమే అందుకు కారణమేమో! మార్చి 30వ తేదీన హర్తాళ్ పాటించవలసిందిగా ముందు ప్రకటించినా ఆ కార్యక్రమం ఏప్రిల్ 16కు మారింది. ఈ మూల నుంచి ఆ మూల దాకా యావత్ బారత దేశం గాంధీ పిలుపునకు కదలి వచ్చి పట్టణాలు పల్లెలనే బేధం లేకుండా జాతి జనులంతా సంపూర్ణ హర్తాళ్ పాటించడంతో గాంధీ అనుమానాలన్నీ నివృత్తి అయ్యాయి. ఆయనకు కూడా అది తనూహ్యమే కనుక ఆ రోజు గాంధీకి సైతం మహాద్భుతమైన రోజే. అది యావత్ భారతదేశానిక్కూడా మహాద్భుతమైన రోజే - ఎందుకంటే- దేశ ప్రయోజనాల కోసం ప్రజాబాహుళ్యం యావత్తు కదలివచ్చి పాల్గొన్న తొలి సంఘటన అదే.

అయితే ఎందుకో అపోహ కలిగి ఢిల్లీలో మార్చి 30వ తేదీనే హర్తాళ్ జరిగింది అంతకు పది రోజుల ముందు మార్చి 20న హిందువులు, ముస్లిముల ఊరేగింపుపై పోలీసులు కాల్పులు జరిపారు. కాల్పుల పట్ల ప్రజలలో నిరసన పెల్లుబికి స్వామి శ్రద్ధానంద నాయకత్వంలో పెద్ద ఎత్తున ఊరేగింపు జరిగి హిందూ - ముస్లిమ్ ఐక్యత ప్రస్ఫుటంగా ప్రదర్శితమైంది. బొంబాయి, అహ్మదాబాద్‌లో హిందూ ముస్లిమ్‌ల ఐక్యతకు పోలీసులకు వ్యతిరేకంగా అల్లర్లు జరిగాయి. గాంధీ తక్షణమే తన శాసనోల్లంఘన ఉద్యమాన్ని తాత్కాలికంగా నిలిపివేశారు అయితే అసంతృప్తి పేరుకుపోయి ఉన్న పంజాబ్‌లో ఏప్రిల్ 10న ప్రదర్శన హింసా దౌర్జన్యాలకు దారితీసి 10 మంది యూరోపియన్లను చంపి వేయడంతో ఆ రాష్ట్రంలో వెంటనే సైనిక పాలన విధించారు. అన్ని ప్రజా ప్రదర్శనలు నిషేధించారు. ఏప్రిల్ 13వ తేదీన అమృత సర్ పౌరులు నిషేధాన్ని ఉల్లంఘించి సమావేశం జరిపారు. జలియన్ వాలాబాగ్ అనే ప్రదేశంలో ఈ సమావేశం జరిగింది. ఆ ప్రదేశానికి బయటకు పోయే మార్గం ఒక్కటే ఒక్కటి. జనరల్ డయ్యర్ 90 మంది సైనికులను వెంటబెట్టుకొని 20 వేల మందితో కూడిన జనసమూహంపై కాల్పులు సాగించాడు. విచక్షణా రహితంగా ప్రజలను కొరడాలతో కొట్టారు. రోడ్లమీద దేకించారు. బ్రిటిష్ పతాకానికి శాల్యూట్ చేయించడానికి ప్రజలను మైళ్ల కొద్దీ దూరం నడిపించారు. పంజాబ్ గవర్నర్ ఈ అమానుష కాండను వెనకేసుకు వచ్చారు. పంజాబ్ కీలక సరిహద్దు రాష్ట్రమనీ శత్రువుల దారి

ప్రమాదంలో ఇరుక్కొందనీ సమర్థించుకొన్నారు. అయితే ఆయన లేవనెత్తిన ఆ వాదం పూర్తిగా కట్టుకథ అని తదనంతరం బ్రిటిష్ సామ్రాజ్యపు గూఢచారి విభాగం తేల్చివేసింది.

భారతదేశాన్ని ఏ శక్తి చేయలేనంతగా డయర్ బుల్లెట్లు సంఘటితం చేశాయి. సెన్సార్‌షిప్ అనే ఆంక్షలను ఛేదించుకుని జలియన్ వాలాబాగ్ ఉందంతంపైనా, తదనంతర అత్యాచారాలపైనా వార్తలు దేశమంతటా కార్చిచ్చులా నిరసనలు మారు మ్రోగాయి. ఈ వార్తలు ముందు దేశాన్ని దిగ్భ్రాంతిలో ముంచివేశాయి రవీంద్రనాథ్‌టాగూర్ నాలుగు సంవత్సరాలు క్రితం తనకు బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించిన 'సేనాని' విశిష్టగౌరవాన్ని తిరస్కరించగానే దిగ్భ్రాంతినుంచి బయటపడి దేశమంతా కర్తవ్యోన్ముఖమైంది. దీర్ఘకాలంపాటు సాగిన లార్డ్ హంటర్ అధ్యక్షతన, ముగ్గురు యూరోపియన్లు, ఇద్దరు భారతీయులతో ఒక కమిటీని నాటి వైస్రాయ్ నియమించగానే ఆ కంటితుడుపు చర్యకు నిరసిస్తూ భారతదేశంలో సర్వత్రా నిరసన కట్టలు త్రెంచుకుంది. కలకత్తా టౌన్‌హాలులో మళ్ళీ ఏర్పాటైన పెద్ద బహిరంగ సభకు మోతీలాల్ ఘోష్‌ను ఛైర్మన్‌గా నామినేట్ చేశారు. ఆయన మాట్లాడలేనంతగా కృశించిపోయి ఉన్నందువల్ల ఆయన ప్రసంగాన్ని ప్రొఫెసర్ జె.ఎల్. బెనర్జీ చదివి వినిపించారు. సి.ఆర్. దాస్ అధ్యక్షత వహించిన సమావేశంలో ఆ ప్రసంగాన్ని ఐ.బి. సేన్ చదివారు.

"ఇటీవలి సంఘటనలలో ఈ షణ్మాత్రంకూడా దోషంలేని ఎందరో అమాయకులు ప్రాణాలు కోల్పోయారు. వందలాది అమాయకులు, గౌరవప్రదంగా జీవిస్తున్నవారు అవే సంఘటనలతో అవమానాలకు, వేధింపులకు గురయ్యారు ఇదంతా ఒప్పుకోవే విషయం. అయితే మహారాజ శ్రీవారు (వైస్రాయ్ గారు) తన ప్రసంగంలో అలా ప్రాణాలు కోల్పోయిన వేధింపులకు, అవమానాలకు గురిఅయిన ప్రజల పట్ల సానుభూతిని ప్రకటిస్తూ ఒక్క మాట కూడా అనలేకపోయారు..."

"అధికారుల మస్తిష్కంలో ఏదో అలజడి బయలుదేరినట్లు అనిపిస్తోంది. కర్కశత్వం మితిమీరి పరిస్థితులు చేతులుజారి పోయినట్లు వారికి లీలగా ఒక భయం పట్టుకొంది. పంజాబ్ సర్వీసులకు చెందిన సైనిక అధికారులూ, సివిల్ అధికారులు చట్టాలనూ, నిబంధనలనూ చట్టబద్ధమైన పద్దతులనూ త్రోసిరాజని ఎలా యధేచ్ఛగా ప్రవర్తించారో ప్రివీకౌన్సిల్ ద్వారా బట్టబయలు కాక మానదన్న

ఆలోచన వారి హృదయాల్లో మెదులుతోంది. అందుకే నష్టం భర్తీ కంటూ ప్రత్యేకంగా బిల్లు తెస్తున్నారని ప్రతిపాదన వినవస్తోంది. దర్యాప్తు కమిటీ తన దర్యాప్తు ముగించి నివేదిక మూగించేదాక వేచి ఉండడం సబబుకాదా? "

ఈ దారుణ మారణ హెూమంపై కాంగ్రెస్ పార్టీ అనధికార దర్యాప్తు కమిటీని రూపొందించింది. ఈ కమిటీ దర్యాప్తు సందర్భంగానే మహాత్మాగాంధీ, సి.ఆర్. దాస్ తొలిసారి కలుసుకొని మాట్లాడుకొన్నారు. పంజాబ్‌లోని భారతీయులపై సాగిన అమానుషకాండను వారిరువురూ లోతుగా చర్చించుకున్నారు. వారిద్దరి సమావేశం అనతి కాలంలోనే గొప్ప ఫలితాలకు దారితీసింది

పంజాబ్‌లోని అనాగరిక, అణిచివేత చర్యల పర్వాన్ని పత్రిక తన సంపాదకీయాలతో సూటిగా నిశితంగా ఖండించింది. భారతదేశంలోని బ్రిటిష్ సివిల్ సర్వీస్‌ల తీరుతెన్నులను ఆ వ్యాఖ్యలలో వేలెత్తి చూపారు. "ఈ అధికారులు ముందు తమ పొంత సేవ చేసుకున్న తర్వాతే మాతృదేశసేవ గురించి ఆలోచిస్తారు" అని పత్రిక రాసింది. ఇంకా ఇలా వ్యాఖ్యానించింది.

"ప్రజలకు తుదకు కనువిప్పు కలిగింది. చట్టబద్ధమైన పాలనా అనేది ఇక లేదనీ, పాలకులు తలచుకుంటే ప్రజలను పిట్టలను కాల్చినట్లు కాల్చిచంపి వేస్తారనీ జన బాహుళ్యం గుర్తించింది. రౌలట్ చట్టం బ్రిటిష్ పాలనలోగల భారతీయుల ప్రాథమిక మానవహక్కులను కూడా కాలరాచిన అత్యంత ప్రమాదకరమైన చట్టమని కూడా వారు తెలుసుకోగలిగారు. అంతేకాక హిందువులూ, ముసల్మాన్లూకూడా తమ మత భేదాలను విస్మరించి సంఘటిత శక్తిగా, రూపొందారు. తమ పరిస్థితిని మరింత పదిల పరచుకునే మాటదేముడెరుగు, దానిని మరింత దిగజార్చుకున్నాం అని అధికార యంత్రాంగానికి ఆ రకంగా కనువిప్పు కలిగింది. పంజాబ్‌లో చట్టవిరుద్ధంగా కర్కశత్వాన్ని కురిపించి రౌలట్ చట్టాల వంటి నిర్దాక్షిణ్య శాసనాన్ని ఆమోదించి గొప్పతప్పిదమే చేశామని బ్రిటిష్ అధికార యంత్రాంగానికి అవగతమైంది.

1913 నుంచి ప్రభుత్వ ఖజానాలో ఉన్న పత్రిక దరావత్తు అయిదు వేల రూపాయలను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడమే కాక మరో 10 వేల రూపాయలు దరావత్తు కట్టాలని డిమాండు చేసింది. మే 15వ తేదీన పంజాబ్‌లో ఈ పత్రిక ప్రవేశాన్ని నిషేధించారు. అనతికాలంలో పత్రిక ఖాతాదార్లు, శ్రేయోభిలాషులు కొత్త డిపాజిట్

సొమ్మును విరాళంగా ఇచ్చారు. పత్రికను ఆర్థికంగా ఇబ్బడి ముబ్బడి పరిస్థితుల్లో ఇరికించాలన్న ఎత్తుగడ ఆ రకంగా గాలికి కొట్టుకుపోయింది. పట్టువదలని విక్రమార్కుడి వంటి మోతీలాల్ మళ్లీ సంపాదకీయంలో ఇలా వ్రాశారు" బొందిలో ప్రాణం వున్నంత కాలం మా స్వేచ్ఛని పూర్తిగా గుంజుకోనంత కాలం మావిధి మేము నిర్వర్తిస్తూ పోతాము. ప్రస్తుత పత్రికల చట్టంక్రింద అధికారయంత్రాంగం హృదయాలను గాయపరచకుండా ప్రజాబాహుళ్యానికి సంబంధించిన సంఘటనలు, విధానాలపై నిజాయితీతో వ్యాఖ్యలు చేయడం దుర్లభమై పోయింది. ఈ పత్రికా చట్టం నిబంధనల ప్రకారం ఆదర్శవంతమైన పత్రికను మేము అందించాలంటే నిత్యరాజకీయాలను గాలికొదిలేసి ఇక బంగాళాదుంపలమీద, అరటి పళ్ల మీద రాయాలి".

దేశంలో పరిస్థితి జ్వలితజ్వాలలా మండుతోంది. అంతర్జాతీయ ఖ్యాతిగల రవీంద్రనాథ్‌టాగూర్ జలియన్ వాలాబాగ్ అత్యాచారాలను నిరసిస్తూ మే 29న బ్రిటిష్ ప్రబుత్వపు సైనికగౌరవ పట్టాను వాపసు చేశారు. ఆ సందర్భంగా ఆయన వ్రాసిన లేఖ పత్రికలో ప్రకటితమైంది. దారుణ మారణకాండలో ఆ చేతకి దిగ్భ్రాంతిలో మునిగిపోయి వున్న పత్రికల పాఠకులు రవీంద్రనాథ్‌టాగూర్ లేఖ చదివిన తర్వాత ఈ పరిస్థితిలో కార్యశూరత్వం కావాలి తప్ప మాటల వల్ల ఏమీ జరగదని గ్రహించి దిగ్భ్రాంతి నుంచి చేతనావస్థలోకి వచ్చారు. విచక్షణా రహితంగా గురిపెట్టి వున్న తుపాకీలను జయించి అటువంటి కార్యశూరత్వాన్ని ఎలా ప్రదర్శించాలన్నది నాటి ప్రశ్న. మాంటేగు - జేమ్స్ ఫర్డ్ సంస్కరణల బిల్లు ప్రవేశపెట్టనున్న కాలంలో బ్రిటిష్ ప్రభుత్వంపై భారతీయుల క్రోధాగ్ని ఎంతగా ప్రబలివున్నదో డిసెంబరు 19న మోతీలాల్ వ్రాసిన సంపాదకీయంలో వ్యక్తమయింది.

"ఫౌంటైన్ మార్చకుండా ఫౌంటైన్ నుంచి నీటిని తీసుకుపోయే గొట్టాలను మార్చితే మంచినీళ్ళు ఎప్పటిలాగా త్రాగశక్యం కాకుండా వుంటాయే తప్ప ఎంత మాత్రం మెరుగు పడవు.

ఆ విధంగా 1919 డిసెంబరు 23న ఆమోదించిన భారత ప్రభుత్వ చట్టం జాతీయతా వాదులకు అసంతృప్తినే మిగిల్చింది. అసలు ఈ చట్టం భారతీయులకు స్వయం పాలనార్హత ఇంకా సమకూడలేదన్న అభిప్రాయం ప్రాతిపదికగా ఈ

చట్టం రూపొందించారు. ఈ చట్టం "బ్యార్కీ" అనే పాలన పద్ధతిని ప్రవేశపెట్టింది. ఈ చట్టం క్రింద విద్య, ప్రజారోగ్యం, పబ్లిక్ వర్క్స్ మంత్రులు నిర్వహణలో వుంటాయి. ఈ మంత్రులు ఆయా రాష్ట్రాల శాసనసభలకు జవాబ్దారీలుగా ఉంటారు. ఒక్క మంత్రి జీతం ఏడాదికి 64 వేల రూ॥లు పోలీసులు, న్యాయశాఖలు, భూమి శిస్తు సాధారణ పాలనా శాఖలు గవర్నర్ ఆయన కౌన్సిలర్ల పరిధిలో ఉంటాయి. ఎప్పటిలాగానే కేంద్రప్రభుత్వం భారతీయ శాసన మండలితో సంబంధం లేకుండా ఉంటుంది. మహ్మదీయులు, సిక్కులు (పంజాబ్), క్రిష్టియన్లు (మద్రాస్) వేరువేరుగా వోటర్లు. పదేళ్ల పరిస్థితిని సమీక్షించి బాధ్యతాయుతమైన ప్రభుత్వం ఏర్పాటు చేయాల్సినదేమైనా ఉంటే వీలు వెంబడిని చేసేటట్లు ఈ అంశం కూడా పొందు పరిచారు.

ఈ సంస్కరణలను భారతీయులకు ఆమోదయోగ్యం చేయడానికిగాను ఈచట్టాన్ని ఆమోదించిన తరువాత రాజకీయ ఖైదీలతో సహా డిటెన్యూలకు క్షమాభిక్షను అయిదవ జార్జి ప్రభువు ప్రకటించారు.

"నా ప్రజలకు, నా ప్రభుత్వాన్ని నడిపే అధికారులకు మధ్య ఏదైనా ద్వేషభావం ఉంటే అది సమసి పోవాలని కోరుకొంటున్నాను" అని చక్రవర్తి ప్రకటించారు.

మితవాదులంతా ఈ మొత్తం వ్యవహారాన్ని పూర్తిగా నమ్మారని చెప్పలేము కాని ప్రతిఘటనకు నిర్దిష్ట కార్యక్రమమం ఏదీ లేనందు వలన 1919 డిసెంబర్ నెలాఖరులో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో జాతీయతావాదులు సమావేశమై ఈ సంస్కరణలు అసంతృప్తికరంగా, అసంపూర్తిగా ఉన్నాయిని ఏకీభవిస్తూనే భారత ప్రభుత్వ చట్టాన్ని ప్రస్తుతానికి బలపరచాలని నిర్ణయించారు. ఈ చట్టాన్ని నిరసించాలని సి.ఆర్.దాస్ నాయకత్వంలో బెంగాల్ అభిప్రాయపడగా ముందు చట్టాన్ని అమలు కానిచ్చి బాగోగులు పరీక్షించాలని గాంధీ, తిలక్ అభిప్రాయ పడడంతో ఈ నిర్ణయం ఇరువర్గాల మధ్య రాజీ నిర్ణయమయింది.

అయితే నెల రోజులలోనే పరిస్థితి అర్ధంతరంగా మారిపోయింది. 1920 సెవర్స్ ఒప్పందం ప్రకారం ప్రపంచ యుద్ధంలో గెలుపొందిన మిత్ర కూటమిలోని దేశాలకు పశ్చిమాసియాలోని టర్కిస్ సామ్రాజ్యపు ఆస్తిపాస్తులను పంపిణీ చేయాలనే నిర్ణయం బారతదేశంలోని మహమ్మదీయులను ఎంతగా మత్తులో

ముంచిందటే మహమ్మదాలీ, షౌకత్ అలీ వంటి నాయకులు బ్రిటిష్ రాజ్‌పై తిరుగుబాటు, రక్తతర్పణం వంటి, మాటలను బాహాటంగా ఎద్దేవా చేస్తూ ప్రకటనలు చేయడం ప్రారంభించారు. అంతేకాక కాంగ్రెస్ పార్టీ నియమించిన అవధికార కమిటీ దర్యాప్తులో పంజాబ్ అత్యాచారాల భయానక వివరాలు ఒకటొకటిగా బైటపడుతుంటే జనరల్ డయర్ బ్రిటన్‌కు తిరిగి వెళ్లి పోయినప్పుడు అక్కడ అతనికి ఒక నాయకుడికి వలె స్వాగతం లభించింది. బ్రిటన్ పార్లమెంటులో దిగువసభ జనరల్ డయర్‌ను అభ్యసించింది గాని ఎగువసభలో మెజారిటీ వర్గం అతనికి మద్దతు ప్రకటించింది.

బ్రిటిష్ అధికార వృక్షం వ్రేళ్లు అవినీతిలో కుళ్ళి పోవడాన్ని గాంధీ ఇక సహించలేక పోయారు. అందుచేత ప్రభుత్వానికి గట్టిగా ప్రతిఘటన ఇచ్చేందుకు బలమైన మార్గం అహింసాత్మక సహాయ నిరాకరణే అని ఆయన గుర్తించారు. ప్రభుత్వానికి అన్నింటా ఈ సహాయ నిరాకరణ సాగాలని ఆయన నిర్ణయం చేశారు. అఖిల భారత ఖిలాఫత్ కమిటీ ముస్లింలీగ్‌లకు చెందిన ముస్లిమ్ నాయకులను ఈ సహాయ నిరాకరణ ఒక విధంగా అనుమతించాలనీ, బెంగాల్, యు.పి., బీహార్, పంజాబ్, బొంబాయిలలోని జాతీయ వాదులలో మెజారిటీ వర్గం తనతో అంగీకరించాలనీ గాంధీ పట్టుబట్టారు. కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ ప్రత్యేక సమావేశంలో గాంధీ వాదం కొద్ది మెజారిటీతో నెగ్గింది. ఈ లోగా ఆగస్టు 1న తిలక్ కన్నుమూశారు. జాతీయ వాదంతో బెంగాలీ తత్వానికి సూత్రదారులైన సి.ఆర్. దాస్, బిపిన్ చంద్రపాల్ చర్ఖాతో నూలు వడకడానికి సర్వరోగ నివారిణిగా సకల సమస్యల పరిష్కారంగా చూపే గాంధీ తత్వాన్ని నిరసించారు. మధ్య యుగపు మతపరమైన విశ్వాసాలకు ప్రాతిపదికగా చూపే ఉత్తేజం శైశవదశలో ప్రజాస్వామ్యం అభివృద్ధికి గొడ్డలిపెట్టు కాగలదనీ, భారతజాతి అనుభవిస్తున్న అవమానాల బాధలన్నింటికీ మూలకారణమైన దాస్య ప్రవృత్తిని పరిహరింపలేదనీ వారు నమ్మారు. అయితే కేవలం రాజకీయపరమైన స్వరాజ్యం మాత్రమే గాక పెట్టుబడిదారీ పరిశ్రమలకు బదులుగా గ్రామీణ పరిశ్రమల స్థాపన ద్వారా సామాజిక న్యాయాన్నీ, ఆర్థిక పురోగతిని సాధించడం ధ్యేయంగా గల గాంధీ ఉద్యమాన్ని రైతాంగం బలపరిచింది. శతాబ్దం ఆరంభం నుంచీ సి.ఆర్. దాస్. పయోధ్య ఏర్పరచుకొన్న బెంగాలీ విప్లవకారులందరనూ 1920 మూడవ చతుర్థ భాగంలో

విడిచిపుచ్చారు. వారిలో అధిక సంఖ్యాకులు అహింసాయుతమైన కార్యాచరణ ద్వారా దేశంలో భారీఎత్తున ప్రజాఉద్యమాలన్నీ నిర్వహించడం సుసాధ్యమని గ్రహించి సహాయనిరాకరణోద్యమంలో చేరవలసిందిగా సి.ఆర్. దాస్‌ను పట్టుబట్టారు. 1920 డిసెంబరులో నాగపూర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభలో గాంధీ ప్రవచించిన అహింసాయుత సహాయ నిరాకరణ ప్రతిపాదనకు అత్యధిక మెజారిటీతో ఆమోదం లభించింది. సి.ఆర్. దాస్, మోతీలాల్ నెహ్రూ, జవహర్‌లాల్ నెహ్రూ కొత్తగా గాంధీతత్వాన్ని ఆమోదించిన వారిలో ఉన్నారు అది ఆయా నాయకుల వ్యక్తిగత చరిత్రలో అద్భుతమైన మలుపు. దానితో ఐశ్వర్యం మధ్య తులతూగుతూ వచ్చిన వారంతా సాధారణ జనజీవితాన్ని వరించినట్లయింది. చివరికి ఆ రకంగా ప్రజల మనుషులయ్యారు వాళ్ళు. గాంధీగారి సహాయనిరాకరణ ఉద్యమంలో సామాజిక అంశం ఎంత బలీయమైనదో, అది ఎందరి గొప్ప వారిపై ఎలా ప్రభావం చూపిందో, తమ వృత్తులను పరిత్యజించి ఎందరో గ్రామీణ స్థాయిలో కార్యాచరణకు ఎలా నడుం కట్టేలా చేసిందో నికరంగా వెల్లడయింది. ఒక జాతీయ ఉద్యమంలోని అసలుసిసలైన శక్తి యుక్తులన్నీ జనబాహుళ్యం మధ్యనుంచి పెల్లుబికడం ప్రారంభమైంది.

# 16. గాంధీ – మోతీలాల్

సాంఘికసేవా రంగంపై సి.ఎఫ్. ఆండ్రూస్ ప్రభావానికి ఈ సంఘటన తార్కాణంగా నిలిచింది. ఆయన గాంధీ, రవీంద్రనాథ్‌టాగూర్‌ల సన్నిహిత మిత్రునిగా పేరు గాంచారు.

సహాయ నిరాకరణోద్యమం మొదలైన సంవత్సరంలోనే అహింసా సిద్ధాంతం మీద మహాత్మాగాంధీ నిర్దేశించిన నిర్మాణాత్మక కార్యక్రమం మీదా విశ్వాసంగా నేషనలిస్టులకీ, బహిష్కరణ కార్యక్రమాన్ని ప్రతిఘటన ఉద్యమంగా అనుసరిస్తున్న వారికీ మధ్య అభిప్రాయ భేదాలు స్పష్టంగా బైటపడ్డాయి. ఈ రెండో వర్గం దేశబంధుదాస్ సారధ్యంలో బెంగాల్‌లో బలపడి స్థానిక సంస్థలకి కూడా ప్రతిఘటన పోరాటం విస్తరింపచేయాలని నిర్ణయించింది. విదేశీ వస్త్రాలు; విదేశీ మద్యం దుకాణాల ముందు పికెటింగులూ ఉధృతంగా సాగాయి. విదేశీ వస్త్రాలతో 'భోగిమంటలు" తరుచూ కనపడే దృశ్యం. తొలి వలంటీర్ల దళానికి సుభాష్ చంద్రబోస్ నాయకత్వం వహించారు. రెండో ప్రపంచ యుద్ధకాలంలో బర్మాలో "ఇండియన్ నేషనల్ ఆర్మీ" ని వ్యవస్థాపించి స్వాతంత్ర్య ఉద్యమంలో సువర్ణ ఘట్టాన్ని ఉల్లేఖించిన వీరుడు ఆయనే. దాస్ భార్య "బసంతీదేవి" నాయకత్వంలో స్త్రీలు కూడా శాంతియుత ప్రదర్శనాల్లో పాల్గొనడానికి ముందుకు ఉరికారు. ఈ కార్యకలాపాలు 1921 నవంబరులో "వేల్స్" యువరాజు పర్యటనకు వస్తున్న ప్రకటనతో పతాక స్థాయికి చేరుకున్నాయి. యువరాజు పర్యటనకు గుర్తింపు యివ్వరాదనీ, ఆ సందర్భంగా దేశ వ్యాప్తంగా హర్తాళ్ పాటించాలనీ 'కాంగ్రెస్ ఖిలాఫత్ కమిటీ నిర్ణయించాయి. యువరాజుకు స్వాగత మివ్వడానికి అధికారులతోనూ, విధేయులతోనూ ఒక కమిటీ ఏర్పడింది. అప్పటికి బెంగాల్ మంత్రిగా ఉండి "పిడికెడు కాసుల కోసరం కోటులో దర్జాగా ఒక రిబ్బన్ తగిలించుకునే గొప్పకోసం మమ్మల్ని విడిచిపోయిన నాయకుడు"గా పత్రిక

విమర్శించిన సురేంద్రనాథ్ బెనర్జీ కూడా ఈ కమిటీలో సభ్యుడు. అప్పటికి ఆయనకు "సర్" అనే బిరుదు కూడా వచ్చింది. మోతీలాల్‌ను సంప్రదించకుండా ఆయన అనుమతిని తీసుకోకుండానే ఆయన పేరును కమిటీ సభ్యుల జాబితాలో ప్రచురించారు. ఆ తరువాత మోతీలాల్ వైఖరి స్పష్టం చేస్తూ పత్రికలో ఒక ప్రకటన వెలువడింది. "ప్రిన్స్ ఆఫ్ వేల్స్ ఆహ్వాన సంఘంలో మోతీలాల్ ఘోష్ చేరారా అంటూ ఎందరో మాకు లేఖలు వ్రాశారు. ఆయనకు తెలియకుండా ఆయన అనుమతి తీసుకోకుండానే ఆయనను నామినేట్ చేయడం జరిగిందని వారందరికీ తెలియబరుస్తూ జాబులు వ్రాశాము. ఆ కమిటీలో ఉండడం వీలుపడదనీ, కమిటీ కార్యదర్శులకి ఆయన లేఖలు వ్రాశారు కూడా' అంతటతో ఆ వివాదానికి తెర పడవలసింది కాని తన ఒకప్పటి శత్రువు, ప్రత్యర్థి అయిన మోతీలాల్ మీద తనదే గెలుపు అనిపించుకోవాలని "కుక్కకాటుకి చెప్పు దెబ్బ" తీయాలని సురేంద్రనాథ్ తహతహలాడాడు వేల్సు యువరాజు పట్ల మోతీలాల్ ప్రస్తుత వైఖరికీ, గతంలోని వైఖరికీ ఎంతో తేడా ఉన్నదంటూ సురేంద్రనాథ్ వ్రాసుకొచ్చాడు. 1906 జనవరిలో వేల్స్ యువరాజు పర్యటించినపుడు మోతీలాల్ ఆయన ముందు సాగిలపడి ప్రమాణం చేశారని బెనర్జీ ఎత్తిపొడిచారు. మోతీలాల్ ఈ వ్యాఖ్యని తిప్పికొడుతూ పత్రికలో వివరణ ప్రచురించారు!

"భారతదేశ భవిష్య చక్రవర్తి ముందు బాబూ మోతీలాల్‌ఘోష్ మోకరిల్లారంటే కారణం - స్వార్థ ప్రయోజనాలు నెరవేర్చడం కోసరమా, దేశం కోసరమా ? తెల్ల దొరలనించి బిరుదు సంపాదించడం కోసమో, ఏడాదికి 64వేల రూపాయలు తెచ్చే మంత్రి పదవి కొట్టేయడం కోసమో జీవితాంతం నమ్ముతూ వచ్చిన సూత్రాలను హఠాత్తుగా విస్మరించి దేశాన్ని వెన్నుపోటు పొడుస్తున్న కొందరు ప్రజా ప్రముఖుల్ని చూస్తూనే వున్నాం. అలా పదవికో, బిరుదుకో మోతీలాల్ ఆ పని చేయలేదని నిస్సంశయంగా చెప్పవచ్చు."

వేల్సు యువరాజు బొంబాయిలో అడుగుపెట్టిన నవంబరు 17వ తేదీన బెంగాల్‌లోని అన్ని పట్టణాలలో హర్తాళ్ పాటించారు. బెంగాల్ ప్రభుత్వం అది చూసి గంగవెర్రులెత్తి పోయింది. ఎందుకంటే - నెల రోజుల్లో యువరాజు కలకత్తా సందర్శనకు వెళ్లినప్పుడు యిలాగే హర్తాళ్ మళ్లీ జరిగితే అధికార యంత్రాంగానికి అగి ఎంతో అప్రతిష్ఠ తెస్తుంది. దాంతో వాలంటీర్ బ్రిగేడ్‌లను

చట్ట వ్యతిరేకమైనవిగా ప్రకటించి స్త్రీ, పురుష విచక్షణ లేకుండా వాలంటీర్లందరమూ అరెస్టు చేయవలసిందిగా "రూనాల్డ్ షే" ఉత్తర్వు చేశారు. ఇక ఎటు చూస్తే అటు అరెస్టులు, దాస్, ఆయన ప్రధాన సహచరులు కూడా అరెస్టు అయ్యారు. 1922 ఫిబ్రవరి 12న శాసనోల్లంఘన ఉద్యమం తాత్కాలికంగా విరిమి వేతకు గాంధీ ఉత్తర్వు చేసినప్పటికీ "రూనాల్డ్షే" ఉత్తర్వుతో భారీగా అరెస్టులు సాగుతున్నప్పటికీ బెంగాల్ పరిస్థితిలో తక్షణ మార్పేమీ కనపడలేదు. జైలుకు వెళ్లడం ఒక ప్రహసనంగా మారి సామాన్య ప్రజలకి కూడా జైలంటే భయంలేకుండా పోతోందని మితవాదులు కూడా ప్రభుత్వ వైఖరివి తెలివిలేనితనంగా జమకట్టి ఆ ప్రభుత్వం మీద ఆగ్రహం తెచ్చుకున్నారు. రాజీ కోసరం వైస్రాయ్ పిలవనంపగా గాంధీ వెళ్లారు. ప్రజలకి ప్రభుత్వం అందించదలచిన రాజ్యాంగపరమైన రాయితీ లేమిటో స్పష్టంగా ప్రకటించాలనీ, రాజీ చర్చలకు షరతుగా సత్యాగ్రహులందరమూ జైల్లోంచి విడిచి పెట్టాలని గాంధీ స్పష్టంచేశారు. ప్రభుత్వం అందుకు తిరస్కరించగా 1922 మార్చిలో గాంధీని అరెస్టుచేసి ఆరేళ్ళ జైలు శిక్ష విధించారు. నేషనలిస్టులు శాసనమండలి సభ్యత్వంపొంది ప్రభుత్వం చేయదలచిన సంస్కరణలకు లోపలినుంచి అడ్డంకులు కల్పించడం మంచిది అన్న అభిప్రాయం బెంగాల్ పౌరుల్లో బలపడుతూ వచ్చింది. దాస్ జైల్లోవున్నాకూడా ఉద్యమ స్ఫూర్తి యథావిధంగానే వుంది. శాసనసభలో మెజారిటీ ఓటు ద్వారా ప్రభుత్వ చర్యలను తిరస్కరించడం మంచిదన్న వాదనకు 'మోతీలాల్ నెహ్రూ' 'విఠల్ భాయ్ పటేల్, టంగుటూరి ప్రకాశం' కూడా మద్దతు ప్రకటించారు.

విఠల్‌భాయ్, ప్రకాశం 1922, ఏప్రిల్ 23న మోతీలాల్ ఘోష్‌ను ఆయన ఇంటిలో కలుసుకున్నారు. మోతీలాల్ తీవ్ర అస్వస్థతతో ఆరునెలలుగా మంచానికి అంటిపెట్టుకుని వున్నారు. మోతీలాల్‌తో జరిపిన సంభాషణ పై శ్రీ టంగుటూరి ప్రకాశం తన "స్వరాజ్య" పత్రికలో రిపోర్టు వ్రాశారు. "స్వరాజ్య"లో వ్రాసిన ప్రకారం మోతీలాల్ ఏమన్నారంటే – "క్రొత్తగా కౌన్సిల్ ఏర్పడినప్పుడల్లా అందులో ప్రవేశాన్ని నేను వ్యతిరేకిస్తూ వస్తున్నాను. మహాత్మాగాంధీ గారు కూడా గత ఏడాది నన్ను కలుసుకోవడానికి వచ్చినపుడు (విఠల్‌భాయ్ కూడా అప్పుడు వున్నారు) నేను ఆయనతో ఒకమాట అన్నాను. ఎవరు కౌన్సిల్‌కు వెళ్ళినా అక్కడ విషపూరితమైన దుష్టవాతావరణంలో చెడిపోవడం ఖాయం. మన

శిబిరంలోనే కొందరు కౌన్సిల్‌లో ప్రవేశాన్ని కోరుకోనడం దురదృష్టకరం. మన శిబిరంలో యిది చీలిక తేకూడదు!"

పటేల్ జవాబు – "స్త్రీలతో సహా 25 వేలమంది దేశభక్తులని మనం జైళ్లకు పంపిన తరువాత ఇప్పుడిలా మాటలాడడంలో ప్రయోజనం లేదు. చీలిక రాకుండా శాయశక్తులా కృషిచేస్తాం. డిశంబరులో జరిగే కాంగ్రెస్ సదస్సులో ఈ అంశం ప్రస్తావనకు వస్తే పరిష్కారం కుదరవచ్చు."

నాయకుల, దేశభక్తుల త్యాగం ప్రస్తావనతో మోతీలాల్ కళ్లు చెమర్చాయి. "ఇంతటి త్యాగం, ఐకమత్యం దేశంలో నేను బ్రతికుండగా చూస్తాననుకోలేదు. ఇప్పుడు యింకా జీవించి వుండి ఇదంతా చూడగలుగుతున్నందుకు ఎంతో ఆనందంగా వుంది," అన్నారు.

వారిద్దరూ ఆ మహా వృద్ధనాయకునివద్ద శెలవు తీసుకున్నారు. సంభాషణ జరిగినంత కాలమూ ఎంత కోరినా ఆయన పడుకోవడానికి నిరాకరించారు. మంచంమీద ముడుచుకు కూర్చుని వణకుతున్న కంఠంతో ఆయన మంత్రించినట్టు మాట్లాడారు. అధికారం చేతిలోకి రాగానే నైతికంగా దిగజారడం జరుగుతుందన్న భయమే కౌన్సిల్ ఎంట్రీ ప్రయోజనాన్ని గుర్తించినా, మోతీలాల్ దాన్ని వ్యతిరేకించడానికి కారణం ఎన్నికలు కూడా స్వేచ్ఛగా మామూలుగా జరగడం లేదు. తక్కువ ఓట్లు పడడం, మతపరమైన, యితర సంబంధమైన ప్రాతినిధ్యం కారణంగా కాంగ్రెస్ అపోజిషన్ సన్నగిల్లవచ్చునని కూడా ఆయన భయపడ్డారు అయితే సర్వస్వేచ్ఛాయుతమైన పార్లమెంటు కావాలి. లేకపోతే అసలు ఏదీ వద్దు. అదీ ఆయన కోరేది.

# 17. చివరిదినాలు

మోతీలాల్ ఆరోగ్యం ఎప్పుడూ బాగుండేడి కాదు. శైశవ ప్రాయంనుంచీ తగని సుస్తీతో బాధపడుతూ వస్తున్నారు. మిత భోజనం తగని సుస్తీతో బాధపడుతూ వస్తున్నారు. మిత భోజనం వేళ ప్రకారం భౌతికావసరాలు అలవాటు చేసుకోవడం వల్లనే ఆయన తన బరువు బాధ్యతలు సక్రమంగా నెరవేర్చగలిగాడు. ప్రజాజీవితంలో అలుపు ఎరుగని వ్యక్తి. దాపరికంలేని మనిషి, పోరాటశీలి. జర్నలిస్టుగానూ, రాజకీయవేత్తగానూ అంతే. వ్యక్తిగత జీవితంలో ఆయన ఉమ్మడి కుటుంబంలో అందరికీ ప్రీతిపాత్రుడైన పెద్ద. చాలా నిరాడంబరుడు. పొగ తాగడు. మద్యం ముట్టుకోడు. చిన్న ధోవతీ, చొక్కా ధరించేవాడు. రాజాగారిని ఉన్నతాధికారులనీ కలుసుకోవడానికి కూడా ఏ లోటూ లేని గ్రామీణ రైతులా సాదా దుస్తులలోనే వెళ్లేవారు. ఎంత ఘాటుగా వ్రాసినా, ఎంతటి ఆవేశం ముప్పిరిగొన్నా ఆయన విమర్శలు నిక్కచ్చిగా ఉండేవి. అయినప్పటికీ సాటి జర్నలిస్టులలో గిట్టనివారు ఆయనపై దురుద్దేశ పూర్వకంగా చెడురాతలు రాశారు. అయినప్పటికీ ఆయన తన ప్రత్యర్థులపై నిర్హేతుకమైన రాతలు వ్రాయలేదు. వ్యక్తిగత మిత్రులతో పెద్దమనిషి తరహాగా అవగాహన పూర్వకంగా మెలిగేవాడు. నిజాయితీ హాస్యప్రియత్వంతో తన రాజకీయ ప్రత్యర్థుల నుంచి ఆయన ఎందరినో మిత్రులుగా మలచుకున్నారు తన పరిపాలనా తీరుమ తిరుగులేని విధంగా ఖండించే ఆయనంటే రుచించని బ్రిటిష్ అధికారులలో కూడా చాలామంది ఆయనకు మిత్రులుగా మారారు. ఇంటినే ఆఫీసుగా చేసుకొని వేళకాని వేళల్లో కూడా ఎవరొచ్చినా ఆయన స్వాగతం చెప్పేవారు. సమాజంలోని అన్ని వర్గాల ప్రజలు కూడా తమ కష్టాలు చెప్పుకోవడానికో, ఆయన సలహాకోసరమో వస్తూ వుండేవారు. పత్రికా నేషనలిస్టు రాజకీయాలు ఆయన ముఖ్య వ్యాపకాలు. సంగీతం, వైష్ణవ సాహిత్యాధ్యయనం ఆయన అభిరుచులు. సమకాలికులు అరవిందో, బిపిన్ చంద్రపాల్, ఠాగూర్, గాంధీలవలె భారత జాతీయోద్యమ

సిద్ధాంత కర్త కాకపోయినా సామాన్య మానవుడి మేలు కోసరం కలతచెంది గ్రామీణ జీవితం పట్ల అవగాహనతో తనదైన దారిలో ఆయన పయనించారు.

1917 ఎన్నో బరువు బాధ్యతలు తెచ్చింది ఆయనకి. ప్రజాసంబంధమైన బాధ్యతలు అలా వుండగా 30 లక్షల రూపాయల రియల్ ఎస్టేటు సివిల్ కేసులో (డయ్‌రాన్ కేస్) కమీషన్ ముందు సాక్ష్యమివ్వడానికి నోటీసులు వచ్చాయి. ఈ వ్యవహారాల్లో బాగా నలిగిపోయిన వృద్ధ మోతీలాల్ శరీరం విశ్రాంతిని కోరుకుంది అక్టోబరులో బీహార్‌లోని సోనేనది ఒడ్డున కల కోయిల్ వార్ అనే ప్రశాంత ప్రదేశానికి కొంతకాలం విశ్రాంతి తీసుకునేందుకు ఆయన వెళ్లారు. మతం, ఆధ్యాత్మిక, విషయాలపై వ్రాసిన గ్రంథాలు కూడా తీసుకు వెళ్లారు. అక్కడ కూడా ఆయన పత్రికా వ్యవహారాలు చూస్తూ పత్రికకు కావలసిన రాతపని చేస్తూ కావలసిన ఆదేశాలిస్తూ వచ్చారు. ఆ గ్రామం ప్రశాంతత ఆయనకు మరింత విస్తేజం కలిగించింది. దాంతో ఆయన 1918 ఆరంభంలో వారణాసి వెళ్ళిపోయారు. ఇక్కడే ఆయన ఎడమచేతికి పక్షవాతం వచ్చింది. కొంత కాలానికి ఎడమ భాగం మొత్తం పక్షవాతంతో చచ్చుపడిపోయింది. ప్రాణం పోయే వరకూ ఆయనకి రుగ్మత ఉండిపోయింది.

1918 సం॥ మధ్యలో ఆయన కలకత్తా తిరిగి వచ్చేశారు. రాగానే మళ్ళీ జబ్బు చేసింది. అందువల్ల గాంధీ ప్రతిపాదించిన అహింసాత్మక సహాయ నిరాకరణోద్యమానికి ఆమోద ముద్ర వేసిన కాంగ్రెస్ సదస్సుకు ఆయన హాజరు కాలేక పోయారు. ఆయనకు శరీరం కృశిస్తోంది. కాని గుండె దిటవు సడలలేదు. 1919 సం॥లో తన ఏకైక అల్లుడు నృత్యగోపాల్ దత్ మరణాన్ని అందుకే ఆయన తట్టుకోగలిగాడు. దత్ మృతితో శోకంలో మునిగిన కుటుంబ సభ్యులను ఓదారుస్తూ అతను బ్రహ్మానందం ప్రాప్తించే ఊర్ధ్వ లోకాలకు వెళ్లిపోయినందుకు సంతోషించాలే గానీ ఎందుకా ఏడుపులు అని అన్నారు.

1921 మధ్యలో మోతీలాల్ ఆరోగ్యం పట్ల ప్రజలు ఆందోళన చెందడం ప్రారంభించారు. ఆయన ఆరోగ్య పరిస్థితిని తెలియజేస్తూ ఎప్పటికప్పుడు పత్రికల్లో వార్తలువచ్చాయి. జూలైలో స్టేట్స్‌మన్ మోతీలాల్‌ఆరోగ్యంపై యిలా రాసింది.

"చాలామమంది యూరోపియన్లతో పాటు అసంఖ్యాకంగా అభిమానులున్న అమృతబజార్ పత్రికా పాఠకులకు సంతోషకరమైన వార్త - మోతీలాల్ ఘోష్

క్రమంగా కోలుకుంటున్నారు. ఈ మధ్య ఆయనకు పక్షవాతం వచ్చిన సంగతి పాఠకులకు తెలుసు. అది పూర్తిగా తగ్గలేదు కానీ చాలావరకూ నయమైనది. మోతీలాల్ వయసు డెబ్బయి అయిదేళ్ళు."

ఇంకా ఆయన రాయడం మానలేదు. ఉదయం పూట తన యింటికి దగ్గరలో వున్న నదీ తీరానికి స్వచ్ఛమైన గాలికోసం గుర్రపు బగ్గీలో వెళ్ళి నది ఒడ్డున కుర్చీలో కూర్చొని దినపత్రికలు ఇతరుల చేత చదివించుకొని వినేవాడు. లేదా కర్రఊతతో ఆ ప్రశాంత వాతావరణంలో నడిచేవాడు. మధ్యాహ్నం రాసుకొనేవాడు లేదా ఐర్లాండ్ పరిస్థితి తెలుసుకొనేందుకు బ్రిటన్ నుంచి వచ్చిన వార్తా పత్రికలు చదువుకొనేవాడు. ఆధ్యాత్మిక గ్రంథాలు పఠించేవాడు. మృత్యువు సమీపిస్తోందన్న వాస్తవాన్ని ఆకళింపు చేసుకొని మృత్యువుతో ఆయన రాజీకి వచ్చాడు. దాని రాక కోసరం నిశ్చింతగా ఎదురు చూశాడు. ఆయన దృష్టిలో మరణం మానవుల జీవితంలో ఒక ఘట్టం, మనిషి మరణం వలన ఈ ప్రపంచాన్ని విడిచి వెళ్ళి మరింత మెరుగైన వేరే లోకంలో పునర్జన్మ పొందుతాడని ఆయన విశ్వసించేవాడు దేవుడు అతీతమైన శక్తి అనీ, ఆయన నమ్మి దేవుణ్ణి తీయని సన్నిహిత మిత్రునిగా ఆయన భావించేవాడు. శ్రీకృష్ణ, శ్రీగౌరంగ వలె మానవునిలో వుండేవాడే దేవుడు అని కూడా ఆయన నమ్మకం మానవునిపై ఆయనకు అచంచల విశ్వాసం వుంది ఆయన కర్తవ్య మార్గాన్ని ఉద్దేశింప చేసినది మానవునిపైగల విశ్వాసమే. అశేష భారత ప్రజానీకానికి తమ ఇల్లు తాము చక్కదిద్దుకునే సామర్థ్యం ఉందనీ, స్వాతంత్ర్యం వారి హక్కనీ దాన్ని సాధించడం వారి లక్ష్యంకావాలనీ ఆయన నమ్మడానికి కూడా మానవునిపైగల అచంచల విశ్వాసమే కారణం.

మోతీలాల్ ఆరోగ్యం మళ్ళీ క్షీణించినా 1922 జూలై మధ్యలో తిరిగి కొంత కోలుకోగలిగారు. ఆ సందర్భంగా ఆయన పత్రికలో యిలారాశారు.

"రాజైనా, రైతైనా, సన్యాసయినా - పామరుడయినా, ఎవరెంతటివారైనా తప్పించుకోజాలని మృత్యువు రుచి నాకు ముందుగానే అనుభవంలోకి వచ్చిందనిపిస్తోంది. వంటికి నీరు పట్టడం, ఊపిరి ఆడని ఆయాసం, వెన్ను నొప్పులు వంటి ఈ శారీరక ఈతిబాధలు దుర్భరమైనవే. ఈ మధ్యన నాకు వచ్చిన స్ట్రోక్ వంటిది మళ్ళీ వస్తే ఎంత మాత్రం భరించే శక్తి నాకు లేదు. కానీ ఆ రోజు ఎలాగో ఆ బాధంతా ఉగ్గబెట్టుకున్నాను. మృత్యువు ఆసన్నమైన

తరుణంలో శారీరక బాధ ఏదీ లేక పోగా ఏదో ఆనందం ఆవరిస్తుందని శాస్త్రీయంగా నిరూపణ అయ్యింది. అనగా శరీరం నుంచి ఆత్మ వేరై ఊర్ధ్వ లోకాలలో తన శాశ్వత గమ్యానికి వెళ్లిపోయే తరుణంలో శరీరానికి బ్రహ్మానందం ప్రాప్తిస్తుందన్న మాట. ఈ ఆనందాన్ని అతి త్వరలో అనుభవించ బోతున్నానని ఆశిస్తున్నాను. మానవాళికి ఆ ఆనందం ఇదిగో ఇలాంటిది అని వ్యక్తం చేసే సావకాశం చిక్కదని మాత్రం విచారిస్తున్నాను."

కొద్ది కాలానికి మోతీలాల్‌కు వ్యాధి తిరగబెట్టింది. చాలా నీరసించి పోయాడు. గ్యాస్ ట్రబుల్ బాగా ముదిరిపోయింది. జలోదరం వచ్చింది. న్యుమోనియా కూడా తోడైంది. కొంత కాలం నెమ్మళించిన తరువాత 1922 సెప్టెంబర్ 4న ఆయన ఆరోగ్యం ప్రమాదకర స్థితికి దిగజారి మరునాడు ఆయన కన్ను మూశారు. మరణ సమయంలో కుటుంబ సభ్యులు ఆయన చుట్టూ చేరి హరినామస్మరణ చేశారు.

మరణానికి కొద్ది రోజుల ముందు తననుచూడవచ్చిన ఒక బంధువుతో ఆయన ఇలా అన్నారు :

"నాకు తీరనిదంటూ ఏమీలేదు. మృత్యువుకి కొద్ది అంగుళాలే ఎడంగా వున్నానని నాకు తెలుసు. ఓరిమి కోల్పోకుండా దేనికైనా తట్టుకునే వయసు గడించాను. ప్రపంచంలోని ఆనందాలన్నీ పూర్తిగా చవిచూశాను. తెలిసి ఏ పాపమూ చేయలేదు. నేను ఇహాన్ని విడిచి వెళ్ళిపోతున్న చోట బ్రహ్మానందం నాకు దొరుకుతుంది. నేను ఇక ఆనందంగా ఎందుకుండకూడదో చెప్పు?"

మోతీలాల్ మృతికి అసంఖ్యాకంగా, సంతాపాలు, ఆయన స్మృతికి నివాళులర్పిస్తూ సందేశాలు వినవచ్చాయి. వాటిలోంచి మూడు భిన్న రాజకీయ సిద్ధాంతాలకు అద్దం పట్టే మూడు పత్రికలు వ్రాసిన సందేశాలు ఉదహరించడం మోతీలాల్ వంటి మహనీయుని గాథకు చక్కని ముగింపు అవుతుంది.

గాంధీజీ జైలుకి వెళ్లడంతో "సి. రాజగోపాలాచారి, జైరామ్‌దాస్, దౌలత్‌రాయ్, జార్జ్‌జోసఫ్" సంపాదకత్వం నిర్వహిస్తున్న "యంగ్ ఇండియా" పత్రిక మోతీలాల్ స్మృతికి జోహార్ లర్పిస్తూ—

"శిథిల పేటికను ఒక మహోన్నతమైన ఆత్మ విడిచిపుచ్చి వెళ్ళిపోయింది: మన రాజకీయ చింతనలో సత్యం, ధైర్యం అనే గుణాలను ప్రవేశపెట్టి దానిని

ప్రజాస్వామ్యానికి అనుగుణంగా తీర్చిదిద్దినవాడు మోతీలాల్. భారత స్వాతంత్ర్య చరిత్రలో ఆయనది గౌరవనీయమైన స్థానం. ఆత్మసౌందర్యం, దానికి దీటైన సామర్థ్యం కలిగి ప్రజల అభిమానాన్నే గాక ప్రేమకు కూడా నోచుకున్న బహుకొద్ది మంది నాయకుల్లో ఆయన ఒకరు. మహాత్మాగాంధీ, మోతీలాల్ వంటి వారిని యిలా మహనీయుల మంచి వేరు చేసే వారిలోని యీ "కృష్ణచైతన్యమే."

ఒకప్పుడు 'స్టేట్స్‌మన్' సంపాదకులుగా వుండి తదనంతరం లండన్ నుంచి వెలువడే 'ది న్యూ స్టేట్స్‌మన్' పత్రిక సంపాదకునిగా పనిచేస్తున్న ఎస్.కె.రాట్లిఫ్ యిలా రాశారు. 'తమ వ్యక్తిత్వం ద్వారాగానీ, తమ రచనల ద్వారాగానీ తమ దేశంలోని విద్యావంతులైన ప్రతిఒక్కరితో వారు విద్య అంటే తెలియని వారికి కూడా పరిచయమున్న రచయితలు ఎంతమంది? ముఖ్యంగా ఇంగ్లాండ్‌లో (ఇటీవల ఒక పేరుమోసిన సంపాదకుణ్ణి తొలగించిన తర్వాత) అటువంటి రచయిత ఒకరు కూడా లేరని చెప్పగలను. అసలు మొత్తం పాశ్చాత్య ప్రపంచంలో ఏ ఒక్క దేశంలోనూ కూడా తమ దేశస్థులలో చదువుకున్నవారికి, నిరక్షరాస్యులకీ అందరికీ తెలిసిన రచయిత అంటూ ఒక్కడూ లేడు. అయితే భారతదేశంలో అది సంభవం. భారతదేశం మొత్తం మీద విలక్షణ మేధావి ఒకరు వున్నారు. ఆయన విషయంలో ఈనాడు ఋజువైంది. ఆయనే కలకత్తాలోని అమృతబజార్ పత్రికకు చెందిన బాబూ (ఆయనను అయ్యా! అని ఎవరూ పిలవరు) మోతీలాల్‌ఘోష్ తన డబ్బయిఏడవ ఏట ఆయన శాశ్వతంగా కన్ను మూశారని గతవారం వార్త అందింది. ఆయన నిష్క్రమణతో భారతీయ జర్నలిజంలో ఒక శకం అంతరించింది ఆయన తనకు తానే ఒక మహాశక్తిగా ఎదిగిన వ్యక్తి. యావత్భారతీయులకు ఆయన పేరు సుపరిచితం. కలకత్తా నగరం ఉత్తర భాగాన పెద్ద హిందూ కుటుంబంలో నివసిస్తున్న ఇంట్లో ఆయన ఎడిటోరియల్ ఆఫీసువుంది. ఆ ఆఫీసులో పుష్కరం క్రితం ... తామే, 'మెక్‌డోనాల్డ్' "ఒక ఇటాలియన్ రాజ భవనాన్ని తలపింపచేసే చోట ఆయనను కలుసుకున్నాం. అయితే ఆ రాజ భవనాన్ని పోలిన గదిలో ప్రతిరాయీ శిధిల గాధలను చెబుతోంది. 'మెక్‌డోనాల్డ్' వ్యాఖ్యానించని మరో విషయం గురించి చెబుతాను. అదేమిటంటే - ఆ ప్రక్కనే వున్న ముద్రణాశాలలో అప్పుడు లైనోటైప్ యంత్రాలు పనిచేస్తున్నాయ్. కలకత్తాలో ఆంగ్లేయ పత్రికాధిపతులు వాటిని నెలకొల్పడానికి కొన్నేళ్లముందే

బెంగాలీ పత్రికాధిపతులు లైనోటైప్ యంత్రాలను తమ కార్యాలయాలలో అమర్చారు."

భారతదేశంలోని బ్రిటిష్‌వారి ప్రయోజనాలకు హారతి పడుతూ వచ్చిన 'ది ఇంగ్లీష్‌మాన్' పత్రిక మోతీలాల్ దివ్యస్మృతికి నివాళులు అర్పిస్తూ –

"భారతరాజకీయ రంగంనుంచి ఒక ఉత్కృష్టమైన వ్యక్తి నిష్క్రమించాడు. శ్రీ ఘోష్ జీవితకాలంలో అధిక భాగం యూరోపియన్లకు ప్రమాదకరమైన వ్యక్తిగా అమంగళ కరమైన మనిషిగా నిందలందుకున్నాడు. ఆయనపై తిరుగులేని శత్రుత్వం వున్నవారు సైతం అంగీకరించవలసిన విషయం ఏమిటంటే – ఆయన ఆశ్చర్యకరమైన, అద్భుత శక్తులున్న మనిషి కేవలం ఒకచోట బైఠాయించి ప్రభుత్వం మీద అవాకులూ చెవాకులూ వేలవేలగా రాసుకుంటూ పోయిన ప్రతివాడికీ ఆయనకు లభ్యమైన కీర్తి ప్రతిష్టలు రావు మోతీలాల్ ఘోష్ అంత కీర్తి గడించడానికి అసలు కారణం ఆయన ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రదర్శించిన సాహసం కారణం కాదనీ, ఇతర భారత రాజకీయ నాయకులు తప్పుదోవ పట్టినపుడు వారికి వ్యతిరేకంగా ఆయన ప్రదర్శించిన సాహసమే అసలు కారణమని చెప్పవచ్చు. వ్యంగ్య వైభవంతో కూడిన శైలి ఆయన సొత్తు కావడంతో ఆయన రచనలు చదివి ఆయన స్వదేశస్థులే ఎక్కువ భయపడేవారు. నిజాయితీ చిత్తశుద్ధితను తరుచూ ఎంతో ఘాటుగా విమర్శిస్తూ వస్తున్న యూరోపియన్ జాతీయుల గౌరవాన్ని కూడా తదుపరి కాలంలో ఆయన చూరగొన్నారు

ప్రమాదకరమైన జీవితాన్ని సాగిస్తూ కూడా తనను అర్థం చేసుకోగల మనుషుల నుంచి తప్ప ఎవరినుంచీ ఏ సహాయమూ ఆశించకుండా మోతీలాల్ ఘోష్ తన దేశానికి ఒక వరవడిని చూపి పోయాడు. ఆ వరవడిని ఆంగ్లకవి "టెన్నిసన్ మాటలలో చెప్పాలంటే"–

"అతడొక సాహస హృదయుడు
....... కర్తవ్య దీక్షాపరుడు
శ్రమించి, శోధించి, అంతు కనుగొనడమే కాని
తలవంచి లొంగిపోయి ఎరుగడు."

*Printed at* Printsman, 18A/11, Doriwalan, New Delhi–110005